ABN ఆంధ్రజ్యోతి
1 వ వార్షికోత్సవం

# ఆంధ్రజ్యోతి

Andhra Jyothi Anniversary
ఆంధ్రజ్యోతి 8 వ వార్షికోత్సవము

15 - 10 - 2010    88 పేజీలు..




## సాంస్కృతిక సౌరభం.. గుంటూరు జిల్లా సిరిసంపదల భాండాగారం



భవిష్యత్‌తో బంధం...
'భాష్యం'!
నిరంతర విజయాలు !
WE WANT 100
10TH EXAMINATI
అధునాతన సైన్స్, కంప్యూటర్ ల్యాబ్‌లు ❖ ప్రాజెక్ట్ బేస్డ్ ఎడ్యుకేషన్‌కు ప్రాధాన్యం
కమ్యూనికేషన్ స్కిల్స్‌పై ప్రత్యేక దృష్టి ❖ లేటెస్ట్ టీచింగ్ ఎయిడ్స్‌తో బోధన
సాటిలేని సౌకర్యాలు !
ఫీల్డ్ ట్రిప్స్ సెమినార్స్ నిర్వాహణ ❖ ఇంటరాక్టివ్ మెథడ్స్‌తో బోధన
స్ట్రెస్ ఫ్రీ ఎడ్యుకేషన్‌పై ప్రత్యేక దృష్టి ❖ స్లో లెర్నర్స్‌పై అదనపు శ్రద్ధ
నిజమైన ప్రమాణాలు !
NCC TRAINING
మరువలేని అనుభూతులు !
ఇండోర్ అవుట్‌డోర్ స్పోర్ట్స్‌కు ప్రోత్సాహం ❖ క్రీడాంశాల్లో ఎక్స్‌పర్ట్స్‌చే అదనపు శిక్షణ
సుశిక్షితులైన సిబ్బందితో భద్రతా ఏర్పాట్లు ❖ విద్యార్థుల ఆరోగ్యంపై నిరంతర పర్యవేక్షణ
సరళమైన స్టడీ మెటీరియల్స్ ❖ సన్నిహితంగా మెలిగే అధ్యాపక బృందం
సూక్ష్మస్థాయి బోధనకు ప్రాధాన్యం ❖ ప్రతి విద్యార్థిపై ఇండివిడ్యువల్ అటెన్షన్
విశిష్ట విద్యానిలయాలు !
BIIT
Bhashyam's IIT Foundation Academy
భాష్యం
విద్యా సంస్థలు
CENTRAL OFFICE : 3rd Lane, Chandramouli Nagar, Ring Road, GUNTUR. A.P. India. Tel : 0863 - 2242051 / 58
Mobile : 98485 36947 GUNTUR : Ring Road, Mbl : 98485 36947, Sambasivapet, Mbl : 98488 84695,
TENALI : Burripalem Road, Mbl : 99481 68855, NARASARAOPET : Ramireddypet, Mbl : 98486 56333, 92470 51025,
ONGOLE : Ramnagar, 7th Lane, Mbl : 99481 68866, Chirala : Near Port City, Gollapalem, Mbl : 9603544555,
RESIDENTIAL CAMPUSES (Boys & Girls) GUNTUR : Gorantla : Mbl : 99483 12471, 98485 36951,
99489 94813, (Girls) : Gorantla : Mbl : 99486 12381, 9246864689,
VISAKHAPATNAM : (Boys - X) Sujatha Nagar, Mbl : 98488 84697, (Boys : VI-IX) Kothavalasa,
Mbl : 99483 12465, (Girls) Naiduthota Mbl : 99489 94817, TIRUPATHI : (Boys) New Balaji Colony,
Mbl : 99488 55592
E-mail : info@bhashyamschools.com website : www.bhashyamschools.com
I.I.T. Chemistry

# నిత్య శ్రామికునికి శుభాకాంక్షలు



సరస్వతిపై సమరం



ప్రజాసమస్యలు వింటూ



చెక్కుల పంపిణీ



జనం సమస్యలపై అధికారులతో చర్చిస్తూ



పాఠశాలను ప్రారంభిస్తూ



అంబుజాపై యుద్ధభాజా



అంబుజా ఆగడాలపై మాటలతో



విద్యార్థుల భవితే ధ్యేయంగా




పదవున్నా లేకపోయినా పదేళ్లపాటు గురజాల నియోజకవర్గ ప్రజలకు వెన్నుదన్నుగా వుండి ... పట్టువదలని విక్రమార్కుని వలే పోరాడి 2009 ఎన్నికల్లో విజయదుందుభి మోగించిన 'మంచికల్లు శ్రీనన్న' ప్రస్థానం రాజకీయ లోకానికే ఆదర్శప్రాయం. మాటల్లోనూ... చేతల్లోనూ... పల్నాటి పౌరుషాన్ని చూపిస్తూ రాజకీయాలకతీతంగా నిరంతరం నియోజకవర్గ అభివృద్ధే ధ్యేయంగా పనిచేస్తూ నిత్యం ప్రజలకు అందుబాటులో వుంటున్న యరపతినేని శ్రీనివాసరావు ఎమ్మెల్యేగా లేని గడచిన పదేళ్ల కాలం గురజాలకు గ్రహణకాలం. అయినా... ఆ చేదు గుర్తులను చెరుపుతూ అట్టడుగు వర్గాల వారికి సైతం అభివృద్ధి ఫలాలను అందించాలన్న ధ్యేయంతో పనిచేస్తూ, సిమెంట్ ఫ్యాక్టరీల స్థాపన పేరుతో స్థానికుల పొట్టకొట్టిన యాజమాన్యాలపై యరపతినేని సాగిస్తున్న పోరు పల్నాటి ఉద్యమాలకు స్ఫూర్తిదాయకం. మా నేత ... ఈ యువనేత ... ఖచ్చితంగా గురజాల నియోజకవర్గ అభివృద్ధికి దిశా, దశలను నిర్దేశించే దమ్ము, ధైర్యం వున్నవాడన్న సంపూర్ణ నమ్మకంతో మా ఎమ్మెల్యే శ్రీ యరపతినేని శ్రీనివాసరావు గారికి దసరా, దీపావళి శుభాకాంక్షలు.

ఇట్లు :

**గురజాల నియోజకవర్గ ప్రజలు, పార్టీ నాయకులు, కార్యకర్తలు**

**యరపతినేని శ్రీనివాసరావు**

శాసనసభ్యులు, గురజాల

## కృష్ణానది తీరాన.. ఎగువ పల్నాట

# ఏకైక శైవక్షేత్రం సత్రశాల



(ఆన్‌లైన్, రెంటచింతల)

రెంటచింతల మండలంలోని సత్రశాల వద్ద కృష్ణానది తీరాన వెలసిన శ్రీ గంగా భ్రమరాంభ సమేత మల్లేశ్వర స్వామి వారి శైవక్షేత్రం ఎగువ పల్నాడులో వున్న ఏకైక పుణ్యక్షేత్రం. రెంటచింతల మండలం జెట్టిపాలెం గ్రామ పంచాయతీ పరిధిలో వున్న ఈ పుణ్యక్షేత్రాన్ని ఏటా మహాశివరాత్రి, కార్తీక పౌర్ణమి లాంటి పర్వదినాలలో వేలాది మంది భక్తులు తరలివస్తారు. పవిత్ర కృష్ణానదిలో పుణ్యస్నానాలు ఆచరించి శ్రీ మల్లేశ్వర స్వామివారిని దర్శించుకుంటారు. ప్రకృతి శోభాయమానంగా, ఆహ్లాదకరమైన కృష్ణానది పరవళ్ళుతో అతి సుందరమైన అరణ్య ప్రకృతి భక్తులను తన్మయం గావించే ఈ సుందర పుణ్యక్షేత్రం దశాబ్దాలు గడుస్తున్న ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్న చందంగా వుంది. పాలకుల నిర్లక్ష్య వైఖరికి నిలువుటద్దంగా నిలిచింది. సత్రశాల పుణ్యక్షేత్రాన్ని రాష్ట్ర పర్యాటక కేంద్రంగా తీర్చిదిద్దుతామని పాలక ప్రభువులు ఇచ్చిన హామీలు కృష్ణానది నీటి పై నేటికీ తేలియాడుతూనే వున్నాయి. ఈ నాటికి సత్రశాల పుణ్యక్షేత్రానికి ఎర్ర బస్సు సౌకర్యం లేకపోవడం మరింత విచారకరం. ఈ పుణ్యక్షేత్రానికి సంబంధించిన పూర్వాపరాలను పరిశీలిస్తే బ్రహ్మర్షి విశ్వామిత్రుడు తపస్సు నాచరించిన నేల. మహోన్నత పదవి సాధించవలయునన్న కొరికతో తన కున్న సర్వ సంపదలు త్యాగం చేసి రాజర్షి, బ్రహ్మర్షి కావలయుననే తలంపుతో తాను సాధించిన సమస్త శక్తులు శ్రీరామునికి ధార బోసి విశ్వ కళ్యాణమునకు దోహదం చేసెను. లోక కళ్యాణార్థమై విశ్వామిత్రుడు గావించిన ఈ షడ్గుణ నాశనకరమైన యజ్ఞము తొలియుగంలో ఋష్యాదులు గాని, చక్రవర్తులు గాని చేసియుండలేదు. 'బ్రహ్మఋషి' అనబడే మహోన్నత పదవిని అలంకరించుటకు కౌశికుడు గావించిన ఈ సత్రయాగ స్థలములో పరమేశ్వర లింగం ప్రతిష్టించి మల్లి కుసుమంబులు, అర్జున పుష్పంబులచే పూజించుచు యాగము నిర్వర్తించుటే పరమేశ్వరునకు 'మల్లిఖార్జున లింగము' అనియు, శ్రీ మహా విష్ణువు వామన రూపము దాల్చిన ఈ వనమునకు 'సిద్ధవనమ నియు', విశ్వామిత్రుడు 'సత్రయాగము' చేయుట వలన ఈ ప్రదేశమునకు 'సత్రశాల' అనియు శ్రీరాముడు తన అమోఘమైన ధనుర్విద్యా కౌశలముతో యస్త్ర శస్త్రంబులచే ఛత్రాకారము నిర్మించుటచే 'శస్తశాల' అని నామధేయములు ఏర్పడి మహాక్షేత్రమై విరాజిల్లుతున్నది. పవిత్ర గంగా జలాలు ఉత్తర ముఖముగా ఏ ప్రాంతములో ప్రవహించునో, అచ్చట దివ్య పురుషులు నివాస ముండెదరని, వేద ప్రామాణ్యము ప్రతి 12 ఏళ్ళకొకసారి గంగానది అంతర్వాహిని పై కృష్ణానదిలో కలియుచుండును. ఆ కాలములోనే బృహస్పతి కన్యా లగ్నమున ప్రవేశించును. ఆ కాలమే పుష్కరిణులు సర్వ పాప హారమైనదగును. హరిహర శక్తితో ఏర్పడిన ఆ క్షేత్ర రాజము హరిహర రూపాలకు బేధాలున్నను వారిలోయున్న దివ్య శక్తులకు బేధములు లేవని నిరూపించిన మహాక్షేత్రమే నేటి 'సత్రశాల' క్షేత్రము. ఈ క్షేత్రమున అనేక మంది సిద్ధ పురుషులు తరించిన వారి సమాధులు కూడా కలవు. ఈ క్షేత్రమున శ్రీ మల్లిఖార్జున స్వామి గర్భాలయములో లింగం నుండి 'ఓంకార' ధ్వని ఎల్లప్పుడు వినిపిస్తుంటుంది. ఈ క్షేత్రమున త్రేతా, ద్వాపరయుగములలో శ్రీ చెన్నకేశవస్వామి గాను, కలియుగంలో శ్రీ వెంకటేశ్వర స్వామి గాను అవతరించి ఈ సత్రశాలకు క్షేత్ర పాలకునిగా శ్రీ మహా విష్ణువు వుండిపోయెను.



గర్భాలయంలోని శివలింగం



శ్రీ గంగా భ్రమరాంబ అమ్మవారు

### సత్రశాలలో నేల వాలని 'కాకులు'

బ్రహ్మర్షి కావలయునని విశ్వామిత్రుడు ఐదవ దినంబున లోభ, మోహమనెడి గుణములను యాగ గుండమున కాహుతి చేయుచుండెను. ఇంతలో దైతా కుమారుడైన కాకాసరుడను రాక్షసుడు తన తల్లిదండ్రులను చంపిన నరాధముల పై పగదీర్చుకొనేందుకు కొంతమంది రాక్షసులను వెంటబెట్టుకొని వారి కామరూప విద్యలతో వాయస రూపములు ధరించి విశ్వామిత్రుని నిష్టను భగ్నము చేయదలెంచును. యాగ స్థలమంతయు గగ్గోలు చెందునట్లుగా కావు కావు మని పెను కేకలు వేయుచుండిరి. ఆ వాయస రోదన విశ్వామిత్రుని కర్ణపుటములకు సోకెను. అదుకు మహావేశపూరితుడై కాకి షోకములుగా గాంచి, అవి నిజమైన కాకులుగా భావించి ఈ నీచ వాయసములు నా యాగశాల ప్రాంగణము నందు ఎక్కడ వాలినా అవి నిలువునా జీవము కోల్పోవును గాక యని వాటిని శపించెను. ఈ శాప కారణముగా ఎక్కడి కాకులు అక్కడే పడి ప్రాణములు విడిచెను. నాటి నుండి నేటి వరకు విశ్వామిత్రుని శాప భయముచే నేటికీ సత్రశాల ప్రాంగణమున కాకులు వాలవని ప్రతీతి కలదు. ఇంతటి మహాచరిత్రను కలిగిన ఈ పుణ్యక్షేత్రమును ఇప్పటికైనా పాలక మహాశయులు భక్తి భావముతో ఆలకించి రాష్ట్ర పర్యాటక కేంద్రముగా తీర్చిదిద్దుతామన్న హామీని నిలబెట్టుకొని శ్రీ మల్లయ్య స్వామి ఆశీస్సులు పొందాలని ఇక్కడి ప్రజలు కోరుకుంటున్నారు.



# ఆంధ్రజ్యోతికి
# 8వ వార్షికోత్సవ
## శుభాకాంక్షలు





అక్షరం ఒక అగ్ని
అది గుప్పెడు
కలిస్తే శతఘ్ని

అక్షరం ఒక
అంకురం
అది దుర్నీతిపై
అంకుశం

అక్షరం ప్రగతికి ప్రతీక
అది కోట్లాది
ప్రజల గుండె
చప్పుళ్ల పతాక

అక్షర యజ్ఞం
చేస్తూ నీతికి
పట్టం కడుతున్న
'ఆంధ్రజ్యోతి'కి
జేజేలు...

శుభాభినందన మందారాలతో...

# ప్రత్తిపాటి పుల్లారావు

జిల్లా తెలుగుదేశం పార్టీ అధ్యక్షులు
శాసనసభ్యులు, చిలకలూరిపేట.

# స్వాతంత్ర్య సంగ్రామంలో తెనాలి యోధుల త్యాగం



**(యార్లగడ్డ శరత్‌బాబు, తెనాలి)**

స్వాతంత్ర్య సంగ్రామంలో తెనాలి ప్రాంతం కీలక పాత్ర నిర్వహించింది. స్వాతంత్ర్య సాధనలో తెనాలి ప్రముఖ స్థానాన్ని పొందటం వెనుక అనేకమంది త్యాగమూర్తుల త్యాగం ఇమిడి ఉంది. తమ జీవితాన్ని ఉద్యమానికి ఎందరో ధారపోసి తెనాలికి కీర్తి ప్రతిష్ఠలు సంపాదించారు. అందుకే భారత జాతీయోద్యమ చరిత్రలో తెనాలి సంఘటనలకు సముచిత స్థానం ఉంది. 1920-47 మధ్య కాలంలో జాతీయోద్యమానికి తెనాలి తాలూకాలో అపూర్వ స్పందన వచ్చింది. ఆస్తులను సైతం త్యాగం చేసి దేశభక్తి ప్రేరణతో స్వరాజ్య సాధనే ధ్యేయంగా ఉద్యమించి అసువులు బాసిన వారు కొందరైతే జైలు జీవితం గడిపిన వారు అనేక మంది ఉన్నారు. 1932 జూన్, జూలై నెలల్లో 104 మందిని శాసనోల్లంఘన సందర్భంగా ప్రభుత్వం అరెస్ట్ చేసి జైలుకు పంపింది. ఉద్యమంలో భాగంగా 1940లో స్వచ్ఛందంగా అరెస్టయిన వారి సంఖ్య వందల్లో ఉంది. క్విట్ ఇండియా సందర్భంగా 1942 ఆగస్టు 12న తెనాలిలో జరిగిన ప్రజాందోళన, పోలీసు బలగాలతో జరిగిన ముఖాముఖి పోరాటం, ఈ సందర్భంగా రైల్వే ఆస్తులకు కలిగిన నష్టం జాతీయ నాయకుల దృష్టిని ఆకర్షించింది. ఈ పోరాటంలో ఏడుగురు మృతి చెందారు. ఈ వార్త దావానలంలా వ్యాపించి బ్రిటీష్ సామ్రాజ్యవాదుల దృష్టిలో నిలిచింది.



అమరవీరుల స్మృతి చిహ్నంగా తెనాలి రణరంగ్ చౌక్‌లో నిర్మించిన ఏడు స్థూపాలు

## తెనాలిలో జాతీయ పాఠశాల

జాతీయోద్యమంలో తొలితరం నాయకులైన బాలగంగాధర తిలక్, అనీ బిసెంట్ నాయకత్వాన హోం రూల్ ఉద్యమం ప్రారంభమైంది. విదేశీ వస్తు బహిష్కరణ, స్వదేశీ వస్తు వినియోగానికి ప్రోత్సాహం, జాతీయ విద్యాలయాల స్థాపన ఈ ఉద్యమ లక్ష్యాలు. 1907లో మచిలీపట్నంలో ఏర్పాటైన జాతీయ పాఠశాలలో తెనాలి ప్రాంతానికి చెందిన కొందరు శిక్షణ పొంది 1920 ప్రాంతంలో తెనాలిలో జాతీయ పాఠశాల ప్రారంభించారు. జాతీయవాదులకు ఈ పాఠశాల స్థావరంగా పనిచేసింది. సత్యాగ్రహ ఉద్యమానికి అంకురార్పణగా 1921 మార్చి 21న విజయవాడలో అఖిలభారత కాంగ్రెస్ సమావేశం రాష్ట్రంలో వేలాది యువకులను ఆకర్షించింది. తెనాలి ప్రాంతం నుంచి కన్నెగంటి సూర్యనారాయణ, కుప్పా ఆంజనేయశర్మ, శరణు రామస్వామి చౌదరి, వి.సీతారామయ్య హాజరయ్యారు. దీని ప్రభావంతో తెనాలిలో సహాయ నిరాకరణ కార్యక్రమం - ప్రారంభమైంది. 1930లో మహాత్మాగాంధీ నాయకత్వంలో సహాయ నిరాకరణ సత్యాగ్రహానికి స్పందించి బందరులో నేషనల్ కాలేజి, ఏలూరులో జాతీయ విద్యాలయం ఏర్పాటు కాగా, తెనాలిలో మల్లాది దేవేంద్రుని సారథ్యంలో గోఖలే జాతీయ పాఠశాల, కొల్లూరులో మరో జాతీయ పాఠశాల వెలిశాయి. పన్నుల నిరాకరణోద్యమంలో తెనాలికి చెందిన శరణు రామస్వామి చౌదరి గ్రామ గ్రామానతిరిగి ఉద్యమం వ్యాప్తి చేశారు.

## విదేశీ వస్త్ర బహిష్కరణ

ఖద్దరు ఉద్యమ వ్యాప్తికి గాంధీజీ దేశ పర్యటన జరుపుతూ విదేశీ వస్త్ర బహిష్కరణ పిలుపునిచ్చారు. అప్పట్లో ఐతానగర్‌లో ఈదర అమ్మయ్య ఇంటి ముందు విదేశీ దుస్తుల దహనానికి శ్రీకారం చుట్టారు. అమ్మయ్య తన విదేశీ కోట్లు, షర్టు దహనం చేశారు.

## ఉప్పు సత్యాగ్రహం

ఉప్పు సత్యాగ్రహంలో తెనాలి ప్రాంతీయులు 1930 నాటికి 400 మంది జాతీయోద్యమంలోకి ప్రవేశించారు. కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి (కొల్లూరు), చింతమనేని భావయ్య (సంగంజాగర్లమూడి), రావి రంగారావు (తెనాలి), అప్పసాని సాంబయ్య చౌదరి (వేటపాలెం), శరణు రామస్వామి జైలు శిక్ష కూడా అనుభవించారు. తెనాలిలో కొల్లా కనకవల్లి తాయారమ్మ జైలు శిక్ష అనుభవించారు. 1930 గుంటూరు యడవల్లివారి సత్రంలో ఏర్పాటు చేసిన సత్యాగ్రహ శిబిరాన్ని మూసేయటానికి ప్రభుత్వం రిజర్వు దళాలను పంపారు. దీనికి నాగళ్ల కృష్ణయ్య శిబిర దళాధిపతిగా ఉన్నారు. ఆయన పోలీసుల ప్రవేశాన్ని అడ్డుకోగా లాఠీ దెబ్బలతో నేలకొరిగారు. ఈ దృశ్యాల్ని చూసి ఆచార్య ఎంజీ రంగా భారతీదేవి కలెక్టర్‌ను కలిసి నిరసనను వ్యక్తం చేశారు. ఈ సంఘటనను చూసిన శాంతి కాముకులందరూ కృష్ణయ్య సహనాన్ని మెచ్చుకున్నారు. అప్పటి నుంచి వారిని గాంధీ కృష్ణయ్య అని పిలిచారు.

## రైతు ఉద్యమం

ప్రపంచాన్ని ముంచెత్తిన ఆర్థిక సంక్షోభం (1929-33) ఆంధ్రాలో రైతుల వెన్నువిరిచింది. అప్పుడు రైతుల రక్షణ కోసం (మిగతా 7వ పేజీలో)

# స్వాతంత్ర్య సంగ్రామంలో...

(6వ పేజీ తరువాయి)

ఆచార్య ఎన్‌జీ రంగా గ్రామగ్రామాన రైతు రక్షణ సమితులు ఏర్పాటు చేశారు. జాతీయోద్యమాన్ని రైతు ఉద్యమం దెబ్బతీస్తుందని కొందరు వ్యతిరేకించినా గూడవల్లి రామబ్రహ్మం, ఆచార్య రంగాకు సహకరించారు. ఫలితంగా 1931 తెనాలిలో అఖిలాంధ్ర రైతు సభ జరిగింది. మహాసభకు అధ్యక్షత వహించిన రామబ్రహ్మం రైతులను ఆకట్టుకునేలా ప్రసంగించారు. సత్యాగ్రహ శిబిరాలను కొంతకాలం పర్యవేక్షించారు. 1940లో రెండో ప్రపంచ యుద్ధం జరుగుతుండగా గాంధీజీ మూకుమ్మడి సత్యాగ్రహాలు వద్దని, వ్యక్తి సత్యాగ్రహాలు మాత్రమే చేయాలని సూచించారు. తెనాలి తాలూకా పెదరావూరులో వ్యక్తి సత్యాగ్రహం నిర్వహిస్తున్న శరణు రామస్వామి, రెండో ప్రపంచ యుద్ధంలో ప్రభుత్వానికి సహకరించవద్దంటూ ఉపన్యసిస్తుండగా నిర్బంధంలోకి తీసుకున్నారు. అదే రోజున తెనాలిలో రావి సత్యనారాయణ, నన్నపనేని వెంకట్రావు వ్యక్తి సత్యాగ్రహం చేయగా నిర్బంధించి తిరుచునాపల్లి జైలుకు పంపారు.

## క్విట్ ఇండియా ఉద్యమం (1942)

బ్రిటీష్ సామ్రాజ్యవాదులను తరిమేందుకు ప్రారంభించిన క్విట్ ఇండియా ఉద్యమం పిలుపునకు మంచి స్పందన లభించింది. ఉత్సాహంగా ప్రారంభమైన సత్యాగ్రహాన్ని చల్లార్చేందుకు బ్రిటీష్ ప్రభుత్వం అదే రాత్రి గాంధీజీ, అఖిల భారత భారత కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ అగ్ర నాయకులను అరెస్ట్ చేసి అజ్ఞాత ప్రదేశానికి తరలించింది. ముంబై సమావేశంలో పాల్గొన్న కల్లూరి చంద్రమౌళి, వెలువోలు సీతారామయ్య, పుతుంబాక శ్రీరాములు, అవుతు సుబ్బారెడ్డి, శరణు రామస్వామి తెనాలి తిరిగి వచ్చారు. స్థానిక ఓల్డ్ టౌన్‌లోని వెర్రెయ్య మేడపై గల జిల్లా కాంగ్రెస్ కార్యాలయంలో ఏర్పాటు చేసిన సమావేశంలో ఏఐసీసీ రూపొందించిన కార్యాచరణను వివరించారు. గాంధీజీ అరెస్టుకు నిరసనగా మరుసటిరోజు పట్టణ బంద్‌కు పిలుపునిచ్చారు. ఈ వెంటనే పోలీసులు ఈ సమావేశాన్ని చెదరగొట్టి నాయకుల్ని అరెస్ట్ చేశారు. పట్టణ కాంగ్రెస్ అధ్యక్ష, కార్యదర్శులుగా ఉన్న నన్నపనేని వెంకట్రావు, రావి అమ్మయ్యల నాయకత్వంలో తాలూకా హైస్కూల్ విద్యార్థులు వేలాది మంది ప్రదర్శన నిర్వహించారు. రైల్వేస్టేషన్ సమీపంలోని ఒక హోటల్ బంద్ పాటించలేదని ఫర్నీచర్, సామాగ్రి బయటపడేశారు. రైల్వేస్టేషన్‌లో ఫ్రూట్‌స్టాల్, హోటల్‌ను కూడా మూయించారు. స్పెన్సర్ క్యాంటీన్‌లో ప్రవేశించి మద్యం సీసాలను ధ్వంసం చేశారు. ముందుగా నార్త్ క్యాబిన్ దగ్గరలోని ఆయిల్ ట్యాంక్‌కు నిప్పంటించారు. రెండు వ్యాగన్లలో గల షాహి డక్కన్ సిగరెట్ ప్యాకెట్ల దిండ్లను ప్లాట్‌ఫాంపై వేసి తగులపెట్టారు. చెన్నై నుంచి వచ్చిన నైన్‌డౌన్ పాసింజర్‌లో ప్రయాణీకులు దిగాక నాలుగు బోగీల్లో కిరోసిన్ పోసి నిప్పంటించారు. అక్కడ నుంచి కొత్తపేటలోని సబ్ ట్రెజరీ కార్యాలయానికి ప్రదర్శకులు స్టేషన్ రోడ్డు దాటి వెళుతుండగా మలుపువద్ద పోలీసులు ప్రదర్శకులను చుట్టుముట్టారు. ప్రస్తుతం పెట్రోలు బంక్ ఉన్న చోట గల కట్టెల అడితీలోని కట్టెల్ని పోలీసులపైకి ప్రదర్శనకారులు విసిరారు. మధ్యాహ్నానికి జిల్లా కలెక్టర్, ఎస్పీ బస్సులో రిజర్వు పోలీసులతో తెనాలి చేరుకుని, హెచ్చరికలు చేసినా ప్రజలు ఖాతరు చేయలేదు. అధికారులు కాల్పులకు ఆదేశాలిచ్చారు. మాజేటి సుబ్బారావు, శ్రీగిరి లింగం, లక్ష్మీనారాయణ, తమ్మినేని సుబ్బారెడ్డి, గాలి రామకోటయ్య, ప్రయోగ రాఘవయ్య, జాస్తి అప్పయ్య పోలీసుల తూటాలకు బలయ్యారు. తెనాలి రైల్వేస్టేషన్ దగ్ధం చేసిన కొద్ది గంటల్లోనే దుగ్గిరాల రైల్వే స్టేషన్ కూడా తగులబెట్టారు. దీంతో పలువురిని అరెస్ట్ చేసి ప్రత్యేక కోర్టులో విచారించి శిక్షలు విధించారు. అంతేకాక తెనాలి ప్రజలపై రెండు లక్షల అపరాధ పన్ను విధించారు. అరెస్ట్ అయిన వారిలో అప్పటి మున్సిపల్ ఛైర్మన్ రావి సత్యనారాయణ, వారి సోదరులు రావి అమ్మయ్య ఉన్నారు.

ఈ పోరాటం అప్పటి బ్రిటీష్ ప్రధాని విన్‌స్టన్ చర్చిల్, సింగపూర్‌లో ఉన్న నేతాజీ దృష్టికి కూడా వెళ్ళింది. ఈ సంఘటనను బెర్లిన్, టోక్యో రేడియోలు ప్రముఖంగా ప్రస్తావించాయి. పోలీసులతో పోరాటం జరిగిన స్థలాన్ని 'రణ రంగ చౌక్'గా నామకరణం చేశారు. 1959లో మున్సిపల్ ఛైర్మన్ ఆలపాటి వెంకట్రామయ్య ఈ ప్రదేశంలో ఏడుగురు అమరవీరుల స్మృతికి చిహ్నంగా ఏడు స్థూపాలను నిర్మించారు. అదే సంవత్సరం డిసెంబర్ 20న అప్పటి ఏఐసీసీ అధ్యక్షుడు కామరాజ్ నాడార్ ఈ స్థూపాలను ఆవిష్కరించగా, ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డి, కాసు బ్రహ్మానందరెడ్డి, దామోదరం సంజీయ్య, వెనిగళ్ళ సత్యనారాయణ పాల్గొన్నారు.

(ఆన్‌లైన్ -దుర్గి)

" కన్నెగంటి హనుమంతు
కోర మీసము ద్రిప్పి
పలనాటి ప్రజలచే
పన్నులెగ బెట్టించె
బలియిచ్చే హనుమంతును పల
నాడు
పరప్రభుత్వపు గుండ్లకు"
అభ్యుదయ కవి
స్వర్గీయ పులుపుల శివయ్య..

# పల్నాటి బెబ్బులి కన్నెగంటి హనుమంతు

సిరిసంపదలకు నిలయం మన భారతదేశం. పరాయి పాలకుల కబంధహస్తాల చిక్కిన భరతమాతకు విముక్తి కలిగించాలని ఎందరో దేశభక్తులు అహర్నిశలు పోరాడారు. ఉరికొయ్యలను ఉయ్యాలలుగా, తెల్లదొరల తుపాకీ గుండ్లను పూలచెండ్లుగా ఆహ్వానించారు. స్వేచ్ఛావాయువుల కోసం రగిలిన సమర జ్వాలాగ్నికి సమిధలయ్యారు. ఈ కోవకు చెందినవాడే 'పల్నాటి బెబ్బులి' కన్నెగంటి హనుమంతు. ఆయన పేరు వింటేనే బ్రిటిష్ అధికారులకు వెన్నులో వణుకు పుట్టేది. నాటి బ్రిటిష్ ప్రభుత్వానికి సింహస్వప్నమైన హనుమంతు శ్వేత జాతి ప్రభుత్వానికి వ్యతిరేకంగా పుల్లరి ఉద్యమం నడిపి, వారి తుపాకీ గుండ్లకు బలయ్యారు. స్వాతంత్ర్య పోరాట చరిత్రలో హనుమంతు వీర గాధ ఒక ఉజ్వల ఘట్టంగా రూపొందింది. 1870లో దుర్గి మండలం మించాలపాడులో వెంకటప్పయ్య, అచ్చమ్మ దంపతులకు జన్మించారు. వ్యవసాయ కుటుంబంలో పుట్టిన కన్నెగంటిని 1920లో కాంగ్రెస్ పార్టీ ఇచ్చిన సహాయ నిరాకరణ పిలుపు స్వాతంత్ర్య పోరాటంవైపు నడిపింది.

## పల్నాడులో దోపిడీ విధానం

సహాయ నిరాకరణోద్యమం నాటికి పల్నాడు ప్రాంతం 91 గ్రామాలు, మూడు తాలూకాల స్థాయి విస్తీర్ణంతో 1,92,039 జనాభా కలిగి వుంది. విస్తారంగా పాలరాయి, సిమెంట్‌రాయి, ఇనుప గనులు, విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయగల ఎత్తిపోతల జలపాతం, వేలాది ఎకరాల సారవంతమైన భూములున్నా ప్రజలు కూటికి, గుడ్డకి అల్లాడిపోవాల్సిన దుస్థితి నెలకొనివుంది. పల్నాడులో ప్రజల జీవనాధారం వర్షమే. సకాలంలో వర్షాలు లేక, పంటలు పండక ఏటా కరువు కాటకాలు సంభవించడం పరిపాటైంది. పొలాలు పండినా, ఎండినా శిస్తులు మాత్రం చెల్లించక తప్పేది కాదు. మరోవైపు గ్రామాధికారులు ప్రజలను రాబందుల్లా పీక్కుతినేవారు. ఫారెస్ట్ గార్డుల ఆగడాలు శృతిమించాయి. పశువుకు రెండు రూపాయల చొప్పున అడవి పుల్లరి (సెస్సు) చెల్లిస్తేనే పశువులను మేత కోసం అడవిలో అనుమతిస్తున్నారు. బ్రిటిష్ పాలకుల దురాగతాలను ఎండగట్టే లక్ష్యంతో హనుమంతు ప్రజలను శిస్తులు చెల్లించవద్దని పిలుపునిచ్చారు. దీంతో ఆయనపై ప్రభుత్వం కక్షగట్టింది. కన్నెగంటి పిలుపుతో ప్రజలు శిస్తులు కట్టడం మానేశారు. అధికారులకు మంచినీళ్ళు కూడా పుట్టటం లేదు. బట్టలు ఉతకడం, క్షవరం చేయడం వంటి పనులు స్తంభించిపోయాయి. దీంతో ప్రభుత్వం పల్నాటి ఉద్యమాన్ని అణచివేయటానికి మన్యం తిరుగుబాటును నిరంకుశంగా అణచిన రూథర్‌ఫర్డ్‌ను కలెక్టర్‌గా ఇక్కడ నియమించింది.

## పోలీస్ దాడులు

పల్నాడులో సమర్ధవంతంగా జరుగుతున్న సహాయ నిరాకరణ ఉద్యమాన్ని నీరుగార్చటానికి ప్రభుత్వం పోలీస్, మిలటరీ దాడులకు పాల్పడింది. మొదట రామాపురం, జెట్టిపాలెం, జంగమహేశ్వరపురం తదితర గ్రామాలపై ఈ దాడులు జరిగాయి. పోలీసులు ఇళ్ళలో జొరబడి దోచుకోవడమేగాక, స్త్రీలపై అత్యాచారాలు జరిపారు. అనేకమందికి కాళ్ళు, చేతులు విరిచారు. అయినా శిస్తు చెల్లింపు నిరాకరణను ప్రజలు పాటిస్తూనే వున్నారు. ఉద్యమం తీవ్ర రూపం దాల్చింది. ఈ నేపథ్యంలో రూథర్‌ఫర్డ్ కన్నెగంటికి ధనాశ చూపి ఉద్యమం నుంచి వైదొలిగించడానికి వ్యూహరచన చేశాడు. కోలగుట్ల కరణం సదాశివయ్యను హనుమంతు వద్దకు రాయబారిగా పంపాడు. సదాశివయ్య మోసపూరిత మాటలు హనుమంతులో పట్టరాని ఆగ్రహాన్ని తెచ్చాయి. 'ఉద్యమం నా ఊపిరి... ప్రజలే నా సర్వశ్వం... ఉద్యమాన్ని విరమించుకొని ప్రజలకు ద్రోహం చేయం...' అని హనుమంతు గర్జించాడు.

## మించాలపాడుపై మిలటరీ దాడి

మించాలపాడు కేవలం 125 కుటుంబాలు కలిగిన ఓ కుగ్రామం. గ్రామానికి మూడు వైపులా కొండలు, ఉత్తరం దిక్కున దట్టమైన అడవి. 1922 ఫిబ్రవరి 22న మహా శివరాత్రి ఉత్సవాల్లో ప్రజలు నిమగ్నమై వుండగా, కోలగుట్ల కరణం సదాశివయ్య, దుర్గి సబ్ ఇన్‌స్పెక్టర్ రాఘవయ్య వందమంది మిలటరీ దళంతో మించాలపాడుకు బయలుదేరారు. ఊరికి దక్షిణ భాగంలో కొండలోయ వద్ద వున్న బావికి మంచినీళ్ళ కోసం వచ్చిన మించాలపాడు పశువుల్ని ముట్టడించారు. ముటుకూరు బందెల దొడ్డికి తోలుకువెళ్తున్న వారిని అడ్డుకున్న హనుమంతు అల్లుడు పసుపులేటి చిన్నయ్యను తుపాకీ మడమతో కొట్టి హింసించారు. ఆగ్రహించిన పశువుల కాపరులు వారిపై రాళ్ళురువ్వగా, లాఠీచార్జ్ జరిపారు. విషయం తెలుసుకుని నిరాయుధుడుగా బయలుదేరిన హనుమంతును గ్రామస్తులు అనుసరించారు. ఆరు అడుగుల ఎత్తు... విశాలమైన ఛాతి... దట్టమైన కోర మీసం... బలిష్టమైన బాహువులు కలిగి తలపాగ ధరించి వస్తున్న కన్నెగంటిని చూడగానే దళం వెన్నులో వణుకుపుట్టింది. భయంతో కంపించిపోతున్న కరణం సదా శివయ్య 'కన్నెగంటి హనుమంతు మన దగ్గరకు వస్తే బతకనివ్వడు... కాల్చండి..' అంటూ హెచ్చరించడంతో తుపాకులు ఎక్కుపెట్టి, గుళ్ళవర్షం కురిపించారు. హనుమంతు కుడి డొక్కను చీల్చుకొని రక్తం కాలువలయ్యింది. ఈ సంఘటనలో హనుమంతు పాలేరు ఎల్లంపల్లి శేషు అక్కడికక్కడే నేలకొరిగాడు. మరో 28మంది క్షతగాత్రులయ్యారు. రక్తపు మడుగులో పడివున్న హనుమంతు కొనఊపిరితో దాహం.. దాహం అని అంటున్నా బ్రిటిష్ అధికారులు మంచినీళ్ళు ఇవ్వకుండా తుపాకీ మడమతో గొంతుపై నొక్కడంతో తుదిశ్వాస విడిచారు. పోలీసులు హనుమంతు భౌతికకాయాన్ని రాత్రంతా అక్కడే వాగులో వుంచి కాపలాకాసారు. హనుమంతు శవాన్ని ఆయన బంధువులకు ఇవ్వటానికి తెల్లదొరలు నిరాకరించారు. మరుసటి రోజు హనుమంతు మృతదేహాన్ని కోలగుట్ల సమీపంలో వున్న దంతెవాగు వద్దకు తరలించి, శవ పరీక్షల అనంతరం ఖననం చేశారు.

## నిలువుదోపిడీ

హనుమంతు మరణానంతరం మరుసటి రోజు మరో 50 మంది మిలటరీ సిబ్బంది ఊళ్ళోకి ప్రవేశించారు. అప్పటికే ప్రజలంతా కొండల్లో తలదాచుకున్నారు. వృద్ధులు, పిల్లలు మాత్రమే ఉన్నారు. ఇదే అదునుగా వారు ఇళ్ళల్లో జొరబడి నగలు, డబ్బు కొల్లగొట్టారు. హనుమంతును కాల్చిచంపిన వార్త పల్నాడు అంతటా దావానలంలా వ్యాపించింది. దీంతో వారు శిస్తులు చెల్లించడం ప్రారంభించారు. నాలుగోనాడు కొండల్లో దాగి వున్న ప్రజలు గ్రామంలోకి అడుగుపెట్టారు. పోలీసులు గ్రామానికి చెందిన 40 మంది ముఖ్యులను అరెస్టు చేశారు. ఒక్కొక్కరికి 150 రూపాయల జరిమానాతో పాటు ఆరు మాసాల కఠిన కారాగార శిక్ష పడింది. నలబోతుల వెంకయ్యకు మాత్రం 200 రూపాయల జరిమానా, 9 నెలల శిక్ష విధించారు.



రూథర్‌ఫర్డ్ నిర్మించిన కన్నెగంటి సమాధి

## పగ చల్లారని రూథర్‌ఫర్డ్

హనుమంతును కాల్చిచంపించినప్పటికీ కలెక్టర్ రూథర్‌ఫర్డ్‌కు కసి తీరలేదు. దంతెవాగులో వుంచిన హనుమంతు శవాన్ని ప్రజలు ఫోటో తీసుకుంటామని కోరినా అంగీకరించలేదు. సమాధి చేయించి, గోరి కట్టించి, శిలాఫలకం వేయించాడు. అయితే, కొద్దిరోజులకు రూథర్‌ఫర్డ్ ఆ శిలాఫలకాన్ని పెకిలించి హనుమంతు భార్యకు కానుకగా పంపి అపహాస్యం చేశాడు. ఇంకా కసి తీరని రూథర్‌ఫర్డ్ మరో నెల రోజుల తరువాత మించాలపాడు వెళ్ళి హనుమంతు పేర వేసిన శిలాఫలకాన్ని బయటకు తెప్పించాడు. దానిని ముక్కలు ముక్కలుగా పగులగొట్టించి బావిలో పడేసి తన కసిని ప్రదర్శించాడు. హనుమంతు సమాధి నిర్మించిన దంతెవాగు మించాలపాడు కొండల్లో పుట్టి కోలగుట్ల పక్క నుంచి ఆత్మకూరు చెరువుగుండా మాచర్ల మీదుగా చంద్రవంకై ప్రవహిస్తూ ఎత్తిపోతల వద్ద 66 అడుగుల ఎత్తు నుంచి కిందకు జాలువారుతోంది. నాటి నుంచి నేటి వరకు హనుమంతు వాగు ప్రవహిస్తూనే వుంది... ఎత్తిపోతల ఘోషిస్తూనే వుంది... ఆ ఘోష పలనాటి స్వాతంత్ర్య ఘోష... అదే హనుమంతు ఆత్మఘోష...



పుల్లరి నేత కన్నెగంటి

## హనుమంతు కాంస్య విగ్రహ ప్రతిష్ఠ

మాతృదేశం కోసం అశువులు బాసిన హనుమంతు సమాధికి ఇటీవలి వరకు భద్రత లేదు. 1946లో ఆచార్య రంగా హనుమంతు సమాధిని సందర్శించి, మరమ్మతులకు కొంతమేర ధన సహాయం చేశారు. కాలక్రమంలో రక్షణ కరువై ముళ్ళపొదల మధ్యలో, శిథిలావస్థకు చేరింది. ఈ నేపథ్యంలో తెలుగుదేశం పార్టీ ఆధ్వర్యంలో పల్నాటి వీరుల విగ్రహ ప్రతిష్ఠ కమిటీ ఏర్పాటై హనుమంతు సమాధి పునర్నిర్మాణానికి నడుం బిగించింది. రాష్ట్ర ఎక్సైజ్ రిటైర్డ్ జాయింట్ కమిషనర్ మిరియాల అనంతరామయ్య ఆధ్వర్యంలో ఫిబ్రవరి 23న మాచర్ల పట్టణం నడిబొడ్డున హనుమంతు కాంస్య విగ్రహాన్ని ఆవిష్కరించారు. అప్పటి రాష్ట్ర వైద్య ఆరోగ్య శాఖ మంత్రి డాక్టర్ కోడెల శివప్రసాదరావు చేతులమీదుగా ఈ విగ్రహ ప్రతిష్ఠ జరిగింది. అంతటితో ఆగక రెండు లక్షల రూపాయల వ్యయంతో కోలగుట్లలోని హనుమంతు సమాధి పునర్నిర్మాణ పనులకు కూడా శ్రీకారం చుట్టారు.



నిర్మాణంలో వున్న కన్నెగంటి హనుమంతు నూతన ఘాట్

# రె(మ)ంటచింతల



రెంటచింతల ఏరియల్ వ్యూ

(ఆన్‌లైన్, రెంటచింతల)

మలమల మాడ్చే ఎండలతో ప్రతి వేసవి రెంటచింతల అల్లాడిపోతుంది. రాష్ట్రంలోనే అత్యధిక ఉష్ణోగ్రత నమోదయ్యే ప్రాంతంగా గుర్తింపును పొందింది. ఇక్కడ సుమారు 48 డిగ్రీల వరకు నమోదవుతుంటుంది. మండలంలోని గోలి, జెట్టిపాలెం, తుమ్మకోట పంచాయతీల పరిధిలో నాపరాయి గనులు వందలాది ఎకరాలలో విస్తరించి వున్నాయి. భూగర్భంలో అత్యధికంగా వున్న 'రాతి' గనుల కారణంగా రెంటచింతల అధిక ఉష్ణోగ్రత నమోదుకు కారణంగా భావిస్తుంటారు. ప్రతి సంవత్సరం ఏప్రిల్, మే లలో ఇక్కడ కనీసం 45 నుంచి 47 డిగ్రీల సెల్సియస్ వరకు ఉష్ణోగ్రత నమోదు కావడం చూస్తుంటే రెంటచింతలలో ఎండలు ఏ స్థాయిలో వుంటాయో ఊహించవచ్చు. ఇక్కడ వందలాది మంది నాపరాయి గనులపైనే ఆధారపడి జీవిస్తుంటారు. గోలి, జెట్టిపాలెం గ్రామస్తులకు ఈ గనులే ప్రధాన జీవనాధారం.

సుమారు 46 వేల జనాభా కలిగిన రెంటచింతల మండలంలో 11 పంచాయతీలు వున్నాయి. రెంటచింతల మేజరు, మిగిలినవి మైనర్లు. వాణిజ్య పంటలకు ప్రసిద్ధిచెందిన రెంటచింతలలో పత్తి, మిర్చి, వరిని అత్యధికంగా పండిస్తారు. విత్తనాల అమ్మకాలకు రాష్ట్రస్థాయిలోనే పేరుగాంచింది. సుమారు 16 వేల హెక్టార్లలో వాణిజ్య పంటలను సాగుచేస్తుంటారు. విద్యారంగంలోనూ రెంటచింతల ప్రత్యేక గుర్తింపును పొందింది. ఇక్కడ చదివిన విద్యార్థులు దేశవిదేశాల్లో మంచి



మండలం ముఖచిత్ర పటం

ఉద్యోగాల్లో స్థిరపడ్డారు. రెంటచింతల, మంచికల్లు గ్రామాల నుంచి కాయితి వెంకట నర్సిరెడ్డి, యరపతినేని శ్రీనివాస రావులను ఎమ్మెల్యేలుగా అసెంబ్లీకి పంపించిన చరిత్ర రెంటచింతలది. రెంటచింతలలో మొత్తం 11 హైస్కూళ్ళు వున్నాయి. వీటిల్లో 3 ఎయిడెడ్, 2 జడ్పీ, 6 ప్రైవేటు. మండలంలో దాదాపు 33 ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాలలు వుండగా, వేలాది మంది బాలబాలికలు విద్యను అభ్యసిస్తున్నారు. పారిశ్రామికంగా కూడా రెంటచింతల అభివృద్ధి పథంలోకి దూసుకుపోతున్నది. పుణ్యక్షేత్రమైన సత్రశాల కృష్ణానది సమీపంలో పరాశక్తి సిమెంటు కర్మాగారం నెలకొల్పబడగా, మరో రెండు ఫ్యాక్టరీలను నిర్మించేందుకు సన్నాహాలు జరుగుతున్నాయి. కృష్ణానదిపై రూ.500 కోట్లకు పైగా వ్యయంతో 50 మెగావాట్ల విద్యుదుత్పాదన శక్తి సామర్థ్యంగల టెయిల్‌పాండ్ విద్యుత్ ప్రాజెక్టును నిర్మిస్తున్నారు. మండలంలోని పశర్లపాడు దగ్గర రూ.56 కోట్ల వ్యయంతో 220 కేవీ విద్యుత్ సబ్‌స్టేషను నిర్మాణం శరవేగంగా జరుగుతోంది. ఇంతటి ఘనచరిత్ర కలిగిన రెంటచింతల ఆరోగ్య విభాగంలోను మరో చరిత్రను సొంతం చేసుకుంది. మండలంలోని గోలి, మిట్టగుడిపాడు గ్రామాల్లో ప్రతి ఏటా వందలమంది మలేరియా బారిన పడుతున్నారు. మండలంలోని 'కానుకమాత' తల్లి పేరు న ఆర్‌సిఎం క్రైస్తవులు ఏటా ఫిబ్రవరి 2న తిరుణాళ్ళ నిర్వహించడం ఇక్కడి ప్రత్యేకత.

## విష్ణుకుండినుల కళావైభవానికి నిదర్శనం

# ఉండవల్లి గుహాలయాలు



ఉండవల్లి గుహలు

(ఆన్‌లైన్-తాడేపల్లి)

అలనాటి విష్ణు కుండినుల కళా వైభవానికి నిదర్శనంగా ఉండవల్లి గుహలను పేర్కొనవచ్చు. కృష్ణానదికి మైలున్నర దూరంలో వున్న చారిత్రాత్మక కట్టడాలే ఈ ఉండవల్లి గుహాలయాలు. దేశవ్యాప్తంగా ప్రాచుర్యం పొందిన ఈ ఉండవల్లి గుహాలయాలు విష్ణు కుండినుల కళా ప్రావీణ్యానికి నిదర్శనంగా చెప్పవచ్చు. ఈ గుహాలయంలో ప్రసిద్ధి గాంచిన 25 అడుగుల పొడవు, ఆరడుగుల వెడల్పుగల ఏకరాతి అనంత పద్మనాభస్వామి విగ్రహం పేరెన్నిక గన్నది. అతి ప్రాచీనమైన శిల్ప వైభవాన్ని, సంస్కృతిని ప్రతిబింబించే బౌద్ధ గుహాలయం ఈ అనంత పద్మనాభ స్వామి నాలుగంతస్తుల గుహాలయం. కొండను తొలచి పొడవాటి స్తంభాలపై క్రీ.శ రెండు లేక మూడవ శతాబ్దంలో నాలుగు అంతస్తులుగా చెక్కారు. మొదటి అంతస్తులో 16 మండపాలతో కూడిన గర్భాలయంలో నృసింహస్వామి, విఘ్నేశ్వరుడు, దత్తాత్రేయ కన్పిస్తారు. రెండవ అంతస్తులో శేషతల్పంపై శయనించిన విష్ణుమూర్తి రూపమైన అనంత పద్మనాభస్వామి ఏకరాతి విగ్రహం దర్శనమిస్తుంది. ఆయన నాభిలో తామరపువ్వు, మధ్యలో తపస్సు చేస్తున్న బ్రహ్మ పాదాల వద్ద మధుకైటబులు అనే రాక్షసులు, విష్ణు వాహనమైన గరుత్మంతుడు, తపస్సు చేస్తున్న రుషులు తదితర విగ్రహాలున్నాయి. ఒకేరాతితో అతుకులు లేకుండా చెక్కి వుండడం ఈ విగ్రహం ప్రత్యేకత. ఉండవల్లి గుహల నుంచి మంగళగిరి గుహల వరకు సొరంగ మార్గం వుందని ప్రతీతి. గుహలపై 1955 లో బాపట్ల ఆర్ట్స్ అండ్ సైన్స్ కళాశాలకు చెందిన చరిత్ర ప్రధానోపాధ్యాయుడు సిఎస్ శాస్త్రి పరిశోధనలు జరిపారు. అనేక బౌద్ధారామాలు నిర్మించి న గోవిందశర్మ ఈ గుహలు నిర్మించారు.

ఆరు, ఏడు శతాబ్ద కాలంలో రెడ్డి రాజులు గుంటూరు రాజధానిగా పాలిస్తున్న కాలంలో ఇటువంటి బౌద్ధాలయాలు ప్రతిదానిని హిందూ దేవాలయాలుగా మార్చాలని కోరడంతో దీనికి కొన్ని మెరుగులు దిద్ది అనంత పద్మనాభస్వామిగా మార్చినట్టు కథనం. 14వ శతాబ్దంలో ఇక్కడి కొండవీటిరాజులు వేసిన ఓ శాసనం ప్రకారం ఇది ఆరు, ఏడు శతాబ్దాల నాటిదని క్రీస్తుశకం 1343లో అన్నారెడ్డి కుమారుడు పంచమరెడ్డి అనంత పద్మనాభునికి దానాలు ఇచ్చినట్టు తెలుస్తుంది. 1958వ సంవత్సంలో ఈ గుహలను పురావస్తుశాఖ స్వాధీన పరుచుకుని పాడైపోయిన కొన్ని శిల్పాలకు మెరుగులు దిద్దారు. సొరంగ మార్గం వలన ఎవరికీ ఎలాంటి ప్రమాదం కలుగకుండా దానిని మూసివేశారు. ఇక్కడ నుంచి కొండవీడు కోటకు, మంగళగిరి కొండకు, కనకదుర్గమ్మ కొండకు రహస్య సొరంగ మార్గాలుండేవని చెప్పుకుంటారు.



ఉండవల్లి గుహలలోని అనంత పద్మనాభస్వామి విగ్రహం



ఉండవల్లి గుహలవద్ద ఏర్పాటు చేసిన ఆహ్లాదకర గార్డెన్

### ఆహ్లాదకరమైన గార్డెన్

గతంలో ఉండవల్లి గుహాలయాల వద్ద సరైన ఆలన, పాలన లేక బోసిపోతూ వుండేది. అయితే నేడు కాసింత సేద తీరేందుకు, పర్యాటకులను ఆహ్లాదపరిచేందుకు గార్డెన్‌ను అందంగా ఏర్పాటు చేశారు. పర్యాటకుల కోసం బెంచీలు, కుర్చీలు ఏర్పాటు చేశారు. పిల్లా పాపలతో ఇక్కడికి వచ్చేవారు గార్డెన్‌లో సేద తీరేందుకు అనుకూలంగా గార్డెన్‌ను మలచి విద్యుత్ సౌకర్యం కూడా ఏర్పాటు చేశారు. ప్రతి ఆదివారం ఉండవల్లి గుహాలయాలు పర్యాటకుల రద్దీతో కళకళలాడుతుంది.ఈ గుహాలయాలకు మరింత ప్రచారం కల్పించాల్సిన అవసరం ప్రభుత్వంపై ఎంతైనా వుంది.

### శిథిలావస్థకు చేరుతున్న కట్టడాలు

ఇదిలావుండగా ఎంతో పేరు ప్రఖ్యాతులు గాంచి విష్ణుకుండినుల కాలంనాటి కళావైభవానికి నిలువెత్తు నిదర్శనంగా నిలిచిన ఈ ఉండవల్లి గుహాలయాలలోని కొన్ని రాతి కట్టడాలు శిథిలావస్థకు చేరుకుంటున్నాయి.

అక్కడక్కడా పగుళ్లు ఏర్పడి కట్టడాలు కూలిపోయే ప్రమాదం కూడా కనిపిస్తుంది. ఇటువంటి పురాతన కట్టడాలను పరిరక్షించాల్సిన బాధ్యత సంబంధిత అధికారులపై ఎంతైనా వుంది. భావితరాలకు వీటి వైభవాన్ని చాటిచెప్పాల్సిన ఆవశ్యకత ఎంతో వుంది.





బోయపాలెం గ్రామంలోని స్టోన్ క్రషర్



బోయపాలెం గ్రామంలోని స్పిన్నింగ్ మిల్లు

# నాడు క్రషర్‌లు... నేడు స్పిన్నింగ్ మిల్లులు

### ★ పారిశ్రామికవాడగా మారిన బోయపాలెం

(ఆన్‌లైన్, యడ్లపాడు)

నాడు ఇదో చిన్న గ్రామం... జాతీయ రహదారి పక్కన చిన్న చిన్న గుడిసెలలో జీవించే ప్రజలు... కానీ ప్రకృతిసిద్ధంగా ఏర్పడిన ఖనిజ సంపద ఈ గ్రామం దిశను మార్చింది. అపారమైన కొండలకు అనుబంధంగా ఈ ప్రాంతలో స్టోన్ క్రషర్‌లు ఏర్పడ్డాయి. ఫలితం గ్రామ జనాభా పెరగడంతో అందుకు తగ్గ పని దొరకడంతో బోయపాలెం ప్రాంతం కిలోమీటరన్న ర పొడవున జాతీయ రహదారి పక్కన విస్తరించింది. ఇదే ప్రాంతంలో స్టోన్ క్రషర్‌లతో పాటు నేడు స్పిన్నింగ్ పరిశ్రమ కూడా వేగంగా విస్తరిస్తున్నది.

స్పిన్నింగ్ మిల్లుల ఏర్పాటుకు తగ్గ భూగర్భ జలాలు పుష్కలంగా ఉండడంతోపాటు ఈ ప్రాంతంలో అందుకుతగ్గ కార్మికశక్తి కూడా ఉండడంతో ఔత్సాహిక పారిశ్రామికవేత్తలు ఈ ప్రాంతంలో స్పిన్నింగ్ మిల్లుల ఏర్పాటుకు ఉత్సాహం చూపుతున్నారు. దీనికితోడు కేంద్ర ప్రభుత్వం కూడా ఈ ప్రాంతంలో స్పైసెస్ పార్కు నిర్మాణానికి నిధులు మంజూరు చేసింది. నాడు చిన్న గ్రామంగా ఉండి నేడు పారిశ్రామికవాడగా మారుతున్న బోయపాలెం గ్రామంపై 'ఆన్‌లైన్' అందిస్తున్న ప్రత్యేక కథనం ఇది.

యడ్లపాడు మండలంలోని బోయపాలెం గ్రామం జాతీయ రహదారికి ఇరువైపులా గుంటూరు-చిలకలూరిపేట మధ్య ఉన్నది. జాతీయ రహదారికి కుడిపక్కన ప్రకృతి సిద్ధంగా ఉన్న కొండలు ఈ గ్రామం దిశను మార్చివేశాయి. 1975వ సంవత్సరంలో ఇక్కడ ఒక స్టోన్‌క్రషర్‌తో ప్రారంభమైన పారిశ్రామిక అభివృద్ధి నేటి వరకు కూడా పురోగమిస్తూనే ఉన్నది. సాంకేతిక పరికరాల ప్రవేశంతో ఉత్పత్తి సాధన వేగవంతమై బోయపాలెం వద్ద స్టోన్ పరిశ్రమల మీద క్వారీలలో పనిచేసే కార్మికులు, క్రషర్‌లో పనిచేసే కార్మికులు మొత్తం వెయ్యి కుటుంబాలకు పైగా జీవనాధారం పొందుతున్నాయి. 1990వ సంవత్సరంలో తమ సమస్యలను విన్నవించుకోవడానికి 'ది బోయపాలెం స్టోన్‌క్రషర్ ఓనర్స్ వెల్ఫేర్ అసోసియేషన్' ఏర్పాటు చేసుకున్నారు. ప్రజల ఆరోగ్యానికి భంగం కలుగుకుండా క్రషర్‌లు నిర్మించుకోవడం, క్రషర్ కార్మికుల కొరకు ఆరోగ్య శిబిరాలు ఏర్పాటు చేయడం వంటి సేవా కార్యక్రమాలకు స్టోన్‌క్రషర్ యజమానులు బోయపాలెం ప్రజలతో విడదీయరాని బంధం ఏర్పాటు చేసుకున్నారు. స్టోన్ పరిశ్రమతోపాటు విశ్వసౌభాగ్య మిల్క్ డెయిరీ, పెప్సీ కంపెనీ, కోళ్ల ఫారాలు, పెట్రోలు బంకులు ఏర్పాటు చేయడం జరిగింది. వీటితో పాటు ముఖ్యంగా బోయపాలెం గ్రామంలో 7 స్పిన్నింగ్ మిల్లులను నిర్మాణం చేశారు. ప్రముఖ రియల్ ఎస్టేట్ సంస్థలు ఈ ప్రాంతంలో ఇళ్ల స్థలాలకు సంబంధించి రియల్ వెంచర్లను వంద ఎకరాలలో వేశారు.

# ప్రజాసేవలో పునరంకితమైన 'ఎమ్మెస్సెస్'

(ఆన్‌లైన్-మంగళగిరి)

పదవి వున్నా లేకున్నా చివరి క్షణం వరకు ప్రజాసేవకు పునరంకితమైన మహోన్నత వ్యక్తిగా, ఆదర్శ రాజకీయ వేత్తగా స్వర్గీయ డాక్టర్ ఎమ్మెస్సెస్ కోటేశ్వరరావు ప్రజల మదిలో చెరగని ముద్రను వేసుకున్నారు. ఆయన మనస్సు మంగళగిరి అభివృద్ధి కోసం అనుక్షణం ఆరాటపడింది. సమస్యలపై అవగాహన, సమర్ధవంతమైన పాలనాదక్షత గల ఎమ్మెస్సెస్ నిగర్వి, శాంతస్వరూపి. గ్రూపు రాజకీయాలకు దూరంగా మసలే సాధుస్వభావం గల ఈ మహనీయుడు భౌతికంగా నేడు లేకపోయినా ఈ ప్రాంత ప్రజల హృదయాలలో తనకంటూ ఓ ప్రత్యేకమైన స్థానాన్ని సంపాదించుకున్నారు. ప్రాప్తించిన పదవులతో సంపాదనే ధ్యేయంగా మసిలే ప్రజాప్రతినిధులు అడుగడుగునా తారసిల్లే నేటి రోజులలో... అధికారం లేకున్నా ఊరి బాగు కోసం అహర్నిశలు పరితపించిన డాక్టర్ ఎమ్మెస్సెస్ నూటికి నూరు పాళ్లు ఆదర్శ రాజకీయ వేత్త అని స్పష్టంగా చెప్పవచ్చు.



డాక్టర్ ఎమ్మెస్సెస్ కోటేశ్వరరావు

మంగళగిరి మండలం నీరుకొండ స్వగ్రామమైనప్పటికీ, ఎమ్మెస్సెస్ వృత్తి రీత్యా డాక్టర్‌గా మంగళగిరి పట్టణంలో స్థిరపడ్డారు. 15 సంవత్సరాలకు పైగా ఆయన వైద్య వృత్తిలో కొనసాగి, ఈ ప్రాంత ప్రజలకు వైద్యసేవలను అందించారు. తొలినుంచి కాంగ్రెస్ వ్యతిరేక భావాలు గల ఎమ్మెస్సెస్ మొదట్లో జనతా, ఆ తరువాత లోక్‌దళ్‌లో వుంటూ... తెలుగుదేశం పార్టీ ఆవిర్భావం నుంచి ఆ పార్టీలో చురుకైన నాయకునిగా కొనసాగుతూ... చివరకు 2001 నవంబర్ 22న పరమపదించారు. 1983, 1985 ఎన్నికల్లో రెండు సార్లు శాసనసభ్యునిగా ఎన్నికకావడంతోపాటు, ఉడా చైర్మన్‌గా, వైద్య ఆరోగ్య శాఖా మంత్రిగా ఆయన పని చేసి ఆయా పదవులకు వన్నె తెచ్చారు. ఆ పదవుల్లో వుండగా ఆయన మంగళగిరి నియోజకవర్గాన్ని అభివృద్ధి పరంగా ఓ మలుపు తిప్పారు. నేడు పట్టణంలో ప్రజోపయోగంగా వున్న ఆర్టీసీ బస్‌స్టేషన్, ఫైర్‌స్టేషన్, కేన్సర్, జనరల్ ఆసుపత్రులు, టీటీడీ కళ్యాణ మండపం, పలు ఎత్తిపోతల పథకాలు, ప్రధాన లింకురోడ్లు ఆయన కృషి ఫలితంగా రూపుదిద్దుకున్నవే. ప్రస్తుతం నిర్మాణదశలో వున్న కృష్ణజలాల పథకం, ఘాట్ రోడ్డు, నిడమర్రు ఎత్తిపోతల పథకాల సాధన వెనుక కూడ ఎమ్మెస్సెస్ కృషి ప్రబలంగా వుందని చెప్పుకోవాలి. అయితే, దురదృష్టవశాత్తూ నిడమర్రు ఎత్తిపోతల, ఘాట్‌రోడ్ నిర్మాణ పనులను మాత్రం ఆయన వీక్షించలేకపోయారు. వాస్తవానికి ఎలాంటి పదవులు లేకపోయినా తనకున్న పలుకుబడి, విజ్ఞానాన్ని, రాజకీయ నేర్పును అనుసరించి ఆయన ఈ అభివృద్ధి పథకాలను సాధించగలిగారు. అలాగే, తన సాయాన్ని కోరి వచ్చిన వారందరికీ ఆయన పనులను చేసిపెట్టి అన్ని వర్గాల ప్రజలను సంతృప్తి పరిచారు.

పార్టీ పరంగా ఎమ్మెస్సెస్ రెండు సార్లు జిల్లా అధ్యక్షపదవిని చేపట్టారు. అయినా ఆ పదవిని ఆయన తన రాజకీయ ఉన్నతికి బాసటగా వినియోగించుకోలేకపోయారు. తన రాజకీయ జీవితంలో చేసిన ఒకే ఒక తప్పిదం ఆయనకు పెనుశాపంగా పరిణమించింది. 1994 ఎన్నికల్లో పార్టీ నిర్ణయానికి వ్యతిరేకంగా స్వతంత్ర అభ్యర్ధిగా పోటీచేసి జిల్లా పరిషత్ చైర్మన్ పదవిని సైతం చేజార్చుకున్నారు. తరువాతి రోజుల్లో 'దేశం' రాష్ట్ర రాజకీయాల్లో విప్లవాత్మకమైన మార్పులు చోటుచేసుకున్నా అవి ఎమ్మెస్సెస్ రాజకీయ జీవితంలో కమ్ముకున్న చీకట్లను పారద్రోలలేకపోయాయి. పార్టీ పరంగా ఆయనకు అంతగా న్యాయం జరుగకపోయినా, మంగళగిరిలో పార్టీయే తానుగా, తానే పార్టీగా వుండి ఈ ప్రాంతంలో టీడీపీ జీవించి వుండడానికి ఎంతగానో దోహదపడ్డారు.

కమ్యూనిస్టు..

# ఉద్యమ నిర్మాత 'పులుపుల'

(ఆన్‌లైన్‌- వినుకొండటౌన్‌)

స్వాతంత్ర్య పోరాట సమర యోధుడు, మార్కిస్ట్ తత్వవేత్త, కమ్యునిస్టు ఉద్యమ నిర్మాత పులుపుల శివయ్య 1910లో రొంపిచర్ల గ్రామంలో సంప్రదాయ బ్రాహ్మణ కుటుంబంలో జన్మించారు. ప్రాథమిక విద్యను అక్కడే పూర్తిచేసి అనంతరం బెనారస్‌లో బీఎస్సీ అన్సర్ చదువుతూ మార్కిస్ట్ తత్వవేత్తగా మారారు. చదువు ఆపేసిన అ నంతరం బెనారస్ నుంచి గంగాజలాన్ని కాక మార్కి జాన్ని తెచ్చి ఆంధ్ర లో వెదజల్లారు. ఆనాడు జరుగుతున్న స్వాతంత్ర్య ఉద్యమ పోరాటాల్లో ప్రధానపాత్ర వహిస్తున్న కాంగ్రెస్‌లో అతివాదిగా ఆయన పేరుపొందారు. సైమాన్‌గో బ్యాక్ ఉద్యమాన్ని ఆంధ్రకేసరి నడిపించినప్పుడు ఆ పోరాటంలో పులుపుల యువ సోషలిస్టులకు నాయకత్వం వహించి పోరాడారు. చౌరాచౌరి రైతు పోరాట సమయంలో మహాత్మాగాంధీ ఉద్యమాన్ని అపివేయగా అనేక మంది అతివాదులు ఉద్యమాన్ని తిరిగి నడపాలని నిర్ణయించినప్పుడు శివ య్య కాంగ్రెస్ నుంచి కమ్యునిస్టుల వైపు ఆకర్షితులైన వారిలో ఒకరు. అప్పటి నుంచి ఆంధ్రలో కమ్యునిస్టు పార్టీ స్థాపనకు గుంటూరు, కృష్ణా, ఉభయ గోదావరి, నెల్లూరు జిల్లాలలో రహస్యంగా ఉద్యమం నడిపారు. కొత్త పట్నం, మంతెనవారిపాలెంలో రాజకీయ పాఠశాల ప్రిన్సిపాల్‌గా వ్యవహరించారు. శివయ్య తన జీవిత కాలంలో నాలుగేళ్ళు రహస్య జీవితాన్ని, మరో నాలుగేళ్ళు జైలు జీవితాన్ని గడిపారు. ఆయన జైలు జీవితాన్ని అనుభవిస్తున్నప్పుడు ప్రముఖ కమ్యునిస్టు ఉద్యమ నిర్మాత డాంగే రచించిన 'ప్రిమిటీవ్ కమ్యునిజమ్ టు స్లేవ్ ఇండియా' అనే గ్రంథాన్ని 'ఆదిమ కమ్యునిస్టు సమాజం నుంచి బానిస సమాజం'గా తెలుగులోనికి అనువదించారు. అలాగే చైనా ప్రజాస్వామ్యం అనే పుస్తకాన్ని కూడా తెలుగులోనికి అనువదించారు. వీటితో పాటు అనేక రచనలు, గేయాలు రచించారు. ఆయన రచించిన 'పల్నాడు వెలలేని మాగాణిరా' అన్న గేయం బహుళ ప్రజాధరణ పొందింది. ఆ గేయాన్ని పల్నాడు పౌరుషం సినిమాకు కూడా తీసుకున్నారు. ఆయన రాజకీయ పాఠశాలలో శిక్షణ పొందిన ప్రముఖుల్లో నక్సలైట్ నాయకుడు కొండపల్లి సీతారామయ్య, సీపీ ఐ అగ్రనేత చం ద్ర రాజేశ్వరరా వు ఉన్నారు. విశాలాంధ్ర పత్రికలో శివయ్య కొద్దిరోజు లు సంపాదకత్వ బాధ్యతలు కూడా నిర్వహించారు. ఆయన 1952లో వినుకొండ నియోజకవర్గం నుంచి కమ్యునిస్టు పార్టీ అభ్యర్థిగా విజ యం సాధించి ఉమ్మడి మద్రాసు రాష్ట్రానికి ఉపసభాపతిగా చేశారు. అనంతరం 1962 లో తిరిగి ఎమ్మెల్యేగా గెలుపొందారు. ఆయన కొంత కా లం వినుకొండ పంచాయతీ సర్పంచ్‌గా కూడా పనిచేశారు. రాష్ట్రంలో జరిగిన అనేక పోరాటాలకు నాయకత్వం వహించి ప్రత్యేక ఆంధ్ర ఉద్యమానికి వ్యతిరేకంగా విశాఖ ఉక్కు.. ఆంధ్రుల హక్కు ఉద్యమానికి మద్దతుగా శాసనసభ్యత్వానికి రాజీనామ చేసి సంచలనం సృష్టించారు.





## పుల్లరి రద్దుకు పోరాటం

వినుకొండ ప్రాంతంలో తొలిసారిగా అటవీ పుల్లరి వ్యవసాయ ఉద్యమం నడిపి రాష్ట్రవ్యాప్తంగా పుల్లరిని రద్దు చేయించిన పోరాటయోధుడు శివయ్య. ప్రముఖ రచయిత తుమ్మల వెంకటరామయ్య, పరకాల పట్టాబిరావు, వాసుదేవరావులు ఆయన సమకాలీకులు. నీలం రాజశేఖరరెడ్డి, శివయ్యలు రాజకీయ సహచరులు. 1979 లో రష్యా కమ్యునిస్టు శాంతి సంఘాల ఆహ్వానం మేరకు వెళ్లిన ఆయన అక్కడే తన తుది శ్వాస విడిచారు. అక్కడ నుంచి తెచ్చిన ఆయన చితా భస్మంతో వినుకొండ ప్రధాన కూడలిలో ఆయన పేరుతో కమ్యునిస్టు పార్టీ స్మారకస్తూపాన్ని నిర్మించారు. వినుకొండలో ప్రతి యేటా శివయ్య వర్ధంతి, జయంతి సభలు అమరవీరుల పేరు తో ఘనంగా నిర్వహిస్తారు. గుంటూరులోని న్యాయవాది లక్ష్మినారాయణ పులుపుల శివయ్య పేరుతో ట్రస్టు ఏర్పాటు చేసి ప్రతి ఏటా అభ్యుదయ రచయితల సమేళనాన్ని జరుపుతారు.

కోరిన కోర్కెలు తీర్చే..

# కంచర్ల కోదండరాముడు



పెదకంచర్ల గాలిగోపురం

(ఆన్‌లైన్‌- వినుకొండటౌన్‌)

భక్తుల పాలిటి కొంగు బంగారం.., పిలిచిన పలికే దేవుడుగా మండలంలోని పెదకంచర్ల కోదండరామస్వామి భక్తుల నుంచి నిత్య పూజలు అందుకుంటున్నాడు. పురాతన కాలంలో శ్రీకృష్ణ గంధర్వుడు అనే సామంతులు పాలించినందున ఈ గ్రామం కృష్ణగంధర్వపురంగా పిలువబడి కాలగమనంలో పెదకంచర్లగా పేరొందింది. కృష్ణగంధర్వుల కాలంలో చెన్నకేశవ ఆలయానికి గాలిగోపురాన్ని నిర్మించారు. మాచర్ల, ప్రకాశం జిల్లా మార్కాపురంలో ఉన్న చెన్నకేశవస్వామి ఆలయ గోపురాల తరహాలోనే పెదకంచర్ల గాలిగోపురం నిర్మితమైంది. సుమారు 100 అడుగుల ఎత్తులో ఉన్న ఈగాలిగోపురం ఈ ప్రాంతంలో ప్రత్యేకతను సంతరించుకుంది. అయితే తురుష్కుల కాలంలో దేవాలయం ధ్వంసం కాగా చెన్నకేశవస్వామి స్థానంలో సీతారామచంద్రుల విగ్రహాలు ప్రతిష్ఠింప చేశారు. గ్రామస్తులు ఐకమత్యంతో రూ.10 లక్షలతో ఆల య జీర్ణోద్ధరణ చేపట్టారు. భద్రాచలంలోని రాములవారికి కుడిచేతిలో శంఖం, ఎడమ చేతిలో చక్రం ఉన్న తరహాలో కంచర్ల కోదండరామస్వామి విగ్రహం ఉంటుంది. పంటలు రాగానే గ్రామస్తులతో పాటు పరిసరగ్రామాల వారు స్వామివారికి మొక్కులు తీర్చుకున్న తరువాతే అమ్మకాలు చేయడం ఆనవాయితీ.



సీతరామచంద్రుల విగ్రహాలు

# ప్రైవేటు డెయిరీలకు నెలవు వినుకొండ





వినుకొండలోని హైమా డెయిరి, పాలను తూకం వేస్తున్న సిబ్బంది

(ఆన్‌లైన్ – వినుకొండ)

జిల్లాలో వెనుకబడ్డ ప్రాంతమైన వినుకొండ నియోజకవర్గంలో ప్రైవేట్ డెయిరీల ప్రవేశంతో పాడి పరిశ్రమ దిన దినాభివృద్ధి చెందుతోంది. ప్రధాన పరిశ్రమలు లేని ఈ ప్రాంతంలో ప్రైవేట్ డెయిరీలు ఇక్కడి వారి ఆర్థికాభివృద్ధికి తోడ్పాడునందిస్తున్నాయి. సరళీకృత ఆర్థిక విధానాల మూలంగా దశాబ్దం నుంచి ప్రైవేట్ డెయిరీలు ఏర్పాటయ్యాయి. సంతమాగులూరు, అడ్డరోడ్డు నుంచి వినుకొండ మధ్య దాదాపు 20 కిలోమీటర్ల దూరంలో 7 ప్రైవేట్ డెయిరీలు నడుస్తున్నాయి. ఇవి కాక వినుకొండలో సంగం, హైమా, హెరిటేజ్ డెయిరీలు నడుస్తున్నాయి. త్రిపురాంతకం సమీపంలోని సీతారామ డెయిరీ కూడా వినుకొండ ప్రాంతం నుంచి పాల సేకరణ చేస్తుంది. సీజన్‌లో ఈ ప్రాంతం నుంచి రోజుకు దాదాపు 80 వేల లీటర్ల పాలసేకరణ జరుగుతుంటుంది. సుమారుగా నెలకు పాల ద్వారా 2 కోట్ల రూపాయలు రైతుల చేతులకు అందుతుంది. అన్ని రంగాల్లో విఫలమవుతున్న గ్రామీణ ప్రాంత ప్రజానీకానికి పాడి పరిశ్రమ ప్రధాన జీవనాధారంగా మారింది. ప్రైవేట్ డెయిరీల నిర్వాహకులు వ్యాపారంలో పోటీని తట్టుకునేందుకు రైతులకు ధన రూపేణ ఆర్థిక సహాయం అందించేందుకు ముందుకొచ్చాయి. గేదెల కొనుగోలుకు పెద్ద ఎత్తు న రుణాలు ఇస్తున్నారు. మహిళలకు కూడా పాడిపరిశ్రమ స్వయం సమృద్ధికి తోడ్పాడునందిస్తుంది. భూ స్వాములు సైతం పాడి గేదెల పెంపకంపై అసక్తి క నబరుస్తున్నారు. డెయిరీ నిర్వాహకులు బ్యాంకర్లతో చర్చించి భారీ ఎత్తున గేదెల కొనుగోలుకు పాడి పోషకులకు రుణాలిచ్చేందుకు ఒప్పించారు. ప్రైవేట్ వ్యాపారస్తులు పెట్టుబడులు పెట్టేందుకు వెనకడుగు వేసిన తరుణంలో డెయిరీల యాజమాన్యాలు రుణాలు ఇవ్వడం అన్నదాతలకు ఊరటగా మారింది. మొదటి నుంచి జిల్లాలోనే నాణ్యమైన పాల సేకరణకు వినుకొండ ప్రాంతం గుర్తింపు తెచ్చుకుంది. అయితే పశుగ్రసం, పౌష్టికాహారం ధరలు అకాశాన్నంటడంతో పాడి పరిశ్రమ రైతులకు గిట్టుబాటు కావడం లేదు. ప్రత్యామ్నాయ మార్గాలు లేక వ్యవసాయ రం గంలో కూడా అటుపోట్లకు గురవుతున్న నేపథ్యంలో పాడిపరిశ్రమ వైపే అన్నదాతలు మొగ్గుచూపుతున్నారు.

## మర్రి చెన్నారెడ్డి మానవవనరుల సంస్థ.. చైర్మన్‌గా వరప్రసాద్



(ఆన్‌లైన్ – గుంటూరు)

హైదరాబాద్‌లోని డాక్టర్ మర్రి చెన్నారెడ్డి మానవవనరుల అభివృద్ధి సంస్థ చైర్మన్‌గా రాష్ట్ర మాధ్యమిక విద్యా శాఖ మంత్రి డి మాణిక్యవరప్రసాద్‌ను నియమించారు. 1996-97 నుంచి ఈ సంస్థ పని ప్రా రంభించింది. కాంగ్రెస్ హయాంలో ఆరు సంవత్సరాల నుంచి ముఖ్యమం త్రి రోశయ్య ఈ సంస్థకు చైర్మన్‌గా కొనసాగుతున్నారు. వైఎస్ సీఎంగా ఉన్న రోజుల్లో ఆర్థిక మంత్రిగా ఉన్న రోశయ్యను దీనికి చైర్మన్‌గా నియమించా రు. రోశయ్య సీఎం అయిన తరువాత సంవత్సరం వరకు ఆయనే చైర్మన్‌గా కొనసాగారు. ఇటీవల ఈ సంస్థకు కొత్త చైర్మన్‌ను నియమించాల్సి వచ్చింది. దీంతో ఉన్నత విద్యావంతుడైన మాణి క్యవరప్రసాద్‌ను దీనికి చైర్మన్‌గా నియమించారు. న్యాయవాది అయిన మాణిక్యవరప్రసాద్ తాడికొండ నుంచి రెండో సారి ఎమ్మెల్యేగా ఎన్నికై వైఎస్ క్యాబినెట్‌లో మంత్రిగా బాధ్యతలు స్వీకరించారు. రోశయ్య నాయకత్వంలో వరప్రసాద్‌కు మర్రి చెన్నారెడ్డి మానవ వనరుల అభివృద్ధి సంస్థ చైర్మన్‌గా అరుదైన అవకాశం లభించింది.


శ్రీ త్రికోటేశ్వర స్వామి ఆలయ ఏరియల్ వ్యూ

దక్షిణ భారతదేశంలోనే అత్యంత ప్రసిద్ధి గాంచిన శైవ క్షేత్రం కోటప్పకొండ శ్రీత్రికోటేశ్వర స్వామి దేవస్థానం. నరసరావుపేట మండలంలోని కోటప్పకొండ పుణ్య క్షేత్రం గాను, పర్యాటక కేంద్రంగా అసాధారణ రీతిలో అభివృద్ధి చెందింది. భక్తుల కొంగు బంగారమైన శ్రీత్రి కోటేశ్వర సన్నిధి యాత్రికులకు అత్యంత చేరువైంది. భక్తులకు, పర్యాటకులకు అన్ని సౌకర్యాలు సమకూరటంతో పుణ్యక్షేత్రానికి భక్తుల సంఖ్య రోజురోజుకు పెరుగుతోంది.


ధ్యాన శివుని విగ్రహం

## భక్తుల కొంగు బంగారం
# కోటయ్య స్వామి


శ్రీ త్రికోటేశ్వర స్వామి మూలవిరాట్

హరహర! చేదుకో కోటయ్య! చేదుకోవయ్య! అని భక్తి సమ్మేళత అర్తితో పిలవగానే కాలకూటం లాంటి పాపాలనెన్నింటినైనా హరించి భక్తులకు ఇహ, పర సౌఖ్యాలను ప్రసాదించే ప్రత్యక్ష దైవం శ్రీ త్రికోటేశ్వరస్వామి అని భక్తుల నమ్మకం. భక్తులకు కోటయ్య స్వామి కొంగు బంగారం. ఎందరో మహా యోగులకు, దేవతా మూర్తులకు జ్ఞానోపదేశం చేసిన మహిమాన్విత క్షేత్రమే కోటప్పకొండ. యేటా లక్షలాది భక్తుల నీరాజనాలు అందుకుంటూ శివరాత్రి నాడు ఇక్కడ సాగే తిరునాళ్ళ దేశ ప్రసిద్ధి.

దక్షయజ్ఞాన్ని ధ్వంసం చేసిన తర్వాత శివుడు శాంతించి పన్నెండేళ్ళ బాలుడిగా మారి బ్రహ్మచర్య దీక్షతో కైలాసంలో సమాధి నిష్టలో దక్షిణామూర్తిగా ఉన్నాడు. అప్పుడు బ్రహ్మ తదితర దేవతలు దక్షిణామూర్తి వద్దకు వెళ్ళి మొక్కి తమకు బ్రహ్మోపదేశం చేయాలని కోరారు. అందుకు అంగీకరించి దక్షిణామూర్తి త్రికూటాద్రికి వచ్చి(కోటప్పకొండ) బ్రహ్మోపదేశం చేశాడు. కనుకనే ఇది మహా పుణ్యక్షేత్రంగా విరాజిల్లుతోంది. ఆలయంలో నిత్యం పూజలు జరుగుతున్నాయి. ప్రతి రోజు అభిషేకం, అర్చన, అష్టోత్తరం, హోమాలు కూడా జరుగుతున్నాయి.

### కార్తీకమాస విశేష పూజలు

ఈశ్వరుడు అభిషేకంతో మానవుని యొక్క సకల ఈతిబాధలు తీర్చుతాడని వేదశాస్త్రంలో పేర్కొన్నారు. అందులోనూ కార్తీకమాసంలో శివారాధన చాలా విశిష్టం. శ్రీమేధాదక్షిణామూర్తి స్వరూప శ్రీత్రికోటేశ్వర స్వామి వారికి కార్తీకమాసంలో అభిషేకాలు, అర్చలను చేయటానికి ప్రత్యేక ఏర్పాట్లు చేస్తున్నారు. కార్తీకమాసంలో ప్రతి ఆదివారం, పౌర్ణమి, ప్రతి సోమవారం, రెండో ఏకాదశి రోజుల్లో ఉదయం 5.30 నుండి 8.30 గంటల వరకు మూల విరాళ్‌కు అభిషేకాలు జరుపనున్నారు.

### పర్యాటక కేంద్రం

ఘాట్‌రోడ్డుకు ఇరు వైపులా దాదాపు 25 ఎకరాల స్థలంలో ఏర్పాటు చేసిన పర్యాటక కేంద్రంలో వివిధ పార్కులు రూపుదిద్దుకున్నాయి. ఇవి పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తున్నాయి. జింకల పార్కును ఏర్పాటు చేశారు. అలాగే విదేశాలకు సంబంధించిన పక్షులు పర్యాటకులకు కనువిందు చేస్తున్నాయి. సహజమైన రీతిలో అందమైన గార్డెన్ నిర్మాణం జరిగింది. సరస్సులో బోట్ షికార్ కల్పించారు. చిన్న పిల్లలు ఆడుకునేందుకు చిల్డ్రన్స్ పార్కు నిర్మాణం జరిగింది. టాయ్‌ట్రైన్‌ను ఏర్పాటు చేశారు. ఘాట్‌రోడ్ మార్గంలో బ్రహ్మ, శేషశయనంపై విష్ణుమూర్తి, సరస్వతి, లక్ష్మి,పార్వతి, విఘ్నేశ్వరుడు, ధ్యాన ముద్రలో శివుడు, శివలింగం, భారీ విగ్రహాలు భక్తులను ఆకట్టుకుంటున్నాయి.

– కంకణంపాటి శ్రీనివాసరావు


పర్యాటక కేంద్రంలో తాండవ కృష్ణుడి విగ్రహం


తిరునాళ్ళకు తరలి వచ్చే విద్యుత్ ప్రభలు

తిరుమల ఉత్పత్తులు



# తిరుమల పాల ఉత్పత్తులకు విశేష ఆదరణ

తిరుమల మిల్క్ ప్రొడక్ట్స్ ప్రైవేట్ లిమిటెడ్ స్థాపించిన అనతి కాలంలోనే అసాధారణ ప్రగతి సాధించింది. రాష్ట్రంలో క్షీర విప్లవానికి తిరుమల తన వంతు కృషి చేస్తోంది. ఒక వైపు పాల ఉత్పత్తి దారులకు వెన్నుదన్నుగా నిలుస్తూ, మరో వైపు వేలాది మంది నిరుద్యోగులకు ఉపాధి కల్పిస్తోంది. రాష్ట్రంలోనే కాక ఇతర రాష్ట్రాలు తమిళనాడు, కర్నాటకలలో కూడా సంస్థ విస్తరించింది. ఒక పాల శీతలీ కరణ కేంద్రంతో ప్రారంభమైన తిరుమల డెయిరీ తమిళనాడు, మన రాష్ట్రంలో అనేక చోట్ల కేంద్రాలను విస్తరించి పాలు, పాల పదార్థాల తయారీ విక్రయాల్లో మార్కెట్‌లో తన కంటూ ఒక స్థానాన్ని సాధించ గలిగింది.

పాలు, పాల పదార్థాల తయారీలో నాణ్యత ప్రమాణాలను పాటిస్తూ, మార్కెట్‌లో తిరుమల డెయిరీ మంచి గుర్తింపు పొందింది. అసలైన స్వచ్ఛతకు తిరుమల ఉత్పత్తులు పేరెన్నికగన్నవి. తిరుమల పాలు, పెరుగు, మజ్జిగ, నెయ్యి, ఫ్లేవర్డ్ మిల్క్, ఐస్ క్రీమ్స్, జీరా బటర్ మిల్క్, లస్సీ, మిల్క్ కేక్, కుకింగ్ బటర్, దూద్ పేడ తదితర పాల పదార్థాలను మార్కెట్‌లో ప్రవేశ పెట్టారు. తిరుమల నుంచి వెలువడుతున్న ఉత్పత్తులకు వినియోగ దారుల నుంచి మంచి ఆదరణ లభిస్తోంది. పది వేల లీటర్ల సామర్థ్యంతో ప్రారంభమైన తిరుమల సంస్థ నేడు ఆరు లక్షల లీటర్ల పాల సేకరణ ప్రతీ రోజు చేస్తూ సుమారు ఐదు లక్షల లీటర్ల పాల విక్రయాలను ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కర్నాటక రాష్ట్రాల్లో జరుపుతోంది. అగ్‌మార్క్ ప్రమాణాలతో పాలు, పాల పదార్థాలను తయారు చేస్తున్నది. తిరుమల ఉత్పత్తులకు ఐఎస్‌వో 9001-2000 గుర్తింపు లభించింది. ప్రైవేటు డెయిరీ రంగంలో మొదటి స్థానాన్ని ఆక్రమించింది. అత్యున్నత సాంకేతిక ప్రమాణాలతో నెల్లూరు జిల్లా, గూడూరులో పాలు, పాల పదార్థాల తయారీ ఫ్యాక్టరీని నిర్మించారు. గూడూరు, పలమనేరు, వెల్లల చెరువులలో పాల ప్యాకెట్ల తయారీ ప్లాంట్లను నెలకొల్పారు. జంట నగర వాసులకు అత్యంత శ్రేష్టమైన పాలు అందించుటకు తిరుమల సంస్థ నవీన సాంకేతిక పరిజ్ఞానంతో అత్యాధునిక యంత్రాలతో నూతన మిల్క్ ఫ్యాక్టరీని రంగారెడ్డి జిల్లాలోని ఇబ్రహీపట్నం సమీపంలోగల గునగల్ గ్రామంలో నిర్మించి ప్రారంభించారు. చెన్నై, బెంగళూరు, హైదరాబాద్ పట్టణాల్లో తిరుమల ఉత్పత్తులకు విశేష ఆదరణ లభిస్తున్నది. తిరుమల తయారు చేసే పాల పొడికి మార్కెట్‌లో మంచి డిమాండ్ లభించటంతో పాటు బంగ్లాదేశ్, శ్రీలంక దేశాల నుంచి కూడా ఆర్డర్లు లభిస్తున్నాయి. పాల ఉత్పత్తి దారులకు చేయూత నందించటంతో పాటు ఉపాధి అవకాశాలు కల్పించటంలో తిరుమల ప్రత్యేక గుర్తింపు సాధించింది. ఈ సంస్థలో ఏడు వేల మందికి పైగా విభాగాలలో ఉపాధి పొందుతున్నారు. పాల ఉత్పత్తి దారులకు కూడా వివిధ రకాల సహాయం చేస్తూ, వారి శ్రేయస్సు కోసం విభిన్న పథకాలు అమలు చేస్తూ వారి ఆదరణను చూరగొన్నది. సంస్థ ఎండీ బ్రహ్మనాయుడు మాట్లాడుతూ, పాల ఉత్పత్తి దారులు, వినియోగ దారుల ఆదరణే మాకు స్ఫూర్తి అని పేర్కొన్నారు. నాణ్యతా ప్రమాణాలు పాటించటం వలనే తిరుమల ఉత్పత్తులకు వినియోగ దారుల నుంచి



ఎండీ బొల్లా బ్రహ్మనాయుడు

ప్రోత్సాహం లభిస్తున్నదని చెప్పారు. తిరుమల సంస్థ నరసరావుపేటలో తిరుమల ఇంజనీరింగ్ కళాశాలను స్థాపించింది. ఈ కళాశాల రెండేళ్ళల్లోనే రాష్ట్రంలోనే ప్రత్యేక గుర్తింపు సాధించింది.

(ఆన్‌లైన్, నరసరావుపేట)

## నరసరావుపేట కేంద్రంగా మల్రాజు పాలన

### నాటి నరసింహారావుపేటే.. నేటి నరసరావుపేట

(ఆన్‌లైన్, నరసరావుపేట)

రాష్ట్రంలో పురాతన స్వదేశీ సంస్థానాలలో నరసరావుపేట ఎంతో ప్రసిద్ధి పొందింది. మల్రాజు వంశీయులు ఈ ప్రాంతాన్ని పాలించారు. వినుకొండ కేంద్రంగా పాలన చేస్తూ 1797లో నరసరావుపేటలో మల్రాజు వేంకట గూండారావు కోట నిర్మాణం చేపట్టారు. దుర్గం, రాజసౌధం, అంతఃపుర నిర్మాణాలు పూర్తి చేయించిన గూండారావు ఆయన తండ్రి పేరుతో 'నరసింహారావు'పేట అని నామకరణం చేశారు. ఈ నరసింహారావుపేటయే ప్రజానుడిలో నరసరావుపేటగా మారింది.

వినుకొండ, బెల్లంకొండ, నరసరావుపేట ప్రాంతాలను మల్రాజులు పరిపాలించారు. వినుకొండను ప్రధాన రాజధానిగాను, బెల్లంకొండను ఉప రాజధానిగాను చేసుకొని రెండు పరిగణాలను మల్రాజు వేంకట నరసింహారావు పాలించేవారు. ఆ తదుపరి వేంకట గూండారావు వినుకొండ రాజధాని నుంచి బెల్లంకొండను పరిపాలించటం కష్టతరంగా మారటంతో రెండు దుర్గాల మధ్య కొత్త కోటను నిర్మించాలని భావించారు. దీంతో 1797 సంవత్సరంలో కోటకు శంకు స్థాపన చేసి నిర్మాణాన్ని ప్రారంభించారు. అంభారితో అలంకరించిన పట్టపు టేనుగును అధిరోహించి మల్రాజు వేంకట గూండారావు సింహ ద్వారం గుండా కోటలో నుంచి రాకపోకలు జరుపుతుండేవారు. ఇటువంటి సింహ ద్వారం ఆనాటి సంస్థానాధీశ్వరుల దుర్గాలలో ఎక్కడా నిర్మించలేదని ప్రసిద్ధి.

కోట నిర్మాణం పూర్తయిన వెంటనే అనేక చేతి వృత్తుల వారు కోట ప్రదేశాలలో స్థిరపడ్డారు. వీరందరికీ అప్పట్లో కావాల్సిన స్థలాలను ఉచితంగా సమకూర్చారు. దీంతో విశాలమైన వీధులతో పట్టణం రూపుదిద్దుకుంది. కోటకు మొత్తం ఐదు బురుజులు నిర్మించారు. వీటి పై ఫిరంగులతో సాయుధులైన భటులు నిరంతరం కాపలా కాస్తుండేవారు. సంస్థానంలో ఎప్పుడూ స్థిరంగా 99 ఏనుగులు వుండేవని అప్పట్లో విశేషంగా చెప్పుకొనేవారు.

ఈ ఏనుగుల కోసం ప్రస్తుతం పెద్ద చెరువుగా పిలుస్తున్న ప్రాంతంలో 105 ఎకరాల విస్తీర్ణంలో చెరువును తవ్వించారు. నరసరావుపేట నీటి ఎద్దడి ఏర్పడిన సమయంలో అప్పటి మునిసిపల్ చైర్మన్ రాజా మల్రాజు వేంకట నరసింహారావు ఈ చెరువును పురపాలక సంఘానికి దానం చేశారు. అయితే ప్రస్తుతం ఈ చెరువు స్థలాన్ని ప్రభుత్వం ఇళ్ళ స్థలాలు, ఇండస్ట్రియల్ ఎస్టేట్, కళాశాలల నిర్మాణానికి పంపిణీ చేసింది. వినుకొండ, బెల్లంకొండ, కొండవీడు దుర్గాల మధ్య వున్న 420 గ్రామాలకు నరసరావుపేట నుంచే పాలన సాగించేవారు. మల్రాజు గూండారావు అప్పటి ఆంగ్ల ప్రభుత్వానికి సంవత్సరానికి 2,89,734 పగోడాలు శిస్తు చెల్లించారు. ఒక పగోడా విలువ నాలుగు రూపాయలు.

పలు ప్రజాహిత కార్యక్రమాల పేరిట చెరువులు, బావులను తవ్వించారు. చేతి వృత్తుల పై జీవించే ప్రజానీకానికి వందలాది ఎకరాలు భూదానం చేశారు. కుల, మతాలకు అతీతంగా మల్రాజు వంశస్తులు ఈ ప్రాంతంలో భూదానాలు పెద్ద ఎత్తున చేశారు. నరసరావుపేట ఈద్గా మసీదుకు 40 ఎకరాలు, పెద తురకపాలెంలో మసీదుకు పది ఎకరాలు, చిన తురకపాలెంలో మసీదుకు ఐదు ఎకరాలు దానం చేశారు.



ఆనాటి అద్దాల మేడ



మల్రాజు రామకృష్ణ కొండలరావు



మల్రాజు వేంకట నరసింహారావు



మల్రాజు విజయ కృష్ణ గూండారావు

### కోటప్పకొండకు సోపాన మార్గం నిర్మాణం

మల్రాజులు పాలనలో కోటప్పకొండ శ్రీ త్రికోటేశ్వర స్వామి పుణ్యక్షేత్రాన్ని అభివృద్ధి చేశారు. ఈ ఆలయానికి ధర్మకర్తలుగా జమీందారులు వున్నారు. కోటప్పకొండకు వచ్చే యాత్రికుల కోసం కొండ దిగువన చెరువులు తవ్వించారు. దేవాలయానికి 130 ఎకరాలు, అర్చకులకు 147 ఎకరాలు, పడి తరానికి 50 ఎకరాలు భూమిని ఆలయానికి విరాళంగా ఇచ్చారు. ఈ ఆలయానికి ప్రస్తుతం శాశ్వత ధర్మకర్తగా మల్రాజు వంశస్తుడు మల్రాజు వెంకట రామకృష్ణ కొండలరావు వున్నారు.

కోటప్పకొండతో పాటు మొత్తం ఏడు ఆలయాలకు ధర్మకర్తలుగా వ్యవహరించారు. ప్రముఖ శైవ క్షేత్రం చేజర్ల, ఇనిమెళ్ళలోని భావన్నారాయణ స్వామి ఆలయం, దేరంపాడు వెంకటేశ్వర స్వామి ఆలయం, అర్వపల్లి బాల కోటేశ్వర స్వామి ఆలయం, ములుకుదురు చెన్న కేశవ స్వామి ఆలయం, భృగుబండ ఆలయం, జగన్నాథ స్వామి ఆలయాలకు ధర్మకర్తగా జమీందార్ వంశీయులు వున్నారు. చేజర్ల ఆలయానికి దాదాపు 263 ఎకరాలు దానం చేశారు. ఇతర ఆలయాల నిర్వహణకు కూడా భూములను కేటాయించారు. నరసరావుపేటలోని ఎస్ఎస్ఎన్ కళాశాలకు కూడా స్థలాన్ని విరాళంగా ఇచ్చారు.



నరసరావుపేట తొలి మునిసిపల్ చైర్‌పర్సన్‌గా మల్రాజు వేంకట నరసింహారావు (రౌండ్ చేసిన వ్యక్తి), ఆయన కుమారులు, అప్పటి కౌన్సిలర్ల గ్రూపు ఫొటో

### మునిసిపల్ చైర్మన్లుగా...

మునిసిపల్ చైర్మన్లుగా మల్రాజు వంశస్తులు సుమారు 13 ఏళ్ళపాటు పని చేశారు. నరసరావుపేట పురపాలక సంఘం ఏర్పడిన అనంతరం 1926 నుంచి 1929 వరకు, 1931 నుంచి 1934 సంవత్సరం వరకు మల్రాజు వేంకట నరసింహారావు ఎనిమిది సంవత్సరాల పాటు మునిసిపల్ చైర్మన్‌గా పని చేశారు. ఆయన పాలనా కాలంలో వైద్యశాల నిర్మాణం చేపట్టారు. విద్యాభివృద్ధికి ఆయన విశేషంగా కృషి చేశారు. ఆయన పాలన సమయంలో తాగు నీటి ఎద్దడి నివారణకు బావులను అభివృద్ధి పరిచి ప్రజల మన్ననలను అందుకొన్నారు. 1934లో నరసరావుపేట మునిసిపల్ ఎన్నికలు జరిగాయి. అప్పట్లో 17 మంది కౌన్సిలర్లు మల్రాజు రామకృష్ణ కొండలరావును చైర్మన్‌గా ఏకగ్రీవంగా ఎన్నుకొన్నారు. ఆయన ఐదు సంవత్సరాలకు పైగా చైర్మన్‌గా పని చేశారు. ఈయన పదవీ కాలంలో నరసరావుపేట రెండో గ్రేడు మునిసిపాలిటీగా ఎదిగింది.

తొమ్మిది ఎలిమెంటరీ పాఠశాలలను మునిసిపల్ పాలక కిందకు తీసుకొచ్చి వాటిని అభివృద్ధి పరిచారు. హైస్కూల్‌లో ఆడియో విజువల్ ఎడ్యుకేషన్‌ను ప్రవేశ పెట్టారు. మునిసిపల్ గ్రంథాలయాన్ని ఏర్పాటు చేశారు. మునిసిపాలిటీలో తక్కువ వేతనం కింద పని చేసే ఉద్యోగులందరికీ గృహాలను నిర్మింప చేశారు. మునిసిపల్ హైస్కూల్‌ను హయ్యర్ సెకండరీ స్కూల్‌గా మార్పు చేయించారు. వేసవి కాలంలో నీటి ఎద్దడిని నివారించేందుకు లింగంగుంట్లలో బావి తవ్వించి ట్యాంకర్ ద్వారా ప్రజలకు సరఫరా చేశారు. ఆయన పదవీ కాలంలో అనేక సేవా కార్యక్రమాలు చేపట్టి ప్రత్యేక గుర్తింపు పొందారు.

### మల్రాజు వంశస్తులు...

నరసరావుపేట కేంద్రంగా మల్రాజు వంశస్తుల పాలన సాగింది. వారిలో మల్రాజు వేంకట గూండారావు (1826-1855) సంస్థానాధీసుడుగా పని చేశారు. మల్రాజు వేంకట నరసింహారావు, మల్రాజు కొండలరావు (1855 నుంచి 1880), మల్రాజు వేంకట నరసింహారావు (1880 నుంచి 1946), మల్రాజు వేంకట రామకృష్ణ కొండలరావు (1946 నుంచి 1967), ప్రస్తుతం ఆ వంశానికి చెందిన మల్రాజు విజయ కృష్ణ గూండారావు, ఆయన కుమారులు రామకృష్ణ కొండలరావు, రాజ్‌కుమార్‌లు వున్నారు. అప్పటిలో కోటలో నిర్మించిన కట్టడాలలో ఒక భవనం మాత్రమే వుంది. దీనిలోని గూండారావు కుటుంబం నివాసం వుంటున్నది. అయితే విజయ కృష్ణ గూండారావు చెన్నైలో వివిధ వ్యాపారాలు నిర్వహిస్తూ అక్కడే స్థిరపడ్డారు. ఆయన కుటుంబం నరసరావుపేట వచ్చిన సమయంలో ఇక్కడ వున్న పాత భవంతిలోనే నివాసం వుంటారు. నరసరావుపేట చరిత్రకు చిహ్నంగా ఈ భవంతి నిలిచింది. 1997 జూన్ 27, 28, 29 తేదీల్లో ఘనంగా నరసరావుపేట ద్విశాబ్ది ఉత్సవాలు జరిపారు.







# కాకలు తీరిన రాజకీయయోధుడు
# కాసు బ్రహ్మానందరెడ్డి



ముఖ్యమంత్రిగా బ్రహ్మానందరెడ్డి ప్రమాణ స్వీకారం చేసినప్పటి చిత్రం



సాగర్ డ్యాం ప్రారంభోత్సవంలో అప్పటి భారత ప్రధాని ఇందిరా గాంధీతో కాసు బ్రహ్మానంద రెడ్డి

(ఆన్‌లైన్, నరసరావుపేట)

మారుమూల గ్రామంలో రైతు కుటుంబంలో జన్మించి, అంచలంచలుగా ఎదిగి రాష్ట్ర ముఖ్యమంత్రిగా, కేంద్రంలో సైతం ఎన్నో ప్రతిష్ఠాత్మక పదవులు అలంకరించారు కాసు బ్రహ్మానందరెడ్డి. కార్యదీక్ష, పట్టుదలలో తనకు తానే చాటి అని నిరూపించుకున్నారు. రాష్ట్రపతి, ప్రధానమంత్రి పదవులు మినహా, దేశంలోని అన్ని అత్యున్నత పదవులన్నింటినీ ఆయన అధిరోహించారు. ముఖ్యమంత్రిగా సుదీర్ఘ కాలం పని చేసి, రాష్ట్ర అభ్యున్నతికి పాటుపడ్డారు. సాగర్ డ్యాంకు క్రస్ట్ గేట్లు ఏర్పాటు చేసి, ఈ ప్రాంతానికి సాగు నీరు అందించటంలో బ్రహ్మానందరెడ్డి విశేషంగా కృషి చేశారు. స్వాతంత్ర్య ఉద్యమంలో కూడా చురుకైన పాత్ర పోషించారు. 1929లో ఆయన రాజకీయ జీవితాన్ని ఆరంభించారు.

## కాసు ప్రస్థానం ఇలా...

1909 సంవత్సరం జులై 28న గుంటూరు జిల్లాలోని నాదెండ్ల మండలం, తూబాడు గ్రామంలో కాసు బ్రహ్మానందరెడ్డి జన్మించారు. ఆయన బీఎల్ పట్టభద్రుడు. విద్యార్థి దశ నుంచే రాజకీయాల్లో కాసు చురుగ్గా పాల్గొనేవారు. గాంధీయతత్వాన్ని పుణికి పుచ్చుకొన్న ఆయన ఆలవాట్లనే ఆచరణలో చూపేవారు. ఆయన ఇంటి నుంచి బయటకు వస్తే, తలపై ఖద్దరు టోపీ విధిగా వుండేది. ఈ ఆచారాన్ని పాటించిన నాయకులు చాలా అరుదు. తన టోపీ తిప్పే రీతిని ఇప్పటికీ ప్రత్యేకంగా చెప్పుకొంటారు. తల పై టోపీని తిప్పారంటే, ఒక మంచి ఆలోచనకు ఆయన నాంది పలికినట్లే. ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుకు బ్రహ్మానందరెడ్డి ముఖ్యమైన శిష్యుడిగా వున్నారు. టంగుటూరు ప్రకాశం పంతులు, కొండా వెంకటప్పయ్య, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, నడింపల్లి నరసింహారావు శాస్త్రిల స్ఫూర్తితో స్వాతంత్ర్య ఉద్యమంలో కాసు జిల్లాలో జరిగిన అనేక కార్యక్రమాల్లో చురుకైన పాత్రను పోషించారు. మద్రాసులో లా చదివే సందర్భంలో సైమన్ కమిషన్‌ను ఆయన బాయ్ కాట్ చేశారు. తమిళనాడు ఒక నాటి ముఖ్యమంత్రి అన్నాదురై బ్రహ్మానందరెడ్డికి సహచర విద్యార్థి.

## స్వాతంత్ర్యోద్యమంలో జైలు

1940 సంవత్సరంలో సత్యాగ్రహం చేయాలని పిలుపునిచ్చారు. ఈ సందర్భంగా 1941 ఫిబ్రవరిలో వ్యక్తిగత సత్యాగ్రహంలో పాల్గొన్న బ్రహ్మానందరెడ్డికి ఆరు నెలలు జైలు శిక్ష పడింది. 1942లో క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్న కాసు, 1943 సెప్టెంబరు 13న అరెస్టయ్యారు. ఆయన 1945 జనవరి 28న జైలు నుంచి విడుదలయ్యారు. ఏఐసీసీలో సభ్యుడిగా అనేక సంవత్సరాలు పని చేసిన ఆయన, కేంద్రంలో కాంగ్రెస్ ఎగ్జిక్యూటీవ్‌గా ప్రధాన పాత్ర పోషించి లాల్ బహదూర్ శాస్త్రి ప్రధాని కావటానికి కారకులయ్యారు. ఆయన రాజకీయ జీవితం 1929లో ప్రారంభమైంది.

1937లో ప్రకాశం పంతులు ఆశీస్సులతో 1937లో ఒంగోలు బోర్డు అధ్యక్షుడిగా ఆయన ఎన్నికయ్యారు. రాజకీయ రంగ ప్రవేశ అనంతరం నరసరావుపేటలో న్యాయవాద వృత్తిని కొంత కాలం నిర్వహించారు. 1946లో మద్రాసు రాష్ట్ర శాసన సభకు జరిగిన ఎన్నికల్లో నరసరావుపేట నియోజక వర్గం నుంచి ఎన్నికయ్యారు. మద్రాసు అసెంబ్లీలో అత్యంత కీలకమైన శాసన సభ్యునిగా పని చేశారు. ఆయనలోని నాయకత్వ లక్షణాలు గుర్తించి, ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శిగా బాధ్యతలు అప్పగించారు. సంజీవయ్య ముఖ్యమంత్రిగా వుండగా, కాసు ఆర్థిక మంత్రిగా పని చేశారు.

## పదవీ త్యాగం...

1964లో బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేశారు. కాంగ్రెస్ ప్రభుత్వంలో అత్యధిక కాలం ముఖ్యమంత్రిగా ఆయన రికార్డు సృష్టించారు. ఈ సమయంలో నాగార్జున సాగర్ డ్యాం పై క్రస్ట్ గేట్లు ఏర్పాటు చేసి, సుమారు 22 లక్షల ఎకరాలకు నీరు అందించటంలో కాసు చేసిన కృషి ప్రశంసనీయం.

తన జీవితంలో ముఖ్యమైన విశేషాల్లో నాగార్జున సాగర్ క్రస్ట్ గేట్లు ఏర్పాటు చేయటం ముఖ్యమైనదని, లక్షలాది మంది రైతుల పంట పొలాలకు సాగు నీరు అందించి, కలకాలం అన్నదానం చేశానని జ్ఞాపకం వచ్చినప్పుడు తనకు ఒళ్ళు పులకరిస్తుందని పలు సందర్భాల్లో బ్రహ్మానందరెడ్డి చెప్పుకొన్నారు.

## పక్కా గృహాలకు శ్రీకారం

సీఎం పదవీ కాలంలో రూ 10 కోట్లు హడ్కో రుణాన్ని ఎల్ఐసీ ద్వారా పొంది రాష్ట్రంలో మొట్టమొదటి సారిగా బలహీన వర్గాల వారికి ఇళ్ళ నిర్మాణం చేపట్టి పేరుతెచ్చుకొన్నారు. ఉర్దూ బాషకు తెలుగుతో సమాన ప్రతిపత్తిని కల్పించటంతో పాటు, అమలు చేయటంలో కూడా ఆయన ఎంతో కృషి చేశారు. బ్రహ్మానందరెడ్డి నాయకత్వంలో 1964 జనవరిలో 18న గ్రామ పంచాయతీ చట్టం అమలైంది. 1971 సెప్టెంబరు 23వ తేదీ వరకు ముఖ్యమంత్రిగా బ్రహ్మానందరెడ్డి కొనసాగారు. 1964 నవంబరులో గుంటూరులో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ కమిటీకి జరిగిన ఎన్నికల్లో కాకాని వెంకటరత్నాన్ని గెలిపించి రాష్ట్ర రాజకీయాల్లో ఆయనదే పైచేయి అని నిరూపించుకొన్నారు. మద్రాసులో స్థిరపడిన చలనచిత్ర పరిశ్రమ హైదరాబాద్ వైపు మళ్ళించటంలో ఆయన పాత్ర ప్రధానమైనది. సమైక్యాంధ్రా కోసం శాసన సభలో మెజార్టీ ఉన్నప్పటికీ ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేసి, మహానేతగా పేరొందారు. రాష్ట్ర సమైక్యత కోసం పాటుపడిన వారిలో బ్రహ్మానందరెడ్డి ముఖ్యులు.

## కేంద్ర మంత్రిగా...

కేంద్ర మంత్రిగా పలు శాఖల బాధ్యతలు చేపట్టారు. కమ్యునికేషన్‌లు, హోంశాఖ, పరిశ్రమల శాఖల మంత్రిగా కేంద్రంలో పని చేశారు. కమ్యూనికేషన్ల శాఖ మంత్రిగా టెలిఫోన్ సౌకర్యాన్ని ప్రజలకు మరింత చేరువు చేయటానికి ఆయన కృషి చేశారు. గ్రామాలకు సైతం ఫోన్ సౌకర్యాన్ని విస్తరింపచేశారు. హోంశాఖ మంత్రిగా, కేంద్ర పాలిత ప్రాంతాల్లో రాష్ట్రాలుగా ఏర్పాటు చేసి, వాటికి స్వయం ప్రతిపత్తిని కల్పించటంలో కాసు చేసిన కృషి ఎంతో వుంది. ఆరవ ఫైనాన్స్ కమిషన్ అధ్యక్షుడిగా పని చేశారు.

## రెడ్డి కాంగ్రెస్ ఏర్పాటు...

1977లో కాంగ్రెస్ కేంద్రంలో అధికారాన్ని కోల్పోయింది. ఆ తరువాత భారత మాజీ ప్రధాని ఇందిరాగాంధీతో బ్రహ్మానందరెడ్డికి విభేదాలు ఏర్పడ్డాయి. దీంతో అఖిల భారత కాంగ్రెస్ నిలువునా చీలింది. ఒక వర్గానికి ఇందిరాగాంధీ, మరో వర్గానికి కాసు బ్రహ్మానందరెడ్డి నాయకత్వం వహించారు. ఈ సందర్భంలోనే రెడ్డి కాంగ్రెస్ పార్టీని బ్రహ్మానందరెడ్డి స్థాపించారు. అనంతరం జరిగిన అసెంబ్లీ ఎన్నికల్లో రెడ్డి కాంగ్రెస్ పార్టీ పోటీ చేసింది. కొందరు ఎమ్మెల్యేలుగా కూడా పార్టీ తరపున ఎన్నికయ్యారు. అనంతరం జరిగిన రాజకీయ పరిణామాల్లో 1980లో తిరిగి కాంగ్రెస్(ఐ)లో బ్రహ్మానందరెడ్డి చేరి, అదే పార్టీ పై నరసరావుపేట నుంచి పార్లమెంట్‌కు ఎన్నికయ్యారు. 1982లో కాంగ్రెస్ సమన్వయ అధ్యక్షుడిగా వున్నారు. రాష్ట్రపతి, ప్రధాన మంత్రి పదవులు మినహా, దేశంలో అత్యున్నత స్థానాలన్నింటినీ బ్రహ్మానందరెడ్డి అధిరోహించారు. మహారాష్ట్ర గవర్నర్‌గా కూడా పని చేశారు. జాతీయ, రాష్ట్ర రాజకీయాల్లో తన దైన బాణీలో రాజకీయాలను నెరపిన మేరు మగధీరుడు కాసు బ్రహ్మానందరెడ్డి. ఆయన 1994 మే 20న హైదరాబాద్‌లో మరణించారు.

# తరలిపోతున్న పరిశోధనా స్థానాలు..

## ఆందోళనలో పుడమి పుత్రులు



పోస్ట్ హర్వెస్ట్ టెక్నాలజీ కేంద్రం

రాష్ట్రంలో తొలి వ్యవసాయ ఇంజనీరింగ్ కళాశాల, దేశంలో రెండో ఆహార విజ్ఞాన సాంకేతిక కళాశాల బాపట్లలోనే స్థాపించారు. 1955వ సంవత్సరంలో జీడి మామిడి పరిశోధనా స్థానం ఏర్పాటు చేశారు. ఆ తరువాత అనేక రకాల పరిశోధనాస్థానాలు బాపట్లలో స్థాపించడంతో నూతన రకాల తయారీకి ప్రసిద్ధి గాంచాయి. వ్యవసాయ కళాశాల క్షేత్రంలో ఏర్పాటు చేసిన మత్స్య పరిశోధనా స్థానాన్ని గతంలో ఇక్కడ నుంచి పశ్చిమగోదావరి జిల్లాకు తరలించారు. అలాగే కలుపు నివారణ పరిశోధనా స్థానాన్ని హైదరాబాదు రాజేంద్రనగర్‌కు తరలించారు. ఇటీవల తమలపాకుల పరిశోధనా స్థానాన్ని కూడా పశ్చిమగోదావరి జిల్లాకు తీసుకెళ్ళారు. ప్రస్తుతం కేంద్ర ప్రభుత్వం నిర్వహిస్తున్న పోస్ట్ హర్వెస్టింగ్ టెక్నాలజీ కేంద్రాన్ని తిరుపతికి తరలించారు. కోస్తా తుపాను ప్రభావిత ప్రాంతం కావడంతో రెండు దశాబ్దాలకు

రైతులకు ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని అందించేందుకు నాడు ఏర్పాటు చేసిన పరిశోధనా స్థానాలను ఒక్కొక్కటిగా ఇతర ప్రాంతాలకు ప్రభుత్వం తరలించుకుపోతోంది. సేద్యంలో విప్లవాత్మకమైన మార్పులు తీసుకొచ్చేందుకు బాపట్ల పట్టణంలో దశాబ్దాల క్రితం ఏర్పాటు చేసిన పరిశోధనా స్థానాలు తరలిపోవడం పుడమి పుత్రులకు ఆందోళన కలిగిస్తోంది. దక్షిణ భారతదేశంలో రెండో వ్యవసాయ కళాశాలను 1945వ సంవత్సరంలో బాపట్లలో పాలకులు ప్రారంభించారు. ఆ తరువాత వ్యవసాయం దాని అనుబంధ కళాశాలలు, పరిశోధన స్థానాలు ఒక్కొక్కటిగా ఇక్కడ ఏర్పాటు చేశారు.

పూర్వం పోస్ట్ హర్వెస్టింగ్ కేంద్రాన్ని బాపట్లలో ఏర్పాటు చేశారు. ఈ కేంద్రం ద్వారా ముగ్గురు శాస్త్రవేత్తలు, ఆరుగురు సాంకేతిక సిబ్బంది, ముగ్గురు కాంట్రాక్టర్ సిబ్బంది సేవలందిస్తున్నారు. పంటకోత అనంతరం ధాన్యం, ఇతర ఆహార ఉత్పత్తులు చెడిపోకుండా వాటి నాణ్యతను ఏవిధంగా కాపాడుకోవడం, ఉత్పత్తులను గ్రేడింగ్ చేయడం, నిల్వచేయడం, ఆగ్రోప్రాసెసింగ్ తదితర అంశాల పై శాస్త్రవేత్తలు క్షేత్రస్థాయికి వెళ్ళి రైతులకు అవగాహన కల్పిస్తుంటారు. ఇది రైతాంగానికి ఎంతో ఉపయోగకరంగా ఉండేది. దీనిలో ఒకటి భారతీయ వ్యవసాయ పరిశోధనా మండలి (ఐసీఏఆర్) నిధులతో, మరొకటి రాష్ట్ర ప్రభుత్వ నిధులతో నడిచేవి. ఐసీఏఆర్ నుంచి ఏటా ఈ కేంద్రానికి 22లక్షల రూపాయలు కేటాయిస్తున్నారు. ప్రస్తుతం దీనిని తరలించడం వల్ల రైతులకు సాంకేతిక పరిజ్ఞానం అంతంతా మాత్రంగానే అందుతుంది. దీంతో కేంద్ర జౌళిశాఖ సహాయ మంత్రి పనబాకలక్ష్మీ స్పందించారు. పరిశోధనా స్థానాన్ని బాపట్లలోనే ఉంచే విధంగా చర్యలు చేపట్టారు. ఇదిలా ఉండగా రాష్ట్ర ప్రభుత్వం నిర్వహిస్తున్న పోస్ట్ హర్వెస్ట్ టెక్నాలజీ కేంద్రాన్నైనా తీసుకెళ్ళాలనే ఆలోచనలో పాలకులు ఉన్నారు. ఈ విషయాన్ని రాష్ట్ర దేవాదాయశాఖ మంత్రి గాదె వెంకటరెడ్డి దృష్టికి తీసుకెళ్ళి పరిశోధనా స్థానం తరలి వెళ్ళకుండ చూడాలని పలువురు కోరుతున్నారు. మరికొద్ది రోజుల్లో జీడి మామిడి పరిశోధనా స్థానాన్ని కూడా తరలించాలన్న ప్రయత్నాలు జరుగుతున్నట్లు తెలుస్తోంది. జీడిమామిడి పరిశోధనా స్థానంలో ఉన్న ఔషధ మొక్కల పరిశోధనా స్థానాన్ని ఇప్పటికే తరలించినట్లు తెలిసింది. పశ్చిమగోదావరి జిల్లా తాడేపల్లిగూడెం సమీపంలో వెంకటరామన్నగూడెంలో దీనికి సంబంధించి విశ్వవిద్యాలయ కేంద్రాన్ని స్థాపించారు. రాష్ట్రంలో ఏకైక పరిశోధనా కేంద్రంగా వున్న దీనిని తరలించడం సరికాదని రైతులు అంటున్నారు. కేంద్ర, రాష్ట్ర మంత్రులు పనబాక లక్ష్మీ, గాదె వెంకటరెడ్డిలతో పాటు ఈ ప్రాంతానికి చెందిన రాజ్యసభ సభ్యుడు జేడీ.శీలం రైతుల శ్రేయస్సును దృష్టిలో వుంచుకుని పరిశోధనా స్థానాలు తరలిపోకుండా చూడాలని రైతులతో పాటు శాస్త్రవేత్తలు కోరుతున్నారు. అవసరం మేరకు కొత్తగా పరిశోధన స్థానాలు ఏర్పాటు చేసుకోవాలేగానీ ఇక్కడ రైతులకు ఉపయోగపడే వాటిని శాశ్వతంగా తరలించడం సరికాదని వారంటున్నారు.



జీడి మామిడి పరిశోధనా స్థానం



తమలపాకుల పరిశోధనాస్థానం

–ధనరాజు, బాపట్ల

# స్వాతంత్ర్య సమరంలో బాపట్ల



టౌన్‌హాలు

హోంరూలు ఉద్యమంపై బ్రిటీష్ ప్రభుత్వ దమననీతిని నిరసిస్తూ 1916లో బాపట్లలో సభ జరిగింది. సహాయ నిరాకరణోద్యమంలో భాగంగా బ్రిటీష్ ప్రభుత్వ పాఠశాలలను, కళాశాలలను విద్యార్థులు బహిష్కరించారు. వీరికోసం బాపట్లలో 1921 ఫిబ్రవరిలో ఒక జాతీయ కళాశాల ఏర్పాటయింది. కొండనాగు హనుమంతరావు ప్రభుత్వ పాఠశాలలను వదిలిన వంద మంది విద్యార్థులు ఇందులో విద్యగడిపారు. బాపట్ల వాస్తవ్యులైన పాటిబండ్ల కోటమ్మ, వాసిరెడ్డి రాజ్యలక్ష్మమ్మ, మంతెన అన్నపూర్ణమ్మ, తిలక్ స్వరాజ్యనిధికి తమ బంగారునగలు సమర్పించారు. బ్రిటీష్ ప్రభుత్వ పునాదులు కదుపుతూ 1921లో చీరాల–పేరాల ఉప్పు సత్యాగ్రహ ఉద్యమానికి నాయకత్వం వహించిన ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య బాపట్ల బోర్డు హైస్కూల్ విద్యార్థి కావడం, తాలూకా కార్యాలయంలో గుమాస్తాగా పనిచేయడం విశేషం. దేశ స్వాతంత్ర ఉద్యమంలోనే ఎంతో చారిత్రక ప్రాధాన్యం సంతరించుకుని పన్ను నిరాకరణోద్యమంలో అగ్రభాగాన నిలిచిన పెదనందిపాడు ఫిర్కా అప్పటి బాపట్ల తాలూకాలో అంతర్భాగంగా వుంది. బాపట్ల తాలూకా వచ్చిన బ్రిటీష్ అధికారి రూథర్‌ఫర్డ్ పూర్తి సహాయ నిరాకరణాన్ని ఎదుర్కోవడానికి అనేక ఇబ్బందులు పడ్డారు. ఈ పన్ను నిరాకరణోద్యమానికి నాయకత్వం వహించిన పర్వతనేని వీరయ్యచౌదరి బాపట్ల తాలూకా కాంగ్రెస్ ఆర్గనైజర్‌గా ఉన్నారు. పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమానికి ముందే బాపట్ల తాలూకాలోని చందోలు కరణం మాచిరాజు రామమూర్తి తన ఉద్యోగానికి రాజీనామా చేశారు. అంతేకాక మిగిలిన గ్రామోద్యోగులను ప్రోత్సహించి సభను నిర్వహించి ప్రచారం చేశారు. 1923 మే నెలలో బాపట్లకు చెందిన ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు భట్టిప్రోలు సూర్యప్రకాశరావు నాగపూర్ వెళ్ళి నాగపూర్ జెండా సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో ఉప్పు తయారు చేయడానికి, నిల్వచేయడానికి బాపట్ల తాలూకాలోని గణపవరం ఒక కేంద్రంగా ఎంపికయింది. 1920ఏప్రిల్ 12న మాధవపెద్ది కాళిదాసు అధ్యక్షతన సమావేశమైన బాపట్ల 'బార్ అసోసియేషన్... సభ్యులందరూ కోర్టులకు హాజరయ్యేటప్పుడు ఖద్దరు దుస్తులను ధరించడం వాంఛనీయమని అభిప్రాయ పడుతోదంటూ ఒక తీర్మానాన్ని ఆమోదించింది. కనపర్తి వరలక్ష్మమ్మ బాపట్లలో మహిళలచేత రాట్నాల క్ష్మవ్రతం చేయించి ప్రతిరోజు నూలువడకాలని, ఖద్దరు దుస్తులనే ధరించాలని ప్రతిజ్ఞ చేయించేవారు. శాసనోల్లంఘన ఉద్యమంలో బాపట్ల ప్రాంతానికి చెందిన మంతెన వెంకట్రాజు, మల్లాది యజ్ఞనారాయణ, రావూరి శ్రీశైలపతిలకు జైలు శిక్ష విధించబడింది. 1938లో మంతెన వారిపాలెంలో రాష్ట్ర రాజకీయ పాఠశాల నిర్వహించేవారు. పెదనందిపాడు, నరసాయపాలెం కేంద్రాలుగా కమ్యూనిస్టు సెల్‌లు నిర్వహించబడ్డాయి. క్విట్ ఇండియా ఉద్యమంలో భాగంగా 1942 ఆగస్టు 12న ఉద్రిక్తమైన జనసమూహాలు బాపట్ల రైల్వేస్టేషన్‌పై దాడిచేసి ఇన్సులేటర్లను, టెలిగ్రాఫ్ స్తంభాలను పగులగొట్టి టెలిఫోన్ పరికరాలను ధ్వంసం చేశాయి. అంతకుముందు ప్రజలు బాపట్ల సబ్‌కోర్టుపై దాడిచేశారు. శ్రీరామచంద్రరావు సబ్‌జడ్జి కుర్చీలో కూర్చుని బాపట్ల స్వతంత్ర పట్టణమని ప్రకటించారు. ఈ క్విట్ ఇండియా ఉద్యమం సందర్భంగా బాపట్లలో నాళం రామచంద్రరావు, వేదాంతం వాసుదేవ రావు, లక్కరాజ భార్గవి, మనోహర రావు, ఆచంట రంగనాయకులను బ్రిటీష్ ప్రభుత్వం నిర్బంధించింది. వీఎల్.సుందరరావు, దేశిరాజు శర్మ బాపట్ల తాలూకా ప్రాంతమంతా పర్యటించి ఈ ఉద్యమాన్ని నడిపారు. 1921 మార్చి 30న ఏఐసీసీ మహాసభకు విజయవాడ వచ్చిన గాంధీ తన పర్యటనలో భాగంగా ఏప్రిల్ 6న ప్రప్రథమంగా బాపట్లను సందర్శించారు. మళ్ళీ 1936లో బాపట్ల తాలూకాలో సంబవించిన తుపాను బీభత్సాన్ని చూడడానికి వచ్చారు. 1934లో అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్షుడు బాబూరాజేంద్రప్రసాద్ బాపట్లను సందర్శించి టౌన్‌హాలులో జరిగిన సభలో ప్రసంగించారు. 1936వ సంవత్సరంలో అఖిల భారత కాంగ్రెస్ నాయకులు జవహార్‌లాల్ నెహ్రూ బాపట్ల సందర్శించి రైల్వేస్టేషన్ వద్ద జరిగిన సభలో ప్రసంగించారు.

–(ఆన్‌లైన్, బాపట్ల)

# భావపురి ఇలవేల్పు... భావన్నారాయణస్వామి



భావన్నారాయణస్వామి దేవాలయం

(ఆన్‌లైన్ - బాపట్ల)

భావ సౌందర్యాలవిరి భావపురి. కళ సాంస్కృతిక విద్యకేంద్రంగా వెలుగొందుతోంది. 'భావపురి' ఇలవేలుపు, ఆరాధ్యదైవం భావన్నారాయణస్వామి. ఆంధ్రావనిలో వెలనాటి సీమ లోకెల్లా అతిప్రాచీనమైన, చారిత్రక ప్రసిద్ధి కలిగి, పురాతత్వశాఖచే రక్షిత స్థలంగా కూడా గుర్తించిన 'శ్రీ భావన్నారాయణ స్వామి దేవాలయం' అత్యంత రమణీయం, దర్శనీయం. క్రీ.శ.5వ శతాబ్దంలో 'భావపట్టణ' అనే పేరుతో క్రిమికంఠ చోళ చక్రవర్తి ఈ గ్రామాన్ని స్థాపించాడని తెలుస్తున్నది. చోళ మహారాజు 'భావన్నారాయణస్వామి' దేవాలయమును నిర్మించి చంద్రగిరి వెంకన్నను పూజలు చేసేందుకు నిర్వహించినట్లు తెలుస్తోంది. మహామండలేశ్వర దత్తము చేసిరి. క్రీ.శ.1043లో శ్రీ వైష్ణవ అర్చక సంప్రదాయం నెలకొల్పా రు. కొణిదెన చోళులు, గుంటూరు పల్లవులు, చందవోలు వెలనాటి చోళులు పోషకులుగా దేవస్థాన అభివృద్ధికి తోడ్పడ్డారు. సంధి విగ్రహ సోమన పెగ్గడ, కామన పెగ్గడ, రాజ్యదక్ష మంత్రి, మూలభృత్య, కట్టూరవ, కావలియ వంటి అధికారులు మణిమాన్యాలతో ప్రభువుకు సేవ చేశారు.కొన్ని శాసనముల ద్వారా కన్నిసెట్టి, సమయ సేనాధిపతి,నగర పురుష నీలిసెట్టి అఖండ దీపానికి తైలాదికాలు సమర్పించినట్లు సమాచారం. విజయనగర సామ్రాజ్యాధినేత శ్రీ కృష్ణదేవరాయలు కూడా ధనరూప విరాళం ఇచ్చారు. కొంతకాలం పరాధీనపాలనలో వుండి వైభవం కోల్పోయినా రాజమండ్రికి చెందిన రాజాకాండ్రేగుల జోగి జగన్నాధరావు బహద్దూర్ దేవాలయమునకు పూర్వ వైభవం తెచ్చారు. క్రీ.శ.1803 ప్రాంతంలో మూలవిరాట్టు పునఃప్రతిష్ట చేశారు. అమరావతికి చెందిన వాసిరెడ్డి వెంకట్రాది నాయుడు ధ్వజ స్తంభాన్ని, యడవల్లి వెంకయ్య మహాద్వార గాలిగోపురాన్ని, వింజమూరి వెంకటరావు పంతులు ఆలయప్రాకారాన్ని, శిఖం వెంకట గురవయ్య కీర్తి స్తంభాన్ని నిర్మించారు. భావన్నారాయణస్వామి దేవస్థాన ధర్మాదాయాన్ని నిర్వహించేందుకు స్థానాధిపతులుగా వ్యవహరించిన వారి లో విష్ణువర్ధన పండితులు, గోక న పండితులు, సుంకనభట్లు ఉన్నారు. భావన్నారాయణ బ్రహ్మారాయణులు మధుసూదన, రాజనారాయణ, ఎరపోతు, ఎర్నకొంబ మొదలగువారు కోశాధిపతులుగా వ్యవహరించేవారు. శాసనాలద్వారా ఎంతోమంది పరిచారికలు 'సాను'లు పురుష నృత్యకళాకారులు కూడా స్వామిసేవలో పునీతులైనట్లు తెలిసింది. ప్రఖ్యాత నర్తకి 'లకుమాదేవి' ఈ క్షేత్రం నుంచే అపచితిప్పయ్య శెట్టి ద్వారా కర్పూర వసంత రాయల ఆస్థాన నరక్తిగా చేరారు. భావన్నారాయణస్వామి దేవాలయం మహాచారిత్రక నిర్మాణంగాను, రమణీయ క్షేత్రంగాను దర్శనీయ పవిత్ర స్థలంగాను పేరుగాంచింది. వివిధ శిల్పాకృతులతో అలరాలే గాలిగోపుర మహాద్వారం నుంచి ప్రవేశించగానే ఎడమ బాగాన కల్యాణ మంటపం, ఎదురుగా రెండు ధ్వజ స్తంభాలు, వాటి పక్కన పాలరాతి శాసనాలు ఉంటాయి. ఆలయ లోపలి భాగంగా ప్రతిష్టించిన మూలవిరాట్ ఉండే గర్భగుడి చుట్టూ ఆంజనేస్వామి, గరుడాళ్వారులు,శాంతకేశవస్వామి, పవళింపు సేవామందిరం,రాజ్యలక్ష్మి, అమ్మవారు, విఖనస స్వామి, రంగనాయకస్వామి,గోదాదేవి, సీతారాములు,జ్వాలా నరసింహాస్వామి, భాష్యకారుల మందిరాలు ఉంటాయి. ఒకప్పుడు ఇక్కడే ఉండే శివలింగాన్ని విడిగా తీసి సోమేశ్వరాలయం నిర్మించి అక్కడ ప్రతిష్ఠించారు. భావన్నారాయణస్వామి దేవస్థాన చారిత్రక విశేషాలే కాక అనుశ్రుతంగా వస్తున్న క్షేత్రగాథకూడా ఒకటి ప్రచారంలో ఉంది. బాపట్లకు సమీప గ్రామమైన 'కొండపాటూరు' నుంచి బావ,మరదులు కట్టెలు కొట్టుకొనేందుకు వచ్చారు. అందులో బావ ఒక క్షీర వృక్షంపై వేటు వేయగా దాని నుంచి రక్తం ప్రవహించింది. అది చూసి దైవమాయగా భావించి స్పృహ కోల్పోయిన బావను రక్షించుకనేందుకు ప్రార్థించాడు.దీంతో తిరిగి స్పృహలోకి వచ్చాడు. 'బావా' అని పిలిస్తే 'ఓయ్' అని చెట్టు నుంచి బదులు వచ్చింది కాబట్టి 'బావపట్ల' అనే పేరుకూడా 'బాపట్ల'కు వచ్చింది. అప్పటినుంచి బావమరుదులు భక్తిశ్రద్ధలతో స్వామిని ఆరాధించేవారు. అంతేకాక క్రిమికంఠ చోళ చక్రవర్తి 'ఆముదాలపల్లి'లో విడిది చేయగా వారి పట్టపుటేనుగు మేత కోసం ఈ ప్రాంతం వచ్చి క్షీరవృక్షాన్ని తొండముతో తాకింది. తొండం వృక్షానికి అతుక్కుని ఊడి రాలేదు. విషయం తెలిసిన మహారాజు వచ్చి దైవాన్ని ప్రార్థించగా తొండం ఊడి వచ్చింది. దీంతో అక్కడే స్వామి విగ్రహ ప్రతిష్ఠ చేసి చోళుడు ఆలయ నిర్మాణాన్ని చేపట్టాడు. వెంకటగిరి సంస్థానంలోని చిమ్మిరిబండి కొండ నుంచి ఎండకాలం చల్లగాను,చలి కాలం వెచ్చగాను ఉండే రాయి తెప్పించి ఆలయ నిర్మాణం చేశారు. పునాదుల తవ్వకంలో పుట్టలో నుంచి నృసింహాస్వామి విగ్రహం బయట పడింది. విగ్రహాం అక్కడ నుంచి కదలకుండా అక్కడే ప్రతిష్టించారు. అలా వెలిసిన నృసింహాస్వామి దృష్టిచే అక్కడకు ఆరు క్రోసుల దూరంలోని కారంచేడు గ్రామం దగ్ధమవటం గమనించి ఎదురుగా శాంతకేశవస్వామిని ప్రతిష్టించారు. తరువాత కొండపాటూరు గ్రామంలో జొన్న పాతరలో రాజ్యలక్ష్మి అమ్మవారి విగ్రహాము బయటపడింది. తాను భావన్నారాయణస్వామి దేవేరినని భక్తులకు తెలిపింది. కొండపాటూరు బావమరుదులు..భావన్నారాయణస్వామి ఆలయంలోని వాయువ్య భాగంలో ఆమెను ప్రతిష్ఠించారు. ఇప్పటికీ అమ్మవారి పుట్టినిల్లయిన కొండపాటూరు గ్రామం నుంచేప్రతి ఏటా స్వామి కల్యాణానికి మంగళ ద్రవ్యాలు తీసుకు రావడం ఆనవాయితీగా కొనసాగుతోంది. ప్రతి ఏటా వైశాఖశుద్ధ సప్తమి నుంచి పౌర్ణమి వరకు, స్వామి బ్రహ్మోత్సవాలు అంగరంగ వైభోగంగా జరుగుతాయి. బ్రహ్మోత్సవాలలో 'పొన్నమాను' ఊరేగింపు ఒక ప్రత్యేక ఆకర్షణ! రథోత్సవం బ్రహ్మాండంగా జరుగుతుంది. స్వామి రథం భావన్నారాయణస్వామి దేవస్థానం నుంచి ఆంజనేయస్వామి దేవస్థానం వరకు వె ళ్ళి వెనుకకు మరలుతుంది. అందుకనే బాపట్ల మెయిన్ బజారు ను 'రథం బజారు' అం టారు. 'బావయ్య' తిరణాలరోజు ఆనందోత్సాహాలతో రథయాత్రలో పాలు పంచుకుంటారు. దైవ దర్శనం చేసుకోవడం, భాష్య కారుల సన్నిధిలో గుంజళ్ళు తీ యడం... రథానికి తాడు లాగడం ద్వారా త మ భక్తిప్రపత్తులను తె లుపుతారు.



ఆలయ గాలిగోపురం

# హరిత విప్లవానికి చేయూత

## బాపట్ల వ్యవసాయ కళాశాల



బాపట్ల వ్యవసాయ కళాశాల

(ఆన్‌లైన్–బాపట్ల)

బాపట్ల వ్యవసాయ కళాశాల ఎందరో విద్యార్థులకు, రైతులకు సేవలందించి హరిత విప్లవానికి నాందిపలికింది. జిల్లాలోని బాపట్ల వ్యవసాయ కళాశాల పలు పరిశోధనలు చేస్తూ అత్యున్నత ఫలితాలు సాధించి వ్యవసాయ శాస్త్రవేత్తలకు పుట్టినిల్లుగా అంతర్జాతీయ ఖ్యాతిని గడించింది. బ్రిటిష్ పాలకుల హయాంలో ఆంధ్రరాష్ట్రాన్ని అన్నపూర్ణగా తీర్చిదిద్దే ప్రయత్నంగా దక్షిణాది రాష్ట్రాలలోని కోయంబత్తూరు తర్వాత ఆంధ్రప్రదేశ్‌లో ప్రప్రథమంగా ఈ కళాశాలను బాపట్లలో 70ఎకరాల విస్తీర్ణంలో 1945 జూలై 11న ప్రారంభించారు. అప్పటి తాలూకా బోర్డు అధ్యక్షుడు పాములపాటి వెంకయ్యచౌదరి, వ్యవసాయ సంచాలకులు డాక్టర్ బి.వి.నాథ్, అప్పటి జిల్లా కలెక్టర్ ఎం.డి.సుల్తాన్ మొహిద్దీన్‌ల కృషితో అవిర్భవించిన ఈ కళాశాలను అప్పటి మద్రాసు సలహాదారుడైన సొంతి వెంకట రామ్మూర్తి ప్రారంభించారు.

### శాస్త్రవేత్తల పుట్టినిల్లు

బాపట్ల వ్యవసాయ కళాశాలలో విద్యనభ్యసించిన ఎందరో విద్యార్థులు శాస్త్రవేత్తలుగా పేరు ప్రఖ్యాతులు గడించారు. అలాగే కళాశాలలో పట్టభద్రులైన విద్యార్థులు, జాతీయ,అంతర్జాతీయ స్థాయిలో పలు రంగాల్లో ఉన్నత కీలక పదవులను నిర్వహిస్తున్నారు. ఐపిఎస్, ఐఎఎస్,ఐఆర్ఎస్, బ్యాంకింగ్ రంగాలతో పాటు రాజకీయ,పారిశ్రామిక వేత్తలుగా అత్యున్నత స్థానాల్లో ఉన్నారు. అంతర్జాతీయ ఉష్ణమండల వ్యవసాయ పరిశోధన కేంద్రం నైజీరియా మాజీ డైరెక్టర్ డాక్టర్ ఎన్.వి.ఎస్.శాస్త్రి, ఎరిడ్ జాన్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ సంచాలకులుగా పనిచేసిన డాక్టర్ జి.వెంకటేశ్వర్లు, కేంద్రీయ పరిశోధన సంస్థ డైరెక్టర్‌గా పనిచేసిన డాక్టర్ బత్తిన వెంకటేశ్వర్లు, ఆచార్య ఎన్.జి.రంగా వ్యవసాయ విశ్వవిద్యాలయం వైస్ చాన్స్‌లర్‌గా పనిచేసిన ఐ.వి.సుబ్బారావు,మాజీ కేంద్ర మంత్రి డాక్టర్ ఉమ్మారెడ్డి వెంకటేశ్వర్లు, హైదరాబాదు దూరదర్శిని కేంద్రం డిప్యూటీ డైరెక్టర్ ఆర్.ఆర్.మిశ్రా, కలెక్టర్ కాంతిలాల్ దండే తదితరులు ఈ కళాశాలలో విద్యనభ్యసించిన వారే.

### కళాశాల స్థాయి నుంచి యూనివర్సిటీ దాకా

ఆంధ్ర విశ్వవిద్యాలయం అనుబంధంగా వున్న ఈ కళాశాలను 1964లో ఆంధ్రప్రదేశ్‌లో అగ్రికల్చర్ యూనివర్సిటీ పరిధిలోకి చేర్చారు. ప్రస్తుతం ఆచార్య ఎన్.జి.రంగా అగ్రికల్చర్ యూనివర్సిటీ పరిధిలో వుంది.1970–71లో రజతోత్సవ వేడుకలు, 1994–95లో వ్యవసాయ కళాశాల స్వర్ణోత్సవ వేడుకలు, 2004–2005 వజ్రోత్సవ వేడుకలు జరుపుకుంది. మానవ వనరుల అభివృద్ధి పథకం కింద (ఎహెచ్‌ఆర్‌డి) ప్రపంచ బ్యాంక్ ఎఫ్‌ఓ సౌజన్యంతో వ్యవసాయ కళాశాల అధ్యాపకులు 11మంది సాంకేతిక విజ్ఞానం పెంపొందించుకోవడానికి విదేశాల్లో శిక్షణ పొందారు. అయిదుకోట్ల రూపాయల వ్యయంతో అత్యాధునిక వ్యవసాయ పరికరాలు కొనుగోలు చేసి విద్యార్థులకు విద్యాబోధనను ఆడియో విజువల్స్ ద్వారా అందిస్తున్నారు. వ్యవసాయ పరంగా రైతన్నలకు వ్యవసాయ సాంకేతిక పరిజ్ఞానాన్ని చేరువ చేసేందుకు ప్రతి మూడేళ్లకు ఒక గ్రామాన్ని ఎంపిక చేసి వ్యవసాయ ఉత్పత్తులు పెంచేందుకు వ్యవసాయ కళాశాల దత్తత గ్రామం పథకాన్ని అమలు చేస్తోంది. వ్యవసాయ కళాశాల ఆవరణంలో డాక్టర్ బి.వి.నాథ్ ఆడిటోరియం, రైతులకు అతిథి గృహం, బాలికల వసతి గృహలతో పాటు పీజీ హాస్టల్, పెవిలియన్, జిమ్ కాంప్లెక్స్, ప్రాంతీయ గ్రంథాలయం, జేసీబోస్ బిల్డింగ్, విద్యార్థుల పరీక్ష కేంద్రాల భవన సముదాయాలు ఉన్నాయి. విద్యార్థుల మానసిక వ్యక్తిత్వ వికాసం కోసం ఆరోగ్య,వ్యాయామ శాలలను ఏర్పాటు చేశారు. ఎన్ఎస్ఎస్, ఎన్‌సీసీ యూనిట్ల విభాగాలు ఉన్నాయి. విద్యార్థుల భవిష్యత్ కోసం స్టూడెంట్ కౌన్సెలింగ్, ప్లేస్‌మెంట్ సెల్, అగ్రికల్చరల్ రీసెర్చి ఇన్ఫర్మేషన్ సెంటర్లు ఏర్పాటు చేశారు.

### శాఖోపశాఖలుగా విస్తరిస్తూ...



డీన్ డాక్టర్ ఉల్చిశంకరరావు

ఇంతటి ప్రాముఖ్యత సంతరించుకున్న కళాశాలకు బాపట్ల–గుంటూరు రోడ్డులో రైల్వే ఫ్లైఓవర్‌బ్రిడ్జి వద్ద 400 ఎకరాల విస్తీర్ణమున్న వ్యవసాయ క్షేత్రం వుంది. అత్యధిక ప్రాధాన్యత సంతరించుకున్న బీపీటీ వరి వంగడాన్ని తయారుచేసిన ఘనత బాపట్ల శాస్త్రవేత్తలదే. ఈ క్షేత్రంలో పలు వ్యవసాయ పరిశోధన కేంద్రాలతో పాటు, వ్యవసాయ కళాశాలలో 30రకాల వివిధ భాగాల అధిపతులు, అధ్యాపకులు వ్యవసాయ కళాశాల అసోసియేట్ డీన్ విశేష సేవలందిస్తున్నారు. కళాశాలతో పాటు ఆధునిక కాలానికి కావాల్సిన టెక్నాలజీ అందించే దిశగా బాపట్ల వ్యవసాయ ఇంజనీరింగ్ కళాశాల ఏర్పాటు జరిగింది. ఈ కళాశాలకు అసోసియేట్ డీన్‌గా డాక్టర్ ఉలిచి శంకరరావు వ్యవహరిస్తున్నారు. వీటితో పాటు ఆచార్య ఎన్.జి.రంగా ఫుడ్ టెక్నాలజీ కళాశాలను హోమ్ సైన్సు కళాశాల ప్రాంగణంలో ఏర్పాటు చేశారు. ఆంధ్రప్రదేశ్ నీటి యజమాన్య ప్రాజెక్టు, జీడి మామిడి పరిశోధనస్థానం, ఉప్పునీటి పరిశోధన స్థానం, వరి వంగడాల పరిశోధన స్థానం బాపట్లలో అనుబంధ రీసెర్చి ఇనిస్టిట్యూట్‌గా పనిచేస్తున్నాయి. ఈ కళాశాల ఇక్కడ ఉండటం బాపట్లకే తలమానికం.

## ప్రాచీన హస్త కళల్లో మేటి

# తోలు బొమ్మలాట

(ఆన్‌లైన్, నరసరావుపేట రూరల్)

ప్రాచీన హస్త కళల్లో తోలు బొమ్మలాటకు అత్యంత ప్రాధాన్యత ఉంది. తోలు బొమ్మలాటకు నరసరావు పేట ప్రసిద్ధి. దీనికి కాలానుక్రమంగా ఆదరణ కరువై సంబంధిత కుటుంబాలు జీవనం సాగించలేని పరిస్థితులు నెలకొన్నాయి. ఈ నేపథ్యంలో రాష్ట్ర హస్త కళల విభాగం అంతరించి పోతున్న తోలు బొమ్మల హస్త కళలకు జీవం పోసేందుకు చర్యలు చేపట్టింది. తరతరాలుగా తోలు బొమ్మలు తయారు చేసుకొని ప్రదర్శించే కుటుంబాలకు ప్రత్యామ్నాయ మార్గాలను చూపించడంతో పాటు ఈ సాంస్కృతిక కళను భవిష్యత్ తరాలకు తెలియజేసే విధంగా హస్తకళా విభాగం తోలు బొమ్మల తయారీపై శిక్షణను ఏర్పాటు చేసింది. దీనిలో భాగంగా నరసరావు పేట కోటప్పకొండ రోడ్డులో షిర్డీ సాయిబాబా లెదర్ పపెట్స్ సొసైటీ ఆధ్వర్యంలో 15 కుటుంబాల వారు బొమ్మల తయారీపై శిక్షణ పొందుతున్నారు. భారతం, రామాయణ ఇతివృత్తాలతో గ్రామాల్లో తోలు బొమ్మలాటలు వేసి జీవనం సాగించేవారు. టీవి, సినిమా రంగాల అభివృద్ధితో తోలు బొమ్మలాటకు ప్రజల నుంచి ఆదరణ కరువైంది. కొన్నేళ్ళుగా ఆయా కుటుంబాలు ప్రదర్శనలు లేక ఉపాధి కోల్పోయాయి. శ్రీరామనవమి తదితర పర్వదినాల ఉత్సవాల్లో ఈ ప్రదర్శనలు సాగేవి. ఇవన్నీ కనుమరుగై పోవడంతో ఆయా కుటుంబాలు గృహ అలంకరణకు ఉపయోగించే తోలు బొమ్మల తయారీపై దృష్టి సారించాయి. నరసరావుపేటలో ఇప్పటికే కొందరు హస్తకళా విభాగం వారు ఏర్పాటు చేసిన శిక్షణా కార్యక్రమాల్లో శిక్షణ పొందారు. ఆయా వ్యక్తులు మరి కొందరికి వీటి తయారీపై శిక్షణ ఇస్తున్నారు. వీరు తయారు చేసే గృహాలంకరణ తోలు బొమ్మలకు విశేష ప్రాచుర్యం లభిస్తున్నది. వీరి ఉత్పత్తులు దేశవ్యాప్తంగా హస్తకళల విభాగం వారు ఏర్పాటు చేసే ఎగ్జిబిషన్స్‌లలో విక్రయాలు జరుపుకొంటున్నారు. కేంద్ర ప్రభుత్వ హస్తకళా విభాగం వీరికి ప్రత్యేక గుర్తింపు ఇచ్చింది. ఇప్పటికే హైదరాబాద్, ఢిల్లీ, ముంబాయి, చెన్నై, అలహాబాద్ తదితర పట్టణాల్లో ఏర్పాటు చేసిన హస్త కళా ప్రదర్శనలో తోలు బొమ్మలను విక్రయించారు. తోలుతో దేవతల ఆకృతులు, ల్యాంప్ షేడ్స్, సపోర్టింగ్ వాల్స్ తయారు చేస్తున్నారు. వీటిలో ల్యాంప్ షేడ్స్‌కు మంచి ఆదరణ లభిస్తున్నది. సంపన్న వర్గాలు తోలుతో తయారైన గృహాలంకరణ వస్తువులను వారి గృహాల్లో అలంకరించేందుకు ఆసక్తి కనబరుస్తున్నారు. దీంతో తోలు బొమ్మల తయారీ దారుల ఉత్పత్తులకు ఆదరణ లభిస్తున్నది. ప్రాచీన కళా వైభవానికి వీరు తయారు చేసే తోలు వస్తువులు అద్దం పడుతున్నాయి. మేక తోలను వినియోగించి పై అలంకరణ వస్తువులను తయారు చేస్తారు. తోలుపై రామాయణ, మహాభారత ఘట్టాల్లోని సన్ని వేశాలను ముందుగా వారు స్వయంగా డ్రాయింగ్ వేస్తారు. అనంతరం డ్రాయింగ్‌కు పెయింటింగ్ అందంగా తీర్చి దిద్దుతారు. వాటర్ ప్రూఫ్ రంగులను ఇం దుకు వినియోగిస్తారు. ల్యాంప్ షేడ్స్ ఆకారానికి తగిన విధంగా చట్రాన్ని తయారు చేసి దానికి పెయింటింగ్ చేసిన తోలును అమరుస్తారు. దీనికి స్టాండ్‌ను రూపొందించి బల్బును ఏర్పాటు చేస్తారు. తోలుపై అందమైన బొమ్మలతో పెయింటింగ్ చేయడం వలన ఇవి విశేషంగా ఆకర్షిస్తుంటాయి.

అలాగే గోడకు తగిలించే విధంగా తోలు పెయింటింగ్‌లు రూపొందిస్తున్నారు. సీతా స్వయంవరం, మహిషాషుర మర్ధని, విఘ్నేశ్వరుడు తదితర దేవతల బొమ్మలకు ప్రాచీన కళ ఉట్టిపడే విధంగా తయా రు చేస్తున్నారు. గృహాల్లో చెక్కతో తయారు చేసిన రూం పార్టీషన్స్ వినియోగిస్తుంటారు. ప్రస్తుతం వీటి స్థానంలో ఇక్క డి కళాకారులు తయారు చేస్తున్న తో లుతో తయారు చేస్తున్న పార్టీషన్స్ వినియోగంలోకి వస్తున్నాయి. వీటిని కూడా ప్రత్యేక శైలిలో తయారు చేస్తున్నారు. మొత్తం 30 కుటుంబాల వరకు ఈ వృత్తి పై ఆధారపడి జీవిస్తున్నాయి.



తోలుతో చేసిన దేవుళ్ల బొమ్మలు



తోలుతో చేసిన గృహాలంకరణ వస్తువులు

























# ఉద్దండులనందించిన పోతుగడ్డ.. పొన్నూరు

## స్వతంత్ర, కృషికార్ లోక్‌పార్టీలను స్థాపించిన రంగా ఇక్కడి వారే..


ఎన్.జీ.రంగా


గోగినేని నాగేశ్వరరావు


ధూళిపాళ్ళ వీరయ్య చౌదరి


అంకినీడు ప్రసాద్

డీ.శ్రీధర్, పొన్నూరు

ఎన్నో స్వాతంత్ర్య ఉద్యమాలకు ఊపిరిపోసింది పొన్నూరు. కేంద్ర, రాష్ట్ర రాజకీయాల్లో ఎంతోమంది మహానేతలుగా వెలుగొందారు. రాజకీయాల్లో తమదైన ముద్రవేసి ప్రజల గుండెల్లో సుస్థిర స్థానం సంపాదించుకున్నారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో నిడుబ్రోలుకు చెందిన పాములపాటి వెంకట కృష్ణయ్య చౌదరి గుంటూరు జిల్లా బోర్డు చైర్మన్‌గా పని చేశారు. ఈయన హయాంలో నిడుబ్రోలు జిల్లా పరిషత్ పాఠశాల తరహాలో జిల్లాలో ఎన్నో ఉన్నత పాఠశాలలను నెలకొల్పారు.

ఎన్‌జీ. రంగాగా పేరొందిన గోగినేని రంగనాయకులు నిడుబ్రోలు వాసి. సుదీర్ఘ కాలం లోక్‌సభ సభ్యుడిగా పని చేశారు. రాజ్యసభ సభ్యుడిగాను పని చేశారు. ఈయన మహాత్మాగాంధీ, ఇందిరాగాంధీ, రాజీవ్‌గాంధీలతో కలిసి పని చేశారు. రైతు, రైతు కూలీల సమస్యలపై సుదీర్ఘ కాలం పోరాటం చేశారు. శ్రీకాకుళం నుంచి మద్రాసు వరకు పాదయాత్ర నిర్వహించిన మహానేత ఆయన. కాంగ్రెస్ పార్టీకి దీటుగా స్వతంత్ర పార్టీని, కృషికార్ లోక్‌పార్టీని నడిపారు. వ్యవసాయ రంగంపై ఐక్యరాజ్య సమితిలో ప్రసంగించిన మహానేత ఎన్‌జీ. రంగా.

నిడుబ్రోలుకు చెందిన మరో రాజకీయ ఉద్దండుడు దివంగత పాములపాటి అంకినీడు ప్రసాద్. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల్లో మంత్రిగా పని చేశారు. 1967లో పొన్నూరు నియోజకవర్గం నుంచి ఎమ్మెల్యేగా ఎన్నికై వాణిజ్యశాఖ మంత్రిగా పని చేశారు. అనంతరం ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఒంగోలు లోక్‌సభ నుంచి 1971లోను, బాపట్ల నుంచి 1977, 1980లో ఎంపీగా వరుస విజయాలు సాధించారు. పౌర విమానయాన శాఖ మంత్రిగా పని చేశారు. ఈయన తన రాజకీయ ప్రస్తానాన్ని సమితి అధ్యక్షుడిగా మొదలుపెట్టారు. 1978లో ఎన్‌జీ.రంగా దత్తపుత్రుడు గోగినేని నాగేశ్వరరావు పొన్నూరు నియోజకవర్గ ఎమ్మెల్యేగా ఎన్నికై దేవాదాయశాఖ మంత్రిగా పని చేశారు.

పొన్నూరు ప్రాంతానికే చెందిన చేనేత ఉద్యమ నేత ప్రగడ కోటయ్య ఉమ్మడి మద్రాసు రాష్ట్ర ప్రభుత్వంలోనూ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలోనూ రెండు దశాబ్దాల పాటు శాసన సభ్యుడిగా, శాసనమండలి సభ్యుడిగా పని చేశారు. అనంతరం రాజ్యసభ సభ్యుడిగా ఎన్నికయ్యారు. తెలుగుదేశం పార్టీ ఆవిర్భావం తరువాత 1983, 1985 ఎన్నికల్లో చింతలపూడికి చెందిన ధూళిపాళ్ళ వీరయ్య చౌదరి రెండుసార్లు శాసన సభ్యుడిగా ఎన్నికయ్యారు. రెవెన్యూ మంత్రిగా పని చేశారు. సంగం డెయిరీ చైర్మన్‌గా రెండుసార్లు పని చేశారు. క్షీర విప్లవ సారథిగా జిల్లాలో పాడి పరిశ్రమ అభివృద్ధి కోసం, రైతాంగ సమస్యల పరిష్కారానికి కృషి చేశారు.

తెలుగుదేశం పార్టీ ఆవిర్భావం తరువాత పొన్నూరు నియోజకవర్గంలో కాంగ్రెస్ శాసనసభ్యుడిగా పనిచేసిన ఏకైక నాయకుడు దివంగత చిట్టినేని వెంకట్రావు. ఈయనది నిడుబ్రోలు. పట్టణంలో ప్రముఖ వైద్యుడిగా గుర్తింపుపొందారు. సమితి అధ్యక్షుడిగా, మున్సిపల్ చైర్మన్‌గా పనిచేసిన డాక్టర్ టీ వెంకయ్య 1989లో తాడికొండ ఎమ్మెల్యేగా ఎన్నికయ్యారు. దివంగత ధూళిపాళ్ళ వీరయ్య చౌదరి మరణానంతరం ఆయన రాజకీయ వారసుడిగా నరేంద్ర రంగ ప్రవేశం చేశారు. నియోజకవర్గం నుంచి వరుసగా నాలుగు సార్లు ఎమ్మెల్యేగా గెలుపొందారు. ఇటీవల ఆయన సంగం డెయిరీ చైర్మన్‌గా కూడా ఎన్నికయ్యారు. వీరితో పాటు దివంగత ఎన్‌జీ.రంగా సతీమణి గోగినేని భారతీదేవి ఎమ్మెల్సీగా పనిచేసి రైతు ఉద్యమాలలో క్రియాశీల పాత్ర పోషించారు.

ఒక్క రాజకీయ రంగమే కాకుండా కవులు, సాహితీ వేత్తలు, స్వాతంత్ర్య వీరులు, చేనేత ఉద్యమ నేతలకు పొన్నూరు నిలయంగా మారింది. ఆయా రంగాల్లో నిష్ణాతులైన వారణాసి సుబ్బయ్య, పినపాల నాగభూషణం, చల్లా పిచ్చయ్య శాస్త్రి, సుప్రసిద్ధ సినీ నటుడు సీఎస్‌ఆర్, సాహితీవేత్తలు, తుమ్మల సీతారామమూర్తి చౌదరి, ఏటుకూరి నర్సయ్య, కొండవీటి వెంకట కవి, రాయప్రోలు లింగన సోమయాజులు, కాశీ కృష్ణాచార్యులు, కొడాలి లక్ష్మీ నారాయణ తదితరులు ఈ ప్రాంతం వారే. మండల పరిధిలోని వెల్లలూరుకు చెందిన అంబటి లక్ష్మణరావు అలహాబాద్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా పనిచేసి కీర్తి నార్జించారు. దొప్పలపూడికి చెందిన వట్టికూటి వెంకట సుబ్బయ్య (సరిహద్దు గాంధీ) పారిశుధ్యంపై ప్రజలను చైతన్యపరిచారు. గాంధీ మార్గంలో పయనించి ఈ ప్రాంతానికే వన్నె తెచ్చారు..


ఎన్‌జీ. రంగాకు ఉత్తమ పార్లమెంటేరియన్ అవార్డు అందిస్తున్న ఇందిరా గాంధీ

### మొదటి రాజకీయ పాఠశాల ఏర్పాటు

దేశంలోనే మొట్టమొదటి రాజకీయ పాఠశాలను 1933లో రామానీడు రాజకీయ పాఠశాలగా ఎన్‌జీ. రంగా స్థాపించారు. అదే ఏడాది డిసెంబర్ 3న గాంధీజీ స్వయంగా ఈ పాఠశాలను సందర్శించారు. ప్రధానిగా పని చేసిన ఇందిరాగాంధీ కూడా 1981లో ఈ పాఠశాలకు విచ్చేసారు. ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి రోశయ్య ఎన్‌జీ. రంగా ప్రియశిష్యుడు.

# తగ్గుతున్న తమలపాకు తోటల సాగు విస్తీర్ణం

## తాడేపల్లిగూడెంకు పరిశోధనా స్థానం తరలింపు

## అయోమయంలో రైతులు




చింతలపూడిలో ఏర్పాటు చేసిన అఖిల భారత తమలపాకు తోటల పరిశోధనా స్థానం



పలు రకాల తమలపాకు తోటలు

(ఆన్‌లైన్ - పొన్నూరు)

తమలపాకు తోటల పరిశోధనకు సరిపడా స్థలం, అనుకూల వాతావరణం లేదనే సాకుతో చింతలపూడి పరిశోధనా స్థానాన్ని తాడేపల్లిగూడెంకు తరలించారు. 1977లో తుపాను సంభవించి తమలపాకు తోటల్లో వైరస్ తెగులు సోకటంతో ఉద్యాన పరిశోధన స్థానం ఆధ్వర్యంలో చింతలపూడిలో అఖిల భారత తమలపాకు తోటల పరిశోధన పథకాన్ని ఏర్పాటు చేశారు. మూడు దశాబ్దాల క్రితం చింతలపూడిలో రాష్ట్ర ప్రభుత్వ ఉద్యాన పరిశోధనా స్థానం ఆధ్వర్యంలో అఖిల భారత సమన్వయ మందు మొక్కలు, తమలపాకుల పరిశోధనా స్థానం ఏర్పాటు చేశారు. గుంటూరు పరిసర ప్రాంతాలలో తమలపాకు తోటలు సాగు చేస్తున్న రైతులకు సాగులో సూచనలు, సలహాలు ఇవ్వటానికి ఏర్పాటు చేశారు. 30 ఏళ్ల క్రితం చింతలపూడిలో ఏర్పాటు చేసిన కార్యాలయాన్ని తొమ్మిదేళ్ల కిందట బాపట్లకు తరలించారు. జిల్లా పరిధిలో తమలపాకు తోటలను సందర్శించి సాగు చేస్తున్న రైతులకు యాజమాన్యం, చీడపీడలు, తెగుళ్ళ నివారణ చర్యలు గురించి ఉద్యాన శాస్త్రవేత్తలు పలు సూచనలు చేసేవారు. ఎకరా తమలపాకు తోట సాగుకు రూ.లక్ష వరకు ఖర్చువుతోంది. వాతావరణం అనుకూలించి వరదలు రాకుండా, చీడపీడలు సోకకుండా ఉంటే రైతులు నష్టాల నుంచి బయటపడతారు. ప్రకృతి కన్నెర్ర చేస్తే చేతికి పైసా కూడా రాదు. ఆరుగాలం కష్టించి స్వేదం చిందించి పండించిన పంట బూడిదలో పోసిన పన్నీరుగానే మిగులుతుంది.

### చింతలపూడికి జాతీయ స్థాయి గుర్తింపు

గుంటూరు జిల్లా చింతలపూడి పరిసర గ్రామాల తమలపాకులు దేశ ంలోని పలు ప్రాంతాలకు ఎగుమ తవుతున్నాయి. మహారాష్ట్రలోని అకో లా, అమరావతి, నాందేడ్, పరిమిణి, ఔరంగాబాద్, జాల్నా, అకోట్ వంటి ప్రాంతాలకు లారీలలో తమలపాకులు రవాణా చేస్తుంటారు. చింతలపూడిలో తమలపాకు కంపెనీలు 20 పైగా ఉన్నాయి. సీజనులో చింతలపూడి నుంచి ప్రతిరోజూ 15 లారీల లోడు ఇతర రాష్ట్రా లకు ఎగుమతవుతూ ఉంటుంది. మా ర్కెట్ మాంద్యం ఏర్పడినపుడు మూడు లారీల లోడు ఎగుమతి చేస్తుంటారు.

### ఉపాధి కోల్పోతున్న కార్మికులు

చింతలపూడి తమలపాకు తోటల పరిశోధన స్థానం వేరొక ప్రాంతానికి తరలిపోవటంతో తమలపాకు తోటల సాగు విస్తీర్ణం సగానికిపైగా పడిపోయింది. గత ఏడాది వెయ్యి ఎకరాల్లో తమలపాకు తోటలు సాగు చేయగా, ఈ ఏడాది సీజనులో 500 ఎకరాలు మాత్రమే సాగు చేస్తున్నారు. కడప, కర్నూలు, చెన్నూరు, పశ్చిమగోదావరి జిల్లాల నుంచి వచ్చిన కార్మికులు చింతలపూడిలో స్థిరపడ్డారు. తమలపాకు తోటల్లో ఏడాదిలో పదినెలల పాటు పనిచేసి జీవనోపాధి పొందుతున్నారు. పరిశోధనా స్థానంలో మరికొందరు క్యాజువల్ లేబరుగా పని చేసుకొని జీవనం సాగిస్తున్నారు. క్రమేపి తమలపాకు తోటల సాగు తగ్గిపోవడంతో ప్రత్యామ్నాయ పంటల సాగుపై దృష్టి కేంద్రీకరిస్తున్నారు.

### తమలపాకు తోటల్లో పరిశోధనలు

చింతలపూడి తమలపాకు తోటల పరిశోధనా స్థానంలో 60 రకాల తమలపాకు, మందు మొక్కలు సాగవుతున్నా యి. బంగ్లా, మిఠా, కలకత్తా, గచ్చిపాన్, యుపిపాన్, రామ్‌టిక్ బంగ్లా, గోడి బంగ్లా, టికెరాపాన్ రకాల తమలపాకు తోటలు సాగవుతున్నాయి. తమలపాకు తోటల రైతులను తీగకుళ్ళు తెగులు నడ్డి విరగ్గొడుతుంది. ఈ తెగులు వల్ల తమలపాకు తోటలు ఎండిపోయి ఆకులు పండిపోతాయి. తెగులు నివారణకు ఇప్పటివరకు తగిన క్రిమి సంహారక మందులను ఉద్యాన శాస్త్రవేత్తలు కనుగొన లేకపోవడంతో రైతులు నష్టాల పాలవుతున్నారు. చింతలపూడి పరిసర ప్రాంత వాతావరణానికి అనుకూలమైన పాపడ, కవట (కళ్ళి) రకాల తమలపాకు తోటలు సాగు చేస్తున్నారు. తమలపాకు తోటల రైతులకు సేవలందిస్తున్న చింతలపూడిలో ఏర్పాటు చేసిన అఖిల భారత సమన్వయ మందు మొక్కలు, తమలపాకు పరిశోధనా పథకాన్ని తిరిగి నెలకొల్పటానికి స్థానిక ప్రజాప్రతినిధులు కృషి చేయాలని రైతులు కోరుతున్నారు.



### పరిశోధన స్థానం కొనసాగించాలి

తమలపాకు తోటల రైతులకు సేవలందిస్తున్న అఖిల భారత తమలపాకు తోటల పరిశోధన స్థానాన్ని చింతలపూడిలో కొనసాగించాలి. ఈ విషయంపై సంబంధిత ఉద్యాన పరిశోధనా స్థానం ఉన్నతాధికారులు, ముఖ్యమంత్రితో మాట్లాడుతాను.

- ఎమ్మెల్యే నరేంద్ర



### వాతావరణం పైనే ఆధారం

తమలపాకు తోటలు పూర్తిగా వాతావరణం పైనే అధారపడి సాగు చేసుకోవాల్సి వస్తుంది. ఇతర రాష్ట్రాల నుంచి వస్తున్న పాన్‌పరాగ్, గుట్కాల అమ్మకాలు పెరగటంతో తమలపాకులకు గిరాకీ తగ్గింది.

- రైతు రావిపాటి వెంకట సురేష్



### కౌలు, కూలి రేట్లు పెరిగాయి

తమలపాకు తోట పొలానికి కౌలు రూ.25 వేల నుంచి రూ.30 వేల వరకు పెరిగింది. దీంతో ఏమి చేయాలో అర్థం కావడంలేదు. కౌలు రైతులను ప్రభుత్వమే ఆదుకోవాలి.

కౌలురైతు నాగం సూకరాజు

## పచ్చని పంట పొలాలకు

# 'సిమెంట్ గత్తర'!

**సాగు భూములన్నీ బడాబాబుల ల్యాండ్ బ్యాంకులు**

**అంబుజా నుంచి సరస్వతి వరకు అదే కథ**

**సహజ నిక్షేపాలు బలవంతుల పాలు**

(ఆన్‌లైన్, పిడుగురాళ్ల)

సజ్జజొన్న కూళ్లు ... సర్పంబులను తేళ్లు... నాగులేటి నీళ్లు ... నాపరాళ్లు... ఇదీ పల్నాడుపై ఒకప్పుడు కవి సార్వ భౌముని (శ్రీనాధుడు) అభిప్రాయం. వాస్తవమే. నీళ్లు లేక ఎప్పుడో పండక్కో... పబ్బానికో... వరన్నం దొరికితే దాన్ని 'సామిబువ్వ'గా సంబోధించే పరిస్థితి ఆనాటి ది. ఇప్పుడు ... తలవాకిటనే నాగార్జునసాగరం . కృష్ణమ్మ తో కళకళ లాడే కాలువలు. బోర్లు, బావులు. పచ్చని పంట పొలాలు. 'వాణిజ్యం' తాలుకు ఆనవాళ్లు. కోస్తాలో ఇప్పుడిప్పుడే సిరుల మాగాణి అవుతున్న పల్నాడుకు ముప్పు పొంచి వుంది. భూస్వామ్య పోకడలపై పోరు జరిగిన ఇక్కడ జమిందారీ జాడ కనిపిస్తూ వుంది. పల్నాటి భూమాత కడుపున దాగిన సహజ నిక్షేప సంపద శాపమై పచ్చని పంట పొలాలకు గత్తర తెచ్చే ప్రమాదం అగుపిస్తుంది.

### బడాబాబుల కన్ను పల్నాడువైపుకే ...

రాష్ట్రంలో సిమెంట్ ఫ్యాక్టరీ పెట్టాలన్న ఆలోచన రావ టంతోనే బడాబాబుల కన్ను పల్నాడుపై పడుతుంది. కారణం ఇక్కడ టన్నుల కొద్ది సున్నపురాయి నిక్షేపాలు వుండటమే. ఇదే ప్రస్తుతం పల్నాడుకు శాపంగా పరిణ మించింది. గతంలోనే సిమెంట్ ఫ్యాక్టరీలను ఏర్పాటుచేసి న ఆంధ్రాసిమెంట్స్, ఇండియా సిమెంట్స్ తదితర యాజ మాన్యాలు కోట్ల కొద్ది లాభాలు గడించటం కూడా పలువు రి చూపు పల్నాడుపై పడేందుకు కారణమని చెప్పవచ్చు. ఆ విధంగా పరిశ్రమ స్థాపన పేరుతో పల్నాడుకు వస్తున్న బడాబాబులు 'కొందరు' వేలకొలది ఎకరాల ప్రభుత్వ భూమిని లీజు పేరుతో చేజిక్కించుకోవటం జరిగింది.

### ఒక్కొక్కరి చేతిలో వేల ఎకరాలు...

పల్నాడును కేంద్రంగా చేసుకొని సున్నపురాయి నిక్షే పాలను వెలికితీసేందుకు పలు యాజమాన్యాలు వేల ఎక రాల్లో మైనింగ్ లీజు పొందటం జరిగింది. కెసిపి సిమెంట్స్ మొత్తం 246.07 ఎకరాలు లీజు పొందగా, అందులో 35.03 ఎకరాలు భూమి ప్రభుత్వానిది. ఆంధ్రాసిమెంట్స్ మొత్తం 1054.63 ఎకరాలకు లీజు పొందగా, అందులో 807.068 ఎకరాల భూమి ప్రభుత్వానిది. శ్రీ చక్ర సిమెంట్స్ మొత్తం 500 ఎకరాల దేవాదాయ భూమికి మైనింగ్ లీజు పొందింది. సంఘీ సిమెంట్స్ 4950.38 ఎకరాల భూమికి లీజు పొం దగా, అందులో 1401.44 ఎకరాల భూమి ప్రభుత్వానిది. అంబు జా సిమెంట్స్ 2351.40 ఎకరాల భూమి లీజు పొందగా, అందులో 749.28 ఎకరాల భూమి ప్రభుత్వానిది. పరాశక్తి సిమెంట్స్ 785.23 ఎకరాల భూమికి లీజు పొందగా, 464.55 ఎకరాల భూమి ప్రభు త్వానిది. సరస్వతి సిమెంట్స్ 1515.90 ఎకరాల భూమికి లీజు పొం దగా, 24.78 ఎకరాల భూమి ప్రభుత్వానిది. భవ్య సిమెం ట్స్ 997.07 ఎకరాల భూమికి లీజు పొందగా, అందులో 49.61 ఎక రాల భూమి ప్రభుత్వానిది.

### లీజు తీసుకుంటారు... పత్తా లేకుండాపోతారు !

ఇక్కడ ప్రధానంగా చెప్పుకోవలసింది సిమెంట్ ఫ్యాక్టరీల పేరుతో పల్నాడులోని వేల ఎకరాల భూములను చెరపడుతున్న యాజమాన్యాలు లీజు ప్రక్రియ పూర్తయిన తర్వాత పత్తా లేకుండా పోతున్నదాని గురించి. ఉదాహరణకు సంఘీ సిమెంట్స్‌ను పరిశీ లిస్తే 2007లో గురజాల మండలంలోని గొట్టిముక్కల ప్రాంతంలో ప్రభుత్వం మైనింగ్ లీజు ఇవ్వటం జరిగింది. అయినా యాజమాన్యం ఇంతవరకు పలుగుపెట్టి తట్టెడు రాయి తీసిన దాఖలాలు లేవు. భూములు మాత్రం వారికిందకి వచ్చేశాయి. అంబుజా సిమెంట్స్ కూడా అదే కోవకు వస్తుంది. గురజాల మండలంలోని బూదవాడ, దాచేపల్లి మండలంలోని నడికూడి గ్రామాల పరిధిలోని సాగుభూ మిని స్వాధీనం చేసుకున్న యాజమాన్యం ఆ భూములను బీడు భూ ములుగా మార్చింది. ఫ్యాక్టరీ నిర్మాణాలపై కాకమ్మ కబుర్లు చెబుతూ కాలం వెలిబుచ్చుతుండటం విమర్శలకు తావిస్తుంది.

### లీజుతోనే గలీజు..!

దివంగత ముఖ్యమంత్రి వై ఎస్ రాజశేఖరరెడ్డి తనయుడు జగ న్మోహనరెడ్డి స్థాపించనున్న సరస్వతి పవర్ పరిశ్రమ ఉదంతాన్ని పరి శీలిస్తే ... యాజమాన్యం లీజు పొందిన భూమిలో ఎక్కువభాగం ప్రైవేటు వ్యక్తులకు చెందినదే. అందుకోసం వారికి నష్టపరిహారం కూడా చెల్లించారు. అయితే వందలాది ఎకరాల భూమిలో దాగివున్న సహజ నిక్షేపాలను వెలికితీసేందుకు లీజు అప్పనంగా కట్టబెట్టటమే వివాదాస్పదమవుతుంది. కొందరి చేతుల్లోకే సహజ నిక్షేపాల సంపద వెళుతుండటం అందుకు ప్రభుత్వాలు శక్తివంచన లేకుండా సహకరి స్తుండటం ఆరోపణలకు తావిస్తున్నది. ఇదే పరిస్థితి కొనసాగితే మున్ముందు పల్నాడులోనూ పలువురు 'గాలి జనార్ధన్'లు కనిపించక మానరు.



తంగెడలో నిర్మాణం జరుగుతున్న భవ్యా సిమెంట్స్

### పచ్చని పొలం కనిపించదు...

ఇప్పుడున్న పరిస్థితే మరికొద్దిరోజులు కొనసాగితే పల్నాడులో కొద్దిరోజుల తర్వాత బహుశా పచ్చని సాగుభూములు పూర్తిగా మాయం కావచ్చు. సిమెంట్ ఫ్యాక్టరీల పేరుతో సాగుతున్న ఈ తంతులో ఇప్పటికే వేలాది ఎకరాల సాగుభూమి బీడు భూమిగా మారింది. ఫ్యాక్టరీలు నిర్మిస్తే పిల్లలకు ఉద్యోగ, ఉపాధి అవకాశాలు కలుగుతాయన్న ఆశతో సన్నాచిన్నకారు రైతులు భూములు ఇచ్చేం దుకు ముందుకు వస్తున్నారు. తీరా భూములు తీసుకున్న తర్వాత యాజమాన్యాలు మొండి చేయి చూపటంతో అప్పటిరైతులు ఇప్పుడు రైతుకూలీలుగా మారిపోయారు. ఇప్పటికైనా ప్రభుత్వం కన్నుతెరిచి అడ్డగోలు లీజులకు చెక్ పెడితే తప్ప పల్నాడు పంట భూమి బతికిబట్టకట్టే దారిలేదు.

## స్వయంభువుగా వెలసిన

# శ్రీమద్వీరాంజనేయస్వామి

**(ఆన్‌లైన్ - తాడేపల్లి)**

తాడేపల్లి మండల పరిధిలోని జిల్లా ముఖద్వారమైన కృష్ణా నదీ తీరంలో వందేళ్ళ చరిత్ర గల పుణ్యక్షేత్రం సీతానగరం ఆలయాలతో నిండియుండి భక్తులను పారవశ్యంతో ముంచుతుంది. ఇక్కడ గల శ్రీమద్వీరాంజనేయ స్వామి స్వయంభువుగా వెలిశారని పురాణాలు చెప్తున్నాయి.


శ్రీమద్వీరాంజనేయ స్వామి

సీతానగరంలోని ప్రసిద్ధి చెందిన ఆలయాల్లో ఇది ముఖ్యమైన ఆలయం. సుమారు వంద సంవత్సరాల క్రితం నిర్మించిన ఆలయం ఇది. ఈ ఆలయం కట్టించిన వారు తమ్మన అంకమ్మ శ్రేష్ఠి. చాలా విచిత్రమైన పద్ధతిలో ఈ ఆలయం ఏర్పడింది. అంకమ్మ శ్రేష్ఠి, ఆయన తల్లి కుటుంబం గడవక విజయవాడ వచ్చి(స్వగ్రామం ప్రకాశం జిల్లా) ఒక షావుకారు ఇంట్లో వంట చేయడానికి కుదిరారు. శ్రేష్ఠి తల్లి కొడుకును గుగ్గిళ్లు అమ్ముకురమ్మని చెప్పగా విజయవాడ నుండి రైల్వే బ్రిడ్జి ద్వారా బయలు దేరిన శ్రేష్ఠి అలసిపోయి సీతానగరం వైపు వచ్చి ఒక చెట్టు క్రింద నిద్రించారట. నిద్రలో ఎవరో పిలిచినట్లుగా వుంటే లేచి చూడగా ఆయనకు శ్రీమద్వీరాంజనేయ స్వామి దర్శనమిచ్చి ఈ ప్రాంతానికి వచ్చేందుకు భక్తులకు రహదారి ఏర్పాటు చేయమని కోరారట. అప్పట్లో ఈ ప్రాంతమంతా అడవి వలె ఉండేది. శ్రేష్ఠి వెంటనే విజయవాడ వెళ్లి తన తల్లిని తీసుకువచ్చి జరిగిన విషయం చెప్పగా అక్కడ వీరాంజనేయుని విగ్రహం దేదీప్యమానంగా వెలుగుతూ కనిపించిందట. ఈ విషయం తెలుసుకున్న షావుకారు ఆ మార్గమంతా శుభ్రపరచి, రహదారి మార్గం ఏర్పాటు చేయించారు. అలా 1911లో ఈ ఆలయం ఏర్పడింది. 1913లో ముఖమండపం ఏర్పాటైంది. భక్తులు ఇక్కడ వున్న ఆంజనేయుని ఉగ్రరూపం చూసి తట్టుకోలేకపోయేవారట. ఎవరైనా తప్పులు చేసి ఈ ఆలయానికి వస్తే వారి దుస్తులు కాలడమో, అనర్థాలు జరుగటమో సంభవించేవట.

అప్పటి పెద్దల్ని కొందరు ఈ విషయమై సంప్రదించగా కోదండరాముణ్ని ప్రతిష్ఠిస్తే ఆంజనేయస్వామి శాంతిస్తాడని చెప్పారట. దీనితో 1919లో ఇక్కడ కోదండ రామాలయం ఏర్పడింది. అప్పటి నుంచి 1946 వరకు ఆలయ బాధ్యతలు శ్రేష్ఠిగారే నిర్వహించేవారు. ఆయన స్వర్గస్తులైన అనంతరం ఆయన భార్య వెంకటసుబ్బమ్మ 1954 వరకు ఆలయ బాధ్యతలు చూశారు. వీరికి సంతానం లేకపోవడంతో వారి గోత్రీకులైన తమ్మన వీర హనుమంతు కోటేశ్వరరావును దత్తత చేసుకోగా ఆలయ బాధ్యతలు ఆయన అనువంశిక ధర్మకర్తగా నిర్వహిస్తున్నారు. 1965లో దేవాదాయ, ధర్మాదాయ శాఖకు ఈ ఆలయ బాధ్యతలు అప్పగించారు. ప్రస్తుతం విజయవాడ కనకదుర్గమ్మ దేవస్థానం ఈ ఆలయాన్ని దత్తత తీసుకుని, అభివృద్ధి చేస్తుంది.

***సీతానగరంకు ఆ పేరు ఎలా వచ్చిందంటే...***

శ్రీరామ చంద్రమూర్తి ఆజ్ఞమేరకు ఆంజనేయ స్వామి వారు సీతాన్వేషణకై లంకకు వెళ్లి లంక అంతా చూసి అశోక వృక్షం క్రింద వున్న సీతమ్మ వారిని దర్శించి తిరిగి వస్తూ అలసిపోయి ఇక్కడ ఆగారని ప్రతీతి. సీతమ్మవారిని వెతకటానికి స్వామివారు ఇక్కడకు వచ్చారు కావున ఈ ప్రాంతానికి సీతానగరం అనే పేరు వచ్చిందని పెద్దలు చెబుతారు. ఈ సీతానగరం ఒకప్పుడు పండితులతో శోభిల్లే అగ్రహారం.

# భువిపై తొలి వైష్ణవ క్షేత్రం 'మంగళాద్రి'

యుగయుగాల దేవుడు - శ్రీ గండాలరాయుడు



మంగళగిరి క్షేత్రం చాలా ప్రాచీనమైంది. కలియుగ దేవుడు శ్రీ వెంకటేశ్వరస్వామి అయితే సృష్టి ఆరంభంలోనే వెలసిన దేవుడు మంగళాద్రి శ్రీ పానకాల లక్ష్మీ నృసింహ స్వామి. యుగాలలో కెల్ల తొలియుగం కృత యుగమని మన పురాణగాధలు చెబుతున్నాయి. అటువంటి కృతయుగారంభంలోనే మంగళగిరి కొండపై శ్రీ నృసింహస్వామివారు అవతరించి యున్నారని వేదవ్యాస ప్రణీతమైన బ్రహ్మ వైవర్త పురాణం చెబుతోంది. భవానీ శంకరగీతలో సైతం మంగళగిరి క్షేత్ర మహత్మ్యాన్ని గురించి శ్రీ పరమశివుడు తాను స్వయంగా శ్రీ పార్వతీదేవికి వివరించినట్టు ప్రతీతి. సృష్టి ఆదిలోనే భూలోకంపై పరంధాముడు స్వయం వ్యక్తమై వెలిసిన తొలి పుణ్య క్షేత్రం మంగళాద్రి యేనని భావించాల్సి వుంటుంది. మంగళాద్రి క్షేత్రంలో కొండపై శ్రీ పానకాల నృసింహస్వామి కృతయుగంలో అవతరించి వుండగా, దిగువ సన్నిధిలో శ్రీ లక్ష్మీ నృసింహస్వామివారి విగ్రహాన్ని ద్వాపర యుగంలో పాండవులు తమ అరణ్యవాసకాలంలో ధర్మరాజుచేత ఇక్కడ ప్రతిష్ఠింపజేశారని పురాణ ఇతిహాసాలను బట్టి తెలుస్తుంది.

వి. బ్రహ్మనాయుడు, మంగళగిరి

మంగళగిరి కొండపై పూర్వం కృతాయుగారంభంలో నముచి అనే రాక్షసుణ్ణి సం హరించి శ్రీ స్వామివారు ఇక్కడే ఉగ్ర రూపాన వెలిసియున్నారన్నది స్థల పురాణం. నముచి సంహారం అనంతరం శ్రీస్వామి వారు మహోగ్రరూపంతో ఉచ్ఛ్వాస, నిశ్వాసాలను విడుస్తుండడంతో ఆధాటికి ఎదురుగా వున్న మంగళగిరి ప్రాంతం కాలిపోయిందని పురాణ ఇతిహాసం. అంతట దేవతలు, శ్రీ మహాలక్ష్మి శ్రీస్వామి వారిని శాంతించాలని కోరుతూ స్తోత్రం చేయగా శ్రీస్వామి వారిని అనుగ్రహించి తాను ఇక్కడే వెలిసియుందునని, తనకు కృతయుగంలో అమృతాన్ని, త్రేతాయుగంలో గోక్షీరాన్ని, ద్వాపరయుగంలో ఆవు నెయ్యిని, కలియుగంలో బెల్లం పానకాన్ని నివేదనగా సమర్పించాలని శ్రీస్వామి సెలవిచ్చినట్టు చెబుతారు. ఇప్పటికి ఈ క్షేత్రంలో ఉదయకాలం వరకే మానవార్చన జరుగుతోంది. సాయంకాలం నుంచి దేవతలు శ్రీస్వామివారిని అర్చించేందుకు వస్తారనే విశ్వాసంతో సాయంకాలం నుంచి ఆలయాన్ని మూసివేస్తారు.

## ఘాట్ రోడ్డుతో అభివృద్ధి

ప్రాచీనమైన ఈ ఆలయానికి ఆరేళ్ల నుంచే భక్తుల సంఖ్య గణనీయంగా పెరిగింది. లోగడ కేవలం మెట్ల మార్గం మాత్రమే వున్న ఎగువ సన్నిధికి వెళ్ళే వారు ఘాట్ రోడ్డును నిర్మించడంతో సౌకర్యవంతంగా వుండి భక్తుల రద్దీ పెరిగింది. ఆలయ విశిష్టతను బట్టి కాక సౌకర్యాలను బట్టే భక్తుల ఆదరణ పెరుగుతుందనడానికి మంగళగిరి క్షేత్రమే ఒక ప్రత్యక్ష నిదర్శనమని చెప్పవచ్చు.

## శ్రీ స్వామి వారి లీలామృతం

శ్రీ పానకాల స్వామికి నివేదనగా సమర్పించే బెల్లం పానకాన్ని స్వామి ఆలయ ముఖమండపంలోనే తయారు చేయాలి. ఈ తయారీలో ఎంత పానకం కింద ఒలికినా..చీమలు చేరవు..ఈగలు వాలవు. తీపి వున్న చోట చీమలు, ఈగలు చేరడం సృష్టిలో సర్వ సాధారణం. కానీ ఈ సృష్టి ధర్మానికి విరుద్ధంగా జరిగే ఈ వింతను భక్తులు స్వయంగా వీక్షించి తన్మయులు కావల్సిందే. అలాగే భక్తులు తమ మొక్కుబడి కింద శ్రీస్వామి వారికి సమర్పించే పానకంలో సగాన్ని మాత్రమే శ్రీస్వామి స్వీకరిస్తారు..మిగతా మొత్తాన్ని తన ప్రసాదంగా కక్కివేస్తారు. ఇదొక అద్భుతమైన స్వామి వారి లీలగా చెప్పుకుంటారు.

## అభివృద్ధి బాటలో..

మంగళగిరి క్షేత్రం ఇప్పుడిప్పుడే అభివృద్ధి బాట పట్టింది. ఎగువ సన్నిధిలో శ్రీ పానకాల రాయుడి కొండపై సుమారు 45 లక్షల రూపాయల వ్యయంతో ముఖ మండప నిర్మాణాన్ని చేపట్టారు. అలాగే పైన పార్కింగ్ స్థలాన్ని మరింత విస్తరిస్తున్నారు. మంగళగిరి పర్వత శిఖరంపై వేంచేసియున్న శ్రీ గండాలరాయుని సన్నిధికి సుమారు 40 లక్షల రూపాయల వ్యయంతో మెట్ల మార్గాన్ని నిర్మిస్తున్నారు. దిగువ సన్నిధిలో ఆలయ ప్రాకారంలో చింతామణి రాయితో ఫ్లోరింగ్ పనులను జరిపించనున్నారు. రథశాల వెనుక పది కాటేజీల సత్రాన్ని నిర్మించారు. దానిపైన ప్రత్యేకంగా గెస్ట్‌హౌస్‌ను కూడా ఏర్పాటు చేశారు. ఘాట్ రోడ్డు మార్గం వెంబడి ఓ దాత అందించిన సహకారంతో సుమారు రూ 35 లక్షల వ్యయంతో శ్రీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆలయాన్ని నిర్మించారు. ఘాట్‌రోడ్డు మార్గాన్ని మరింత సుందరంగా తీర్చిదిద్దేందుకు ప్రణాళికలను రూపొందిస్తున్నారు. 200 సంవత్సరాల క్రితం నిర్మించిన దిగువ సన్నిధి తూర్పు రాజగోపురం శిధిలావస్థకు చేరిందన్న ఇంజనీరింగ్ నిపుణుల సలహా మేరకు రూ 11 కోట్ల వ్యయంతో దానిని పునర్నిర్మించేందుకు ప్రభుత్వం సన్నద్ధమవుతుంది. అలాగే పశ్చిమ గోపురాన్ని సుమారు రూ 5 కోట్ల వ్యయంతో నిర్మించనున్నారు.



శ్రీ లక్ష్మీ నృసింహస్వామి వారు



ఘాట్ రోడ్డు



శ్రీ పానకాల నృసింహస్వామి





కొండపైన శ్రీ రాజ్యలక్ష్మీ అమ్మవారు

## ప్రకృతి సోయగాల సమాహారం

# ఎత్తిపోతల జలపాతం

**(ఆన్‌లైన్, మాచర్ల రూరల్)**

సృష్టిలోని ప్రకృతి సోయగాలను, పచ్చదనాలను అణువణువునా నింపుకొని చూపరులకు నయనానందం కలిగించే అపురూప సోయగాల దృశ్యకావ్యం ఎత్తిపోతల జలపాతం. ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన నాగార్జునసాగర్ కేవలం 13 కిలోమీటర్ల దూరంలో వుండి గుంటూరు జిల్లా మాచర్లకు చేరువలో వున్న ఈ ప్రాంతం ప్రకృతి ఆరాధికులకు ఓ వరం. నల్లమల అడవుల్లో నుండి అంతర్వాహినిగా చంద్రవంక నదీ పడమర నుండి ఉత్తరానికి ప్రవహిస్తూ మరో రెండు నదులను కలుపుకుంటూ అంతర్వాహినియై 70 అడుగుల ఎత్తు నుండి ఈ జలపాతం లోయలోకి ఎగిసి దూకుతూ చూపరులకు కనువిందుజేస్తోంది. విశాలమైన లోయగుండా రెండువైపులా ఏపుగా వున్న కొండలను, మొగిలిపొదలను పలకరించుకుంటూ ఉత్తర్వాహిణిగా ప్రవహిస్తూ 4కిలోమీటర్లు ప్రయాణం చేసి 'గంగ పాదాలు' అనే చోట కృష్ణా నదిలో కలుస్తోంది. ఎత్తిపోతల జలపాతం వద్ద వన్యప్రాణి సంరక్షణలో భాగంగా అటవీశాఖ విభాగం వారు 1978 ప్రాంతంలో మొసళ్ళ కేంద్రంగా అభివృద్ధిచేయాలన్న తలంపుతో ఎనిమిది రకాల మొసళ్ళను ఇక్కడ వదలడం జరిగింది. ఇవి సంతానోత్పత్తి బాగా జరిగి ఇప్పుడు దాదాపు 100 నుండి 150 వరకు ఉండవచ్చునని అంచనా. ఈ ప్రాంతంలో జింకలు, వన్యప్రాణుల పార్క్‌లు ఏర్పాటు చేసి ఒక మ్యూజియంను నెలకొల్పితే బావుంటుందనే తలంపు ఇక్కడకు విచ్చేసే పర్యాటకులు వ్యక్తం చేస్తుంటారు. పూర్వకాలంలో యతులు(ఋషులు) తపస్సు ఆచరించిన ప్రాంతం కనుక నాటి యతి తపోతలనే నేటి 'ఎత్తిపోతల'గా వాడుకలో ఉంది. ఇక్కడికి విచ్చేసే ప్రకృతి ప్రియులకు అందచందాలతో పాటు ఆధ్యాత్మిక చింతన కూడా అలవడుతుంది. ఈ కొండలపై వెలసిన దత్తాత్రేయ స్వామివారి ఆలయం, ఇంకొంచెం దూరంలోని మధుమతి ఆలయాలు పర్యాటకులను, భక్తులను విశేషంగా ఆకర్షిస్తాయి. ప్రతి ఏటా తొలి ఏకాదశి నాడు ఈ ప్రాంతం నుండే కాక ఇతర జిల్లాల నుండి వేలాది మంది భక్తులు ఇక్కడకు చేరుకొని పూజలు నిర్వహిస్తారు. మధుమతి దేవి ఆలయం నుండి కొండ పైన వున్న దత్తాత్రేయ స్వామి ఆలయంలోకి గుహ ద్వారాలున్నాయి. స్వాతంత్ర్య పోరాట సమయంలో నాటి జాతి నాయకులు తలదాచుకోవడానికి ఈ ప్రాంతానికి విచ్చేయగా ఇక్కడి నాయకులు వారికి ఆహార పదార్థాలను సరఫరా చేశారని ఈ ప్రాంతంలో చెప్పుకుంటుంటారు. ప్రకృతి సౌందర్యాలు, ఆధ్యాత్మిక చింతనతో పాటు దేశ రక్షణకు ఈ ప్రాంతం ఉపయోగపడడం విశేషం. ఎత్తిపోతల అందాలను తెరకెక్కించాలనే ఉద్దేశ్యంతో ఇక్కడ ఎన్నో చలన చిత్రాలను నిర్మించారు. వివిధ పాటలు, సన్నివేశాలు అగ్రహీరోల పై సైతం ఇక్కడ చిత్రీకరించారు. ఎత్తిపోతలను పర్యాటకంగా అభివృద్ధి పరచాలనే ఉద్దేశ్యంతో టూరిజం శాఖ వినూత్నమైన రీతిలో వ్యవహరిస్తూ ప్రజలకు చేరువచేస్తోంది. ఇక్కడ పర్యాటకులకు సమావేశం హాల్,క్యాంటిన్‌ల ఆధునీకీకరుణతో పాటు రాత్రి వేళల్లో సైతం పర్యాటకులను ఆహ్లాద పరచాలనే ఉద్దేశ్యంతో మ్యూజికల్ లైటింగ్ సిస్టమ్‌ను కూడా ఏర్పాటు చేస్తున్నారు. రాష్ట్ర రాజధాని హైదరాబాదు నుండి టూరిజం శాఖ ఏర్పాటు చేసిన ప్రత్యేక బస్సుల ద్వారా కూడా ఎత్తిపోతలను సందర్శించవచ్చు.



ఎత్తిపోతల జలపాతం

# దేవతా విగ్రహాలకు నెలవు.. కొత్తపాలెం..



ఐదు తలల ఏకరాతి నాగేంద్రుడి విగ్రహం

**నిత్యం పూజలు.. ధూపదీప నైవేద్యాలు.. పుష్పాలంకరణలు.. మంగళవాయిద్యాలతో నిత్య అలంకారాలతో ఎన్నో మహిమలు కలిగివున్న అపురూప దేవతా విగ్రహాలవి. నేటి ఆధునిక యుగంలో యంత్రాలతో కూడా తయారుచేయలేని ఆ రాతి విగ్రహాలను సాంకేతిక పరిజ్ఞానం కూడా లేని రోజులలో మనిషి చెక్కాడు. అంతేకాదు. జీవం ఉట్టిపడే అపురూప శిల్పాలుగా మలిచాడు. ఆ పురాతన విగ్రహాలు నేడు ఎండలకు ఎండి, వానలకు తడిసి వైభవాన్ని కోల్పోయాయి. గతాన్ని తలచుకుంటూ పొల్లాల్లో దిక్కులేని స్థితిలో పడిఉన్నాయి.**



సీతారామలక్ష్మణ విగ్రహాలు

మండలంలోని కొత్తపాలెం పరిధిలో కొండవీడు కొండలను ఆనుకుని ఉన్న పొలాలలో పురాతన దేవతా విగ్రహాలు అక్కడక్కడా పడిఉన్నాయి. చిన్న విగ్రహాల మొదలు పెద్ద విగ్రహాల వరకూ వందల సంఖ్యలో ఉన్నాయి. చరిత్రలోకి వెళితే.. ప్రస్తుత గ్రామం దక్షిణ దిక్కులోని కొండవీడు కొండలకు దగ్గర్లో ఉండేది. అప్పుడు ఆ గ్రామాన్ని పుట్టకోటగా పిలిచేవారు. 12వ శతాబ్దంలో కొండవీటి రెడ్డి రాజులు కొండవీడు కొండలను రాజధానిగా చేసుకుని పరిపాలన కొనసాగించారు. తమ పరిపాలనలో కొండలకింద ప్రాంతాలను 18 పేటలుగా విభజించి పరిపాలన కొనసాగించారు. ఆ పేటలలో ఒకటి పుట్టకోట. పుట్టకోట గ్రామం నుంచి కొండవీడు కొండలపై ముఖద్వారాలు ఏర్పాటుచేసుకుని రాకపోకలను కొనసాగించారు.

తమ పరిపాలన సుభిక్షంగా ఉండాలన్న కాంక్షతో పుట్టకోటలో సుమారు 200 దేవాలయాలను నిర్మాణం చేసినట్టు శాసనాలు తెలుపుతున్నాయి. కొండలపై తమ కోటకు ఈశాన్యం దిక్కుగా ఉన్న పుట్టకోటలో పూజలు చేసి యుద్ధానికి బయలుదేరితో తప్పక విజయం లభిస్తుందన్న నమ్మకంతో ఎన్నో మహిమలు కలిగిన దేవతా విగ్రహాలను ఏర్పాటుచేసి దేవాలయాలను నిర్మించారు. కొండవీడు రెడ్డి రాజులు నిత్యం కిందకు వచ్చి పూజలు నిర్వహించేవారని ప్రతీతి. రెడ్డి రాజుల రాజ్యాన్ని



కాలభైరవుడి విగ్రహం

పరిపాలించిన ఆఖరి రాజు అనమా చినవేమారెడ్డి ఇక్కడ పూజలు నిర్వహించకుండా మొగల్ చక్రవర్తులతో యుద్ధానికి తలపడిన కారణంగా ఓడిపోయాడని ఇక్కడి శాసనాలలో ఉంది. అంతేగాక శ్రీకృష్ణ దేవరాయల పరిపాలనలో కూడా కరవు కాటకాల కారణంగా ఇక్కడ దేవాలయాలను సరిగా పట్టించుకోలేదని, అప్పటి నుంచే కొండవీడు చరిత్ర క్రమేణా మరుగునపడిపోయింది.

**నాగేంద్రుడి విగ్రహాలు కోకొల్లలు**

పుట్టకోటలో నాగేంద్రుడి విగ్రహాలు కోకొల్లలుగా కనిపిస్తాయి. ఏకరాతితో నిర్మించిన 5 తలల నాగేంద్ర స్వామి విగ్రహం భీకరంగా కనిపిస్తున్నది. అలాగే గంగాలమ్మ విగ్రహం వద్ద రెండు నాగేంద్రస్వామి విగ్రహాలు ఉన్నాయి. కొండకు దగ్గర రెండు నాగేంద్రస్వామి విగ్రహాల మధ్య కాలభైరవుడి విగ్రహం కూడా ఉంది. ఇక్కడ ఉన్న ఈ మూడు విగ్రహాలలో ఒక నాగేంద్ర స్వామి విగ్రహం అత్యంత మహిమ కలిగినదని స్థానికుల విశ్వాసం. రెడ్డి రాజుల పరిపాలనలో ఈశాన్యం దిక్కున నాగు పాముల పుట్టలు ఎక్కువగా ఉండడంతో ఈ ప్రాంతాన్ని పుట్టకోటగా నామకరణం చేసినట్టు చరిత్ర చెబుతున్నది. ఈ పొలాలలోని భూముల అడుగున అనేక విగ్రహాలు ఉన్నట్టుగా గ్రామస్తులు చెబుతారు. ఇటీవల కాలంలో కూడా సీతా రామ లక్ష్మణ విగ్రహాలు ఒకచోటే దొరికాయి. ఇక్కడ ఉన్న విగ్రహాలు రక్షణలేని స్థితిలో ఉన్నాయి. గుప్త నిధుల కోసం కొంతమంది ఈ విగ్రహాల వద్ద తవ్వకాలు జరిపి విగ్రహాలను ధ్వంసం చేస్తున్నారు. ప్రభుత్వం ఇక్కడ మ్యూజియాన్ని ఏర్పాటు చేసి పొలాల్లో పడివున్న విగ్రహాలను భద్రపరచాలని స్థానికులు కోరుతున్నారు.

-(ఆన్‌లైన్, యడ్లపాడు)

# పల్నాటి తిరుపతి 'దేవరంపాడు'



దేవరంపాడు వెంకటేశ్వర స్వామి ఆలయం



స్వయంభువు

కోర్కెలు తీర్చే కల్పవల్లి దేవరంపాడు నేతి వెంకన్న స్వామి. పల్నాటి ప్రాంత ప్రజలకు తిరుపతి వెంకటేశ్వరస్వామిగా సుపరిచితుడైన దేవరంపాడు వెంకన్న స్వామి తిరునాళ్ల ఈ నెల 20 నుంచి ప్రారంభం కానున్న సందర్భంగా ఏర్పాట్లకు ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ సూర్యనారాయణ శ్రీకారం చుట్టారు. స్వామివారు పశుసంపదకు, పాడిపంటలకు ఆరాధ్యదైవం. సుమారు 100 సంవత్సరాల నుంచి ఆరాధించబడటం దేవరంపాడు నేతివెంకన్న స్వామి విశేషం. ఏ పనితలపెట్టాలన్నా శనివారం స్వామివారిని దర్శించుకొని ప్రారంభించటం పల్నాటి ప్రాంత ప్రజలకు ఆనవాయితీ.

**వెంకన్న స్వామి విశిష్టతలు..**

శ్రీ మహావిష్ణువు దశావతరంలలోని తొలి అవతర రూపమైన 'మత్స్య అవతారం'తో దేవరంపాడు శ్రీవెంకటేశ్వరస్వామి వెలిశారని ప్రతీతి. ఈ కొండపై వెలిసిన శ్రీ వెంకటేశ్వరస్వామి స్వయంభువు అయి ఉండటం ఇక్కడి విశిష్టత. స్వామి వారి పాదాల వద్ద నెయ్యిపోస్తే మత్స్యవతారం నేతిలో లీలగా కనిపించటం మరో విశేషం. ఇక్కడ స్వామివారి విగ్రహం పైన కప్పువేయకుండా వుండటం విశిష్టత. ఎండకు ఎండుతూ , వానకు తడుస్తూ చలికి వణుకుతూ ఉండటం విశేషం. స్వామివారి వెనుక భాగంలో ఆలయం నిర్మించి 2001 జూన్ నెలలో తిరుపతి నుంచి తయారుచేయించి తెచ్చిన శ్రీ వెంకటేశ్వరస్వామి విగ్రహాన్ని ఇక్కడ ప్రతిష్ఠించారు.

**ఎప్పుడెప్పుడు...**

దేవరంపాడు నేతివెంకన్న స్వామి తిరునాళ్లను పాల్గుణ మాసంలో వచ్చే శనివారాలలో నిర్వహిస్తుంటారు. రెండో శనివారం స్వామివారి కళ్యాణం ఉదయం 10.58 గంటలకు జరుగుతుంది. మూడో శనివారం దేశ విదేశాలలో ప్రసిద్ధి చెందిన డప్పు వాయిద్యాలకారుడు చల్లపల్లి వాస్తవ్యులు డప్పు శ్రీనుతో వాయిద్య గాన కళాప్రదర్శనలు ఏర్పాటుచేస్తారు.

**ముఖ ద్వారానికి నిధులు మంజూరు**

పల్నాటి తిరుమలగా పేరుగాంచిన దేవరంపాడు నేతి వెంకన్న స్వామి ముఖ ద్వారానికి నిధులు మంజూరైనట్లు ఈవో సూర్యనారాయణతెలిపారు. ముఖ ద్వారాన్ని అద్దంకి నార్కెట్‌పల్లి హైవేపై స్వామివారి ఆలయ రహదారి ప్రథమంలో త్వరలో నిర్మించనున్నట్లు ఆయన పేర్కొన్నారు.

-(ఆన్‌లైన్, రాజుపాలెం)



వెంకటేశ్వర స్వామి విగ్రహం

# తెల్లోళ్లపై తిరగబడ్డ త్రివేణి

(ఆన్‌లైన్, నరసరావుపేట)

స్వాతంత్ర్య సమరోద్యమంలో తెల్లోళ్ళ పై త్రివేణి తిరగబడింది. స్వాతంత్ర్యం కోసం సమర శంఖం పూరించింది. స్వాతంత్ర్య సమరయోదుల భావాలకు, ఉద్యమాలకు బాటలు వేసింది. త్రివేణి పేరు చెబితే చాలు తెల్లోళ్ళ గుండెల్లో రైళ్ళు పరిగెత్తేవి. కరుకైన కథనాలతో యువతను తట్టిలేపే రచనలతో సాహిత్యం, రాజకీయంలలో ఉన్నత ప్రమాణాలకు ఆనాడు ఖ్యాతినిచ్చింది త్రివేణి ప త్రిక. అంతటి పేరెన్నిక గన్న త్రివేణి పత్రిక వ్యవస్థాపకులు కోలవెన్ను రామకోటేశ్వర రావు నరసరావుపేట నివాసి కావటం ఈ ప్రాంతానికే గర్వకారణం.

స్వాతంత్ర్య సమరంలో తెలుగులో అనేక పత్రికలు వాటి వంతు పాత్ర నిర్వహించాయి. అయితే త్రివేణికి ఒక ప్రత్యేక స్థానం సంతరించుకుంది. తెల్లోళ్ళకు అర్థమయేనందుకేనేమో కోలవెన్ను రామకోటేశ్వరరావు త్రివేణి పత్రికను ఇంగ్లీషులో ముద్రించేవారు. దేశ ప్రజల భావాలను పత్రిక ద్వారా బ్రిటీష్ పాలకులకు చాటి చెప్పేవారు. 1927లో త్రివేణి పత్రిక కోలవెన్ను రామకోటేశ్వరరావు సంపాదకత్వంలో అవతరించింది. స్వా తంత్ర్యోద్యమంతో పాటు ఆగ్ల పత్రిక త్రివేణి ద్వారా దేశంలోని వివిధ సాహిత్యాల సౌదర్యం, దేశ వాసులు, విదేశ వాసులు ఆస్వాదించేట్టు చేసింది. తెల ుగు సాహిత్యపు నిగ్గును ఇతరులకు అందజేసి తెనుగు సాహిత్యం ఉత్తమ ప్రపంచ సాహిత్యానికి ఏ మాత్రం తీసిపోదని చాటి చెప్పింది. భావ సమైక్యాన్ని త్రివేణి సాధించింది. ఈ పత్రిక సంపాదక మండలిలో సర్వేపల్లి రాధాకృష్ణన్, కె.చంద్రశేఖర్, డి.ఆంజనేయులు, కె.సౌమిత్రి అమ్మాళ్, యు పి.పండిట్‌లు వు న్నారు. ఆనాటి స్వా తంత్ర్య సమర యో.దులు రాజేంద్ర ప్ర సాదు, సర్వేపల్లి రాధాకృష్ణ, రాజాజీ, అనిబిసెంట్, మున్షి, ప్రకాశ, ఆనంద్, కె.కుమారస్వామి, జిడ్డు కృష్ణమూర్తి లాంటి వారెందరో త్రివేణికి రచనలు అందించేవారు.



కోలవెన్ను రామకోటేశ్వరరావు దంపతులు

### త్రివేణి ఒక భూషణం: నెహ్రూ

'భారత మాజీ ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ త్రివేణి సంచికను చేతబూని స్వాతంత్ర్య సమావేశాలకు హాజరయ్యేవారు. ఈ సందర్భంగా ఆయనను పలువురు ప్రశ్నించగా, త్రివేణి ఒక భూషణం. దానిని ధరించటానికి నేను గర్వపడుతున్నాను అని జవహర్‌లాల్ నెహ్రూ అనే వారట'. దీనిని బట్టి త్రివేణి స్వాతంత్రోద్యమంలో ఎటువంటి పాత్ర పోషించిందో ఇట్టే అర్థం చేసుకోవచ్చు. న్యాయ శాస్త్ర పట్టభద్రుడైన కోలవెన్ను రామకోటేశ్వర రావు నరసరావుపేటలో న్యాయవాద వృత్తిని చేపట్టారు. ఇంతలో సహాయ నిరాకరణోద్యమం ముమ్మరంగా జరుగుతున్న సమయంలో 1920 లో లాయర్ వృత్తికి స్వస్తి చెప్పి ప్రజా ఉద్యమంలో పాల్గొన్నారు. తొలుత ఆయన 'స్వరాజ్య' పత్రికలో కాసా సుబ్బారావు, కృపానిధిలతో కలసి కొంత కాలంపాటు సహాయ సంపాదకులుగా పని చేశారు. స్వరాజ్యాన్ని పత్రికను వదిలి వేసి చెన్నై నుంచి త్రివేణి ఆంగ్ల సాహిత్య మాస పత్రికను ఆయన ప్రారంభించారు. తెలుగు వారే కాక మహారాష్ట్ర, కన్నడి బాషా సాహిత్య వేత్తలు ఆయన కృషికి తోడ్పాటునిచ్చారు. రాజనీతిజ్ఞులు కన్నా సాహిత్య వేత్తలే భారత సమైక్యం సాధించ గలరని కోలవెన్ను విశ్వాసం. ఇతర భారతీయ బాషలను పరిశీలించినట్లయితే సంస్కృతానికి, ఆంగ్లానికి కూడా అందరూ రుణపడి వున్నామని తేలుతుందని, ఏ భాషను గురించి కాని ద్వేషమన్నది ఎప్పుడూ పెంచుకోరాదు అన్నది కోలవెన్ను కఠోర నియమం. ఒక వైపు త్రివేణి పత్రికలో సేవ చేస్తూనే బందరు జాతీయ కళాశాల ప్రిన్సిపాల్‌గా, కృష్ణ పత్రిక సంపాదకులుగాను కొంత కాలం సౌత్ ఇండియన్ తెలుగు సంపాదకులుగాను పని చేశారు. కేంద్ర సాహిత్య అకాడమి సలహా సంఘం సభ్యులుగా కోలవెన్ను వున్నారు. తెలుగు నవకవితోద్యానంలో ప్రముఖులు అడవి బాపిరాజు, నండూరి సుబ్బారావు, బసవరాజు అప్పారావులు కోలవెన్నుకు ప్రాణమిత్రులు. 1970 మేలో కోలవెన్ను రామకోటేశ్వరరావు నరసరావుపేటలో మృతి చెందారు. స్టేషన్ రోడ్డులోని ప్రస్తుతం వున్న డాక్టర్ కృష్ణకుమారి హాస్పిటల్ స్థలంలో కోలవెన్ను నివాసం వుండేది. ఆయన ఇంటికి త్రివేణి నిలయం అని పేరు వుండేది.

# పేదల సేవలో డాక్టర్ కోడెల ట్రస్ట్

(ఆన్‌లైన్, నరసరావుపేట టౌన్)

పేదలకు విస్తృతమైన సేవలు అందించే లక్ష్యంతో డాక్టర్ కోడెల సత్యనారాయణ ట్రస్ట్ పని చేస్తున్నది. తండ్రి మంత్రిగా వున్నా తాను మాత్రం సాధారణ విద్యార్థిగానే భావించాడు. కష్టపడి చదివి ఎముకుల చికిత్సా విధానంలో బంగారు పతకాన్ని సాధించాడు. ఎంఎస్ పూర్తవ్వగానే కార్పొరేట్ ఆస్పత్రుల వైపు పరుగులు తీయకుండా సామాన్యులకు సేవలు అందించాలనే తలంపుతో సింగరేణి ఆస్పత్రిలో ప్రభుత్వ ఉద్యోగిగా పని చేశాడు. పేదల స్పందనను తెలుసుకొన్నాడు. అక్కడ పని చేసే సమయంలో మందులు లేకుంటే సొంత డబ్బు వెచ్చించి రోగులకు మందులు కొని ఇచ్చేవాడు. ఇలా ఆస్పత్రిలోని తోటి వైద్యులు, సింగరేణి కార్మికుల మన్ననలను అందుకొన్నాడు మాజీ మంత్రి డాక్టర్ కోడెల శివప్రసాదరావు చిన్న కుమారుడు డాక్టర్ కోడెల సత్యనారాయణ. అలాంటి ఆదర్శ వైద్యుడు అందరూ ముద్దుగా పిలుచుకొనే చిన్ని కారు ప్రమాదంలో మరణించాడు. ఆయన ఆశయాలకు అనుగుణంగా ప్రజలకు సేవలు అందించేంకు సత్యనారాయణ తండ్రి, టీడీపీ అధికార ప్రతినిధి డాక్టర్ కోడెల శివప్రసాదరావు, ఆయన పెద్ద కుమారుడు డాక్టర్ కోడెల శివరామకృష్ణల ఆధ్వర్యంలో చిన్ని పేరు పై ధర్మ సంస్థను ఏర్పాటు చేశారు. ఈ ట్రస్ట్ ద్వారా పేదలకు విశేషమైన వైద్యసేవలను అందిస్తున్నారు. రక్తదాన శిబిరాలను నిర్వహించి ఆపదలో వున్న వారిని ఆదుకొనేందుకు ట్రస్ట్ తరుపున బ్లడ్ ప్యాకెట్లను రక్తనిధికి అందజేస్తున్నారు. గుంటూరు జిల్లాతో పాటు రాష్ట్రంలో ఇతర ప్రాంతాలలో కూడా ట్రస్ట్ ఆధ్వర్యంలో పలు సేవా కార్యక్రమాలు నిర్వహించారు. ఇప్పటి వరకు సుమారు 35వేల మందికి ట్రస్ట్ ద్వారా వైద్య సేవలు అందజేశారు. మేనేజింగ్ ట్రస్టీగా డాక్టర్ కోడెల శివరామకృష్ణ వ్యవహరిస్తున్నారు.



రోగులకు మందులు రాస్తున్న డాక్టర్ శివప్రసాదరావు

# త్వరలో కొండవీడుకు పూర్వవైభవం



కొండవీడు కోట

(ఆన్‌లైన్, యడ్లపాడు)

చుట్టూ ఎత్తైన కొండలు.. చైనా గోడను తలపించే గోడ.. బురుజులు.. దర్వాజులు.. అణువణువునా దర్శనమిచ్చే శిల్ప సౌందర్యం.. ఇవీ కొండవీడు కోటకు వెళితే మనకు దర్శనమిచ్చే ప్రదేశాలు.. కొండవీడు కేంద్రంగా 100 ఏళ్లపాటు సుదీర్ఘంగా కొనసాగిన రెడ్డిరాజుల పాలన తెలుగువారి కీర్తిని నలుచరలా చాటిచెప్పింది. రాజధానిగా వెలుగొందింది. శత్రుమూకలు ముట్టడించేందుకు సాధ్యం కాని గిరిదుర్గం, ఆది, శైవ, వైష్ణవ మతాలకు ప్రాధాన్యమిస్తూ అనేక అద్భుత కట్టడాలను ఇక్కడ నిర్మించారు. కట్టడాలు శిథిలావస్థలో కనుమరుగవుతున్న తరుణంలో పర్యాటక కేంద్రంగా తీర్చిదిద్దేయత్నాలు మొదలయ్యాయి. కోటను 1324 నుంచి 1353 వరక ప్రోలయ వేమారెడ్డి, 1353 నుంచి 1364 వరకు అనపోతారెడ్డి, 1364-86 వరకు అనవేమారెడ్డి, 1386 -92 వరకు కుమార గిరిరెడ్డి, 1392-90 అనపోతారెడ్డి, 1390-1414 వరకు కాటయ వేమారెడ్డి, 1414-20 వరకు పెదకోమటి వేమారెడ్డి, 1420 - 24 వరకు రాచ వేమారెడ్డి, 1424-45 వరకు వీరభద్రారెడ్డి, దొడ్డారెడ్డి...లు పరిపాలించారు.

### ఇదీ కోట కథ...

యడ్లపాడు మండలంలోని ప్రాచీన చారిత్రాత్మకమైన ప్రదేశం కొండవీడు. రెడ్డిరాజులు, శ్రీకృష్ణ దేవరాయలు పాలించారు. క్రీశ 1131 విశ్వం బరదేవుడనే గజపతి రాజు దీనిని అద్భుతంగా నిర్మించినట్లు చారిత్రక కథనం. క్రీశ 1336 నుంచి కొండవీడులో రెడ్డి రాజుల పరిపాలన ప్రారంభమై 105 ఏళ్లపాటు కొనసాగింది. చెంఘిజ్‌ఖాన్‌పేట నుంచి గుంటూరు వరకు ఈ కొండలు వ్యాపించి ఉన్నాయి. 1700 అడుగుల ఎత్తు గల కొండవీడు ప్రాకారాన్ని దాని వెలుపల అగడ్త కలిగి ఉంది. కొండవీడుకోట ఐదు చదరపు మైళ్ల వైశాల్యంలో నిర్మితమైంది. నాలుగుకొండల మధ్యఉన్న కోటలో 44 బురుజలు, 72 దర్వాజాలు ఉన్నాయి. ఎదుళ్లు, ముత్యాలమ్మ పుట్టాలమ్మ అనే మూడు మంచినీటి చెరువులను రెడ్డిరాజులు తవ్వించారు. అంతేగాక రెండు గజశాలలు, రెండు అశ్వాశాలలు, ఆయుధశాల, కారాగారం, ధాన్యాగారం, ఖజానాలను, రాళ్లను తొలచి నిర్మించారు. ఇవిగాక వేణుగోపాల స్వామి గుడి లక్ష్మీనరసింహస్వామి గుడి, మదన గోపాల స్వామి దేవాలయం, రామేశ్వర స్వామి, ముత్యాలమ్మ, పుట్టాలమ్మ దేవాలయంతోపాటు గంగాధర రామేశ్వరాలయం, మసీదు ఉన్నాయి. కొండ దిగువున ప్రస్తుతం కత్తుల బావిగా పిలిచే గోపీనాత ఆలయం అణువణువునా అత్యంత విలువైన శిల్పకళ వైపుణ్యంతో ఉట్టిపడుతుంది. కొండవీటి రెడ్డిరాజుల ఆనాడు కళలను బాగా పోషించేవారు. ఈకారణంగానే కొండపైన అపురూ కళా ఖండాలు, దేవతా విగ్రహాలు, కళాత్మక కట్టడాలు వెలిశాయని చరిత్ర తెలియచేస్తోంది. ఇంతటి ప్రాశస్త్యం కలిగినకొండవీడు నేడు కళావిహీనమైంది. ఎన్నో వ్యయ ప్రయాసలకోర్చి ఎంతో కళానైపుణ్యంతో రూపు దిద్దుకున్న కట్టడాలు కూలిపోతూ సంపద మట్టిపాలవుతున్న తరుణంలో పార్యటక కేంద్రంగా మార్చాలని ప్రభుత్వం నిర్ణయించడం అభినందనీయం. ధ్వంసమైన నాటి కట్టడాలను పునఃనిర్మిస్తే నిత్యం పర్యాటకులతో కిటకిటలాడుతూ అంతర్జాతీయ ఖ్యాతి నోచుకోవడంతో పాటు పర్యాటక కేంద్రంగా అభివృద్ధి చెందుతుందని ఈప్రాంత ప్రజలు ఆశగా ఎదురు చూస్తున్నారు.






# కుడికాలువ ద్వారా 130 మెగావాట్ల విద్యుత్ ఉత్పాదన


గుంటూరు బ్రాంచ్ కెనాల్ పై వున్న పవర్ ప్లాంట్


విద్యుత్ నియంత్రణ పరికరాలు

(ఆన్‌లైన్, నరసరావుపేట)

వ్యవసాయ ఉత్పత్తిలో అగ్రగామిగా నిలచిన సాగర్ కుడి కాలువ ప్రాంతం విద్యుత్ ఉత్పత్తి ఖిల్లాగా నిలిచింది. ప్రతిరోజూ 130 మెగావాట్ల విద్యుత్ ఉత్పాదన కుడి కాలువల పై నిర్మించిన పవర్ ప్లాంట్ల ద్వారా జరుగుతోంది. డ్యాం వద్ద కుడి కాలువపై వున్న పవర్ ప్లాంట్ ద్వారా 90 మెగావాట్ల విద్యుత్ ఉత్పత్తి జరుగుతున్నది. అలాగే కుడి కాలువపై వివిధ ప్రాంతాలలో నిర్మించిన మినీ హైడల్ ప్లాంట్ల ద్వారా 40 మెగావాట్ల విద్యుత్ ఉత్పత్తి అవుతున్నది. రాష్ట్రంలో విద్యుత్ కొరతతో అనునిత్యం ఇబ్బందులు ఎదుర్కొంటున్న నేపథ్యంలో నాగార్జున సాగర్ కుడి కాలువలపై మినీ హైడల్ విద్యుత్ ప్రాజెక్టులను ప్రైవేటు సంస్థలు నిర్మించాయి. పంటలకు వినియోగించే నాగార్జున సాగర్ కాలువ నీటితో విద్యుత్ ఉత్పత్తి జరుగుతోంది. కుడి కాలువల పై నిర్మించిన 24 మినీ హైడల్ విద్యుత్ ప్రాజెక్టులతో ప్రతి రోజూ విద్యుత్ ఉత్పత్తి చేస్తున్నాయి. గుంటూరు, ప్రకాశం జిల్లాల గుండా నాగార్జున సాగర్ కుడి కాలువ 216 కిలో మీటర్లు విస్తరించి ఉంది. కుడి కాలువ నుంచి చీలే గుంటూరు, అద్దంకి, బెల్లంకొండ, జూలకల్లు బ్రాంచ్ కెనాల్స్‌తో పాటు చిలకలూరి పేట మేజర్, పెదనందిపాడు బ్రాంచ్ కెనాల్ పై విద్యుత్ ప్రాజెక్టుల నిర్మాణం జరిగింది. ఈ బ్రాంచ్ కెనాల్స్ పై మూడు నుంచి పది అడుగుల ఎత్తులో వున్న డ్రాప్స్ నుంచి జలపాతం వలె కిందకు వేగంగా నీరు పడే ప్రదేశాల్లో మినీ హైడల్ ప్రాజెక్టుల నిర్మాణం జరిగింది. నిర్మాణం పూర్తయి విద్యుత్ ఉత్పత్తి జరుగుతున్న ప్రాజెక్టుల వివరాలు ఇలా ఉన్నాయి. గుంటూరు బ్రాంచ్ కెనాల్ పై దక్కన్ సిమెంట్ లిమిటెడ్, సాగర్ పవర్, కేసీపీ లిమిటెడ్(ఐదు ప్లాంట్లు), రాయలసీమ పవర్ ప్రాజెక్టు, తిరుమల హైడల్ పవర్ ప్రాజెక్టు(మూడు ప్లాంట్లు), చిలకలూరిపేట మేజర్‌పై అక్షయ్ ప్రొఫైల్స్ ప్రైవేట్ లిమిటెడ్(రెండు), పెదనందిపాడు బ్రాంచ్ కెనాల్ పై పిఎంసి పవర్ ప్రాజెక్టు లిమిటెడ్, బెల్లంకొండ బ్రాంచ్ కెనాల్ పై యస్పార్ లిమిటెడ్(రెండు), జూలకల్లు బ్రాంచ్ కెనాల్ పై శివాని పవర్ స్పిన్నర్, అద్దంకి బ్రాంచ్ కెనాల్ పై శ్రీ ధనలక్ష్మి కాటన్(మూడు), ట్రైడెంట్ పవర్ సిస్టమ్ లిమిటెడ్(రెండు), శ్రీ జయలక్ష్మి పవర్ కార్పొరేషన్ లిమిటెడ్(రెండు) సంస్థల ఆధ్వర్యంలో మినీ హైడల్ పవర్ ప్లాంట్లు కొనసాగుతున్నాయి. సాగర్ కాలువలకు నీరు సరఫరా అయ్యే రోజుల్లో మాత్రమే ఈ విద్యుత్ ప్రాజెక్టుల ద్వారా విద్యుత్ సరఫరా అవుతుంది. అతి తక్కువ వ్యవయంతో విద్యుత్ ఉత్పాదన జరుగుతుంది. ఉత్పత్తి అయిన విద్యుత్‌ను రాష్ట్ర పవర్ గ్రిడ్‌కు సరఫరా చేస్తారు. జిల్లా చరిత్రలోనే మినీ హైడల్ విద్యుత్ ప్రాజెక్టులను ఒక మైలురాయిగా పేర్కొనవచ్చు.

# భక్తుల కొంగు బంగారం అగస్త్యేశ్వరస్వామి


కొమ్మూరు అగస్తేశ్వర స్వామి దేవస్థానం

(ఆన్‌లైన్ - కాకుమాను)

మండలంలోని కొమ్మూరు గ్రామంలో అతి పవిత్రమైన, పురాతనమైన ఆరామాలలో శ్రీ అగస్తేశ్వర స్వామి దేవాలయం ఒకటిగా గుర్తింపు పొందింది. కొమరా రామంగా ప్రసిద్ధి చెందిన ఈ ఆలయం నేడు కొమ్మూరుగా పిలుస్తున్నారు.ఈ శివక్షేత్రంలో శివరాత్రి, సంక్రాంతి పండుగలను వైభవంగా నిర్వహిస్తారు. ప్రతి ఏటా మహాశివరాత్రి పర్వదినాన స్వామి కల్యాణోత్సవం అంగరంగ వైభవంగా జరుగుతుంది.

## స్వామి చరిత్ర ...

అగస్తేశ్వర ముని తన బృందంతో ఈ ప్రాంతానికి వచ్చి పక్కనే ఉన్నటగేరు వాగులో స్నానం ఆచరిస్తుండగా శివలింగం ప్రత్యక్ష మైంది. స్వయంభూ పటిక లింగాన్ని వాగు వడ్డునే ప్రతిష్టించాడు. అనంతరం చోళ రాజులు ఈ దేవాలయ నిర్మాణాన్ని పూర్తి చేశారు. నాటి నుంచి అగస్తేశ్వర దేవాలయంగా ప్రసిద్ధి చెందింది. ఈ ప్రాంగణంలోనే శ్రీకృష్ణ దేవారయులు చెన్నకేశవ ఆలయాన్ని 24 స్తంభాల మండపాన్ని నిర్మించారు. ఈ నిర్మాణానికి 600 సంవవత్సరాల చరిత్ర ఉన్నట్లు చెబుతారు.

## విశిష్టత ...

ఒకే ప్రాంగణంలో అగస్తేశ్వర స్వామి దేవస్థానం, చెన్నకేశవ స్వామి దేవస్థానం, కాశీ విశ్వనాథ స్వామి ఆలయాలు కొలువై ఉండి నిత్యం దూప, దీప నైవేద్యాలతో పూజలు అందుకుంటున్నాయి. కార్తీక మాసంలో అనేక ప్రాంతాల నుంచి భక్తులు అధిక సంఖ్యలో తరలి వచ్చి విశేష పూజలతో తమ మొక్కలు తీర్చుకుంటారు. కార్తీక మాసంలో ఉపవాసం, భక్తి శ్రద్ధలతో పూజలు చేస్తే అనుకున్న కోర్కెలు తప్పక తీరుతాయని ప్రతీతి.

### పారిశ్రామిక వాడలుగా మారుతున్న

# వ్యవసాయ భూములు

(ఆన్‌లైన్, యడ్లపాడు)

నూతన పరిశ్రమలు, పారిశ్రామిక పార్క్‌లు, రియల్ ఎస్టేట్‌దారుల రంగ ప్రవేశం ఈ ప్రాంతంలో ఎక్కువ కావడంతో రైతుల భూములను అత్యధిక శాతం బడాబాబులు కొనుగోలు చేయడంతో పొలాలు పారిశ్రామిక భూములుగా మారుతున్నాయి. నియోజకవర్గం మధ్యలో 5వ నంబరు జాతీయ రహదారి వెళ్తుండడంతో రాష్ట్ర వ్యాప్తంగా బడాబాబుల చూపు ఈ ప్రాంతంపై పడింది. అంతేగాక స్పైసెస్ పార్కు, ఫుడ్ పార్కు, ఐటి పార్కులు వంటి పారిశ్రామిక పార్కులు ఇక్కడ ఏర్పాటు చేయడంతో పారిశ్రామికవేత్తలు ఈ ప్రాంతంలో భూములు కొనుగోలుకు మొగ్గుచూపుతున్నారు.



ఉన్నవ, బోయపాలెం మధ్య వ్యవసాయ భూములు ఇళ్ల ఫ్లాట్‌లుగా మారిన చిత్రం

మొట్టమొదటగా నియోజకవర్గంలో పారిశ్రామిక అభివృద్ధి తిమ్మాపురం, గణపవరంలకు పరిమితమైంది. ఆ తరువాత బోయపాలెం, యడ్లపాడులకు విస్తరించింది. యడ్లపాడులో 1989లో ప్రభుత్వ ఆధ్వర్యంలో ఏర్పాటు చేసిన స్పిన్నింగ్ మిల్లుకు 65 ఎకరాలను కేటాయించారు. ఆ తరువాత స్పైసెస్‌పార్కు నిర్మాణానికి 125 ఎకరాలు, ఫుడ్ పార్కుకు 60 ఎకరాలు, ఐటి పార్కుకు 54 ఎకరాలను ప్రభుత్వం మండలంలోని మైదవోలు, వంకాయలపాడు, కొండవీడు రెవెన్యూ పరిధిలలో కేటాయించింది. మైదవోలు వద్ద మరో 150 ఎకరాలను ఒక ప్రైవేటు సంస్థ కొనుగోలు చేసింది. బోయపాలెం ప్రాంతంలో స్పిన్నింగ్ మిల్లుల ఆధ్వర్యంలో వంద ఎకరాల భూములను కొనుగోలు చేశారు. బోయపాలెం, ఉన్నవ గ్రామాల మధ్య వ్యవసాయ భూములను దాదాపు బడాబాబులు ఎక్కువ భాగం కొనుగోలు చేశారు. ఈ రహదారిలో రియల్ ఎస్టేట్ వ్యాపారులు ఇళ్ల స్థలాల వెంచర్లను కూడా వేశారు.తిమ్మాపురం, యడ్లపాడు మధ్య 200 ఎకరాలను గుంటూరు, విజయవాడ, హైదరాబాదుకు చెందిన పారిశ్రామికవేత్తలు కొనుగోలు చేశారు. తిమ్మాపురం నుంచి చిలకలూరిపేట వరకు జాతీయ రహదారి పక్కన వ్యవసాయ భూములు ఏమీ లేకపోవడం విశేషం.

### బైపాస్ నిర్మాణంతో రైతుల భూములకు ఎసరు

యడ్లపాడు వద్ద నుంచి బైపాస్ నిర్మాణం జరుపుతారన్న ఊహాగానాలు రావడంతో రైతులు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. బైపాస్ రోడ్డు నిర్మాణం పేరుతో రైతుల భూములను ప్రభుత్వం స్వాధీనం చేసుకుని నామమాత్ర నష్టపరిహారం ఇస్తారన్న అందోళన ఈ ప్రాంతంలో నెలకొంది. బైపాస్ రోడ్డు నిర్మాణం జరిగితే పక్కనున్న వ్యవసాయ భూములు బడాబాబులు కొనుగోలుచేసి పారిశ్రామిక భూములుగా మారతాయన్న ఆందోళన నెలకొంది. 5వ నంబరు జాతీయ రహదారి రెండువైపులా విజయవాడ నుంచి తాతపూడి వరకు వ్యవసాయ భూములను మొత్తం పారిశ్రామికవేత్తలే కొనుగోలు చేశారు. బైపాస్ రోడ్డు పక్కన కూడా బడాబాబులే కొనుగోలుచేస్తారని, వ్యవసాయం చేయడానికి భూమి మిగిలే పరిస్థితి ఉండదన్న భావన ఈ ప్రాంత రైతులలో నెలకొంది. ఇప్పటికే యడ్లపాడు మండలంలో వెయ్యి ఎకరాల భూమి వ్యవసాయానికి దూరంగా పారిశ్రామికవేత్తల చేతుల్లోకి చేరింది. బైపాస్ నిర్మాణం జరిగితే మరో వెయ్యి ఎకరాలు పారిశ్రామికవేత్తల వశం కానుంది.

# కనుమరుగవుతున్న అరటి బొత్తల విస్తళ్ళు



విస్తళ్ళు తయారీచేస్తున్న దృశ్యం

(ఆన్‌లైన్ - భట్టిప్రోలు)

విస్తళ్ళలో భోజనం చేయటం ఆరోగ్యానికి మంచిది. అందువలనే అన్ని విధాలైన కార్యక్రమాల్లో విస్తరి భోజనం వడ్డించటం ఆనవాయితీగా వస్తుంది. ఈ విస్తళ్ళలో అరటి ఆకు, బొత్తలతో కుట్టిన విస్తళ్ళు వున్నాయి. అరటి బొత్తలతో కుట్టిన విస్తళ్ళకు గతంలో మంచి డిమాండ్ వుండేది. అయితే అభివృద్ధి పేరుతో మారుతున్న విధానాల ఫలితంగా యంత్రాల ద్వారా తయారవుతున్న రంగురంగుల కాగితం విస్తళ్ళను, లేదంటే ప్లాస్టిక్ ప్లేట్లను ఉపయోగిస్తున్నారు. దీనివలన వాతావరణ కాలుష్యమేగాక సంప్రదాయ విస్తళ్ళకు విలువ లేకుండా పోయింది.

అరటి బొత్తలతో విస్తళ్ళు కుడుతూ మండలంలోని వెల్లటూరు గ్రామంలో సుమారు 50 కుటుంబాల వారు జీవనం సాగిస్తున్నారు. ఈ కుటుంబాలలో మహిళలు విస్తళ్ళ తయారీకి అవసరమైన ముడిసరుకును కృష్ణా నది పరీవాహక లంకగ్రామాలైన జువ్వలపాలెం, పెసర్లంక, పెదలంక, పోతార్లంక, సుగ్గునలంక, చింతమోటు, తిప్పలకట్ట, కిష్కిందపాలెంల నుంచి సేకరిస్తారు. ఉదయాన్నే నిద్రలేచి పది కిలోమీటర్లు కాలినడకన చేరుకుంటారు. సాయంత్రం వరకు పంట అనంతరం నరికివేయబడిన అరటి చెట్టు బొత్తల నుంచి తమకు కావాల్సినవి సేకరిస్తారు. ఇలా బొత్తల నుంచి వేరుచేసి తెచ్చిన ముడి సరుకు తమకు కావాల్సిన సైజులో కత్తిరించుకుంటారు. మూడవరోజు విస్తళ్ళను కుట్టే కార్యక్రమాన్ని చేపడతారు. ఒక్కో కుటుంబం రోజుకు 500 నుంచి 600ల విస్తళ్ళను కుడతారు. ఇలా తయారుచేసిన విస్తళ్ళను భోజనానికి, రొయ్యలు, చేపలు ఎగుమతులు కోసం బందరు, మంగెనపూడి, నాగాయలంక, చీరాల ఓడరేవు తదితర ప్రాంతాలకు కొనుగోలుదారుల ద్వారా విక్రయించేవారు. ప్రస్తుతం చేపల ఎగుమతులకు ఐస్ బాక్సులు, ప్లాస్టిక్ కవర్లు వినియోగించటంతో ఈ పరిశ్రమకు ఆదరణ తగ్గింది. దీంతో విస్తళ్ళ నిల్వలు పెద్ద ఎత్తున పేరుకుపోయాయి. వ్యవసాయం లేని తరుణంలో ఈ విస్తళ్ళు కుట్టుకుని జీవించే తమ కుటుంబాలు ప్రస్తుతం ఆర్థికపరమైన ఇబ్బందులు ఎదుర్కొంటున్నట్లు మహిళలు తెలిపారు. కుటీర పరిశ్రమలను ప్రోత్సహించేందుకు ప్రభుత్వం చేస్తున్న ప్రయత్నాలలో భాగంగా ఈ విస్తళ్ళ పరిశ్రమను కుటీర

మిగతా 37వ పేజీలో

# సమస్యల వలయంలో పణిదెం చేనేత సహకార సంఘం

(ఆన్‌లైన్, సత్తెనపల్లి)

స్వాతంత్ర్య ఉద్యమకాలంలో చేనేత పరిశ్రమ రక్షణకోసం జాతిపతి మహాత్మ గాంధీ రాట్నాన్ని చిహ్నంగా జెండాను రూపొందించి, విదేశీ వస్త్ర బహిష్కరణ ఉద్యమాన్ని నిర్వహించారు. అనంతరం అధికారంలోకి వచ్చిన పాలకులు అనుసరిస్తున్న విధానాల ఫలితంగా చేనేత పరిశ్రమ తీవ్ర సంక్షోభానికి గురికావటంవల్ల కార్మికులకు ఉపాధి లేక ఇబ్బంది పడుతున్నారు. గత పాలక ప్రభుత్వాలు చేనేత పరిశ్రమ రక్షణకోసం అనేక సంక్షేమ పథకాలు ప్రవేశపెడుతున్నట్టు వాగ్ధానాలు చేయటం తప్ప ఆచరణలో ఏ ఒక్కటి అమలు కాలేదు. భారతదేశంలో ప్రధానమైన వ్యవసాయ, చేనేత రంగాలకు ప్రాధాన్యమిచ్చి ఆయా రంగాలలో చేనేత, రైతులు ఎదుర్కొంటున్న సమస్యలను పరిష్కరించి, ఆదుకుంటామని వాగ్ధానం చేసిన కాంగ్రెస్ ప్రభుత్వం అమలులో విఫలమైంది. ముందుగా వ్యవసాయ రంగానికి ప్రాధాన్యం ఇచ్చింది. దరిమిలా చేనేత రంగానికి కూడా కొంతమేరకు పాధాన్యం ఇవ్వటంవల్ల చేనేతకు సరైన ప్రోత్సాహం లభించటం లేదు.

సత్తెనపల్లి పట్టణంలోని రైల్వేస్టేషన్ సమీపంలో 1967లో పణిదెం చేనేత సహకార సంఘాన్ని ప్రారంభించారు. సంఘం నేడు అప్పుల ఊబిలో కూరుకుపోవటంతో కార్మికులు ఇబ్బందులు పడుతున్నారు. చేనేత వస్త్రాల ఉత్పత్తిలో తనదైన ప్రతిభను కనబరిచి విదేశాలలో సైతం నీరాజనాలు అందుకున్న పణిదెం చేనేత సహకారసంఘం నేడు పాలకుల విధానాలవల్ల కునారిల్లుతోంది. సంఘ ప్రారంభంలో 1975మంది సభ్యులు ఉండగా, 350 దాకా ఫ్రేమ్ మగ్గాలు, 900మంది కార్మికులు సంఘంలో పని చేసి జీవనోపాధి పొందేవారు. సత్తెనపల్లి, ఇరుకుపాలెం, రెంటపాళ్ళ, అబ్బూరు, లగడపాడు, గారపాడు, పెదకూరపాడు, నందిగామ, గుడిపూడి, మాదల గ్రామాల నుంచి కార్మికులు సత్తెనపల్లి వచ్చి సహకార సంఘంలో పనిచేసి జీవనోపాధి పొందేవారు. సహకార



పణిదెం చేనేత సహకార సంఘంలో ఉన్న నూలు

సంఘంలో తయారైన దుస్తులను రాష్ట్ర వ్యాప్తంగా అమ్మేందుకు 14 పట్టణాలలో డిపోలను ఏర్పాటుచేశారు. రెండు దశాబ్దాల పాటు ఎంతోచక్కగా నడిచిన సహకార సంఘం పాలకుల బాధ్యతారాహిత్యం కారణంగా నేడు నష్టాల ఊడిలో కూరుకుపోయింది. పనులు లేక చేనేత కార్మికులు పలువురు ఇతర వృత్తులకు వెళుతున్నారు.

సహకార సంఘ పరిధిలో ప్రస్తుతం 75 మగ్గాలు పనిచేస్తుండగా, 150మంది కార్మికులు ఉపాధి పొందుతున్నారు. సంఘం పూర్తిగా నడవాలంటే 15లక్షల రూపాయల వర్కింగ్ క్యాపిటల్ అవసరమని సంఘ అధ్యక్షుడు శివదుర్గారావు తెలిపారు. ఉన్న అప్పును రద్దుచేస్తే ఎక్కువమంది కార్మికులకు ఉపాధి కల్పించవచ్చునన్నారు. ఆర్థిక వనరులు లేకపోవటంతో అందరికీ ఉపాధి చూపలేకపోతున్నామన్నారు. నేతదుస్తుల ప్రాధాన్యం గురించి టివి, ఇతర ప్రసార సాధనాల ద్వారా ప్రచారం చేయాలని, సంఘాలకు నాబార్డ్ కల్పిస్తున్న నగదు పరిమితికి వడ్డీ 9%శాతం నుండి 14.5శాతం పెంచటం వల్ల సంఘాల నడ్డి విరుగుతుందన్నారు. చేనేత వస్త్రాల ఉత్పత్తిలో ప్రతిభ కనబరిచి విదేశాలలో సైతం నీరాజనాలు అందుకున్న పణిదెం చేనేత సహకార సంఘం అభివృద్ధికి ప్రభుత్వం కృషి చేయాలని పలువురు కోరుతున్నారు.



బావోజీపాలెం గ్రామం, అధ్వానంగా వున్న అంతర్గత రోడు, (అంతర్ చిత్రంలో) వాటర్ ట్యాంక్

# దేశ రక్షణే బావోజీపాలెం గ్రామస్తుల లక్ష్యం

(ఆఫ్‌లైన్- నిజాంపట్నం)

దేశరక్షణే లక్ష్యంగా నిజాంపట్నం మండలం భావోజి పాలెం గ్రామస్తులు జీవిస్తున్నారు. గ్రామంలో 400మంది సైనికులుగా పనిచేస్తున్నారు. ప్రతి ఇంట్లోనైనా వినిపించేది దేశ సౌభాగ్యపు ఊసులే. దేశరక్షణలో అసువులు బాసిన కుటుంబాలు సైతం మరొకరిని మిలటరీకి పంపించేందుకు సిద్ధం అవుతాయి. అందరూ ముస్లింలైనా ఇతర మతాలపై వ్యతిరేకత చూపరు. గ్రామంలో 200మంది మాజీ సైని కులుకాగా, 250మంది ప్రస్తుతం సైన్యంలో వివిధ ర్యాంకు లలో పనిచేస్తున్నవారు వున్నారు. 2055 మంది జనాభా వున్న బావోజీపాలెంలో 300 కుటుంబాలు వున్నాయి. 1982లో భారతసైన్యం బావోజీపాలెంను దత్తత గ్రామంగా ప్రకటించింది. కానీ, ఆనాటి నుంచి గ్రామాన్ని పట్టించు కున్న నాధుడేలేడు.

## అంతర్గత రోడ్లు అధ్వాన్నం



విశ్రాంత సుబేదార్ మేజర్ షేక్ షిలార్

పేరుకే దత్తత తీసుకున్నారుగాని, అంతర్గత రోడ్లు లేక వర్షాకాలంలో ఇబ్బందులు పడుతున్నాము. తాగునీ టికై గ్రామంలో నిర్మించిన మంచినీటి పథకానికి మరమ్మతులు చేయించాలి. గ్రామంలో సైనికోద్యోగులు వున్నప్పటికి ప్రత్యేక ఏర్పాట్లు చేయటంలో ప్రభుత్వాం నిర్లక్ష్యం వహిస్తోంది.

## క్యాంటిన్ ఏర్పాటు చేయాలి



మహ్మద్ జమాలుద్దీన్, మాజీ సైనికోద్యోగి

మాజీ సైనిక గ్రామంగా బావోజి పాలెంను ప్రభుత్వ రికార్డులలో గుర్తిం చినా నేటికీ క్యాం టిన్ ఏర్పాటు చేయ లేదు. గృహ అవసరాల కోసం బాపట్ల వెళ్ళాల్సి వస్తోంది.

## గృహనిర్మాణం చేపట్టాలి



మహ్మద్ గౌస్

గ్రామంలో నేటికీ పూరిళ్ళలో జీవిస్తు న్నవారే ఎక్కువగా వున్నారు. ప్రభుత్వం పూర్తి ఖర్చులతో గృహనిర్మాణం చేపట్టా లి. ఇందుకు ప్రత్యేక ప్యాకేజి ప్రకటించాలి.



నాగార్జునసాగర్ డ్యామ్

## మానవ నిర్మిత మహా కట్టడం

# ఈ నాగార్జున సాగరం

(ఆన్‌లైన్, మాచర్ల, విజయపురిసౌత్)

లక్షలాది ఎకరాల మెట్ట భూము లను సస్యశ్యామలం చేస్తూ ఆంధ్రా ప్రజానీకం కడుపునింపుతూ, విద్యుత్ వెలుగులను ప్రసరింపజేస్తూ వారి జీవి తాల్లో మమేకమైంది నాగార్జునసాగర్ డ్యామ్. జరజరా పరుగులిడుతున్న కృష్ణమ్మకు ముకుతాడేసి ఒడిసిపట్టిన ఈ డ్యామ్ నిర్మాణానికి పడిన శ్రమ అంతా ఇంతా కాదు. 1930లో నల్గొండ, ఖమ్మం జిల్లాల రైతులకు సేద్యపు నీటి సౌకర్యాన్ని కల్పించేం దుకు ఆనాటి నిజాం ప్రభుత్వం బ్రిటిష్ ప్రభుత్వ అనుమతి కోరింది. దీనికి తెల్లదొరలు అంగీకరించలేదు. 1948లో హైదరాబాద్ ప్రత్యేక రాష్ట్రంగా అవతరించాక సముద్ర మట్టానికి 546 అడుగుల ఆనకట్ట నిర్మించాలనే తలంపు కలిగింది. ప్రణా ళిక సంఘ కమిటీ 546 అడుగుల ఎత్తుగల ఆనకట్ట, కుడి, ఎడమ కాలు వలను నిర్మించాలని ఇచ్చిన సూచనల మేరకు అప్పటి చీఫ్ ఇంజనీర్ ఆలీవ వాచ్ జింగ్ ఈ డ్యామ్ నిర్మాణానికి రూపకల్పన చేశారు.

1955, డిసెంబరు 10న భారత తొలి ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ఈ మెగా ప్రాజెక్ట్ నిర్మాణానికి శంకుస్థాపన చేశారు. రోజుకు సుమారు 50 వేల మంది కూలీలు 12 సంవత్సరాల పాటు చెమటోడ్చడం మూలాన ప్రాజెక్ట్ నిర్మాణం పూర్త యింది. సాగర్ ప్రాజెక్ట్ పునాది నుంచి 408 అడుగుల ఎత్తు వుంది. ఈ ఆన కట్ట అడుగు భాగం 287 నుంచి 327 అడుగుల వెడల్పు వుంది. పై భాగాన్ని పరిశీలిస్తే 30.5 అడుగుల వెడల్పు, 4,756 అడుగుల నిడివి వుంటుంది. డ్యామ్‌ను 79 బ్లాక్‌లుగా విభజించారు. ఎడమ వైపు నాన్ ఓవర్ ఫ్లో సెక్షన్ 1394 అడుగులు, కుడి వైపు 1812 అడుగులు వుంటుంది. ఈ రెండు నాన్ ఓవర్ ఫ్లో సెక్షన్ల మధ్య 24వ బ్లాక్ నుంచి 50వ బ్లాక్ వరకు ఓవర్ ఫ్లో సెక్షన్‌ల నిడివి 1550 అడుగులు వుంటుంది. వీటి మధ్య 26 రేడియల్ క్రస్ట్ గేట్లను అమ ర్చారు. ఇవి 13.71, 13.41 మీటర్ల పొడవు, వెడల్పులు వుంటాయి. క్రస్ట్ గేట్ల అమరికకు కర్ణాటక, మహారాష్ట్ర ప్రభుత్వాలు తీవ్ర అభ్యంతరం వెలిబు చ్చినప్పటికీ కేంద్ర స్థాయిలో ప్రముఖ ఇంజనీర్ స్వర్గీయ కె.ఎల్.రావు కృషి మూలంగా వీటి నిర్మాణం పూర్త యింది.

రిజర్వాయర్ పూర్తిస్థాయి నీటి మట్టం 590 అడుగులు, 110 చదరపు మైళ్ళ విస్తీర్ణం కలిగి 405 టిఎంసిల నిలువ సామర్థ్యం కలిగి వుంది. దీనిలో 168 టిఎంసిల నీరు డెడ్ స్టోరేజ్‌గా వుంటుంది. ఈ రిజర్వాయర్ 23 లక్షల ఎకరాలకు సాగునీరు అందజేస్తోంది. అయితే, వర్షాభావ పరిస్థితులతో పాటు మరికొన్ని కారణాలవల్ల సామ ర్థ్యానికి తగిన స్థాయిలో ప్రస్తుతం నీటిని అందించలేకపోతోంది. ఈ నిర్మాణ సమయంలో సుమారు 50 వేల పై చిలుకు కూలీలు మృత్యువాత పడ్డట్లు తెలుస్తోంది. ముఖ్యంగా ఎడమ కాలువ టన్నెల్ అనేకసార్లు కూలి వందలాది మంది కార్మికులు దుర్మరణం పాలయ్యారు. వేలాది మంది కూలీలు అంగ వికలుర య్యారు. ఎన్ని ప్రమాదాలు ఎదురవు తున్నా, సాగర్ పనులకు వెళ్తే తిరిగొ స్తామో లేదో తెలీకున్నా, మొక్కవోని దీక్షతో శ్రమించి డ్యామ్ నిర్మాణం పూర్తి చేయడంలో కూలీల పాత్రే ప్రముఖ మైంది.

1967, ఆగస్ట్ 4న దివంగత ప్రధాని ఇందిరాగాంధీ కాలువలకు నీటిని విడుదల చేశారు. 1970నాటికి రేడి యల్ క్రస్ట్ గేట్లను కూడా అమర్చారు. డ్యామ్ పరిపూర్ణ నిర్మాణం 1974లో జరిగింది. తత్ఫలితంగా 23 లక్షల ఎక రాలకు సాగు నీరందించే మానవ నిర్మిత మహాసాగరం సిద్ధమైంది. రిజ ర్వాయర్ నుంచి కుడి, ఎడమ, మెయిన్ జలవిద్యుత్ కేంద్రాలు ఏర్పా టయ్యాయి. పూర్తి సామర్థ్యంతో పని చేస్తే కుడి కాలువపై నిర్మించిన జల విద్యుత్ కేంద్రం ద్వారా రోజుకు 90 మెగావాట్ల విద్యుదుత్పాదన, ఎడమ కాలువ జల విద్యుత్ కేంద్రం ద్వారా 60 మెగావాట్లు, మెయిన్ పవర్ హౌస్ ద్వారా 410 మెగావాట్ల విద్యుదుత్పా దన జరుగుతోంది.



ప్రాజెక్ట్ మోడల్‌ను పరిశీలిస్తున్న చాచా నెహ్రూ

### నీటి విభజన

కృష్ణా జల వివాద ట్రిబ్యునల్స్‌ను అనుసరించి మానవ వనరులకు విని యోగించుకొనే నిమిత్తం 2060 టిఎం సిల నీటిని మూడు రాష్ట్రాలు వాడుకో వచ్చు. ఇందులో ఆంధ్రప్రదేశ్‌కు 800 టిఎంసిలు, కర్ణాటకకు 695 టిఎం సిలు, మహారాష్ట్రకు 565 టిఎంసిల నీటిని కేటాయించారు. మన రాష్ట్రానికి కేటాయించిన 800 టిఎంసిలలో నాగార్జునసాగర్‌కు 264 టిఎంసిలను మాత్రమే కేటాయించారు.

### కుడి కాలువ (జవహర్ కెనాల్)

సాగర్ డ్యామ్ నిర్మాణం పూర్తవక మునుపే కుడి, ఎడమ కాలువల నిర్మా ణాలు పూర్తయ్యాయి. కుడి కాలువకు అప్పటి ఉప ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డి 1956, అక్టోబరు 10న

మిగతాది 37వ పేజీలో

# మానవ నిర్మిత మహా కట్టడం...

36వ పేజీ తరువాయి

శంకుస్థాపన జరుపగా, 1967 ఆగస్టు నాటికి పూర్తయింది. అదే నెల 4వ తేదీన ప్రధాని ఇందిరాగాంధీ ఈ కాలువ నుంచి నీటిని విడుదల చేసి, జాతికి అంకితమిచ్చారు. కుడి కాలువకు జవహర్ కెనాల్ అని నామకరణం చేశారు. దీని నిర్మాణానికి 1250 మంది కార్యాలయ సిబ్బంది, 4000 మంది సాంకేతిక సిబ్బంది, 40 వేల మంది కూలీలు శ్రమించారు. సాగర్ రిజర్వాయర్ నుంచి ఈ కాలువ హెడ్ రెగ్యులేటర్‌తో కూడిన 9 గేట్లను అమర్చారు. 245 మైళ్ళ పొడవున్న ఈ కాలువ గుంటూరు, ప్రకాశం జిల్లాల ద్వారా ప్రవహిస్తూ సోమశిల వద్ద వున్న పెన్నా నదిలో కలుస్తోంది. దీని ద్వారా 21 వేల క్యూసెక్కుల నీరు ప్రవహిస్తోంది. ఇది సుమారు 20 లక్షలకు పైగా ఎకరాల భూమికి సేద్యపు నీటిని అందిస్తోంది. ఈ కుడి కాలువ చంద్రవంక, నాగులేరు, గుండ్లకమ్మ, బుగ్గేరు తదితర 178 పెద్ద, చిన్న వాగులను దాటుతూ ప్రవహిస్తోంది.

### ఎడమ కాలువ (లాల్ బహదూర్ కెనాల్)

జై జవాన్, జై కిసాన్ అని నినదించిన మాజీ ప్రధాని లాల్ బహదూర్ శాస్త్రి స్మృత్యర్థం సాగర్ ఎడమ కాలువకు ఆయన పేరు పెట్టారు. ఈ కాలువ కొద్ది దూరం ప్రవహించాక పొట్టిచలమ నుంచి చలకుర్తి వరకు కొండల అడుగు భాగంలో తొలచిన సొరంగం ద్వారా ప్రయాణిస్తోంది. 32 అడుగుల వ్యాసం, 8,465 అడుగుల నిడివి కలిగిన సొరంగ మార్గాల ద్వారా సాగునీరు ప్రవహించే కాలువల్లో ఇది దేశంలోనే అతి పెద్దదిగా చెప్పవచ్చు. 1959లో అప్పటి రాష్ట్ర గవర్నర్ భీమసేన్ సచార్ ఈ కాలువకు శంకుస్థాపన జరుపగా, కుడి కాలువతో పాటే 1967, ఆగస్టు 4న శ్రీమతి ఇందిరా గాంధీ దీనికి ప్రారంభోత్సవం జరిపారు. ఈ కాలువ 218మైళ్ళ దూరం ప్రవహిస్తూ హాలియా, గడవరం, వైరా, కట్టలేరు, తమ్మిలేరు తదితర 138 వాగులను దాటుకుంటూ నల్లగొండ, ఖమ్మం, కృష్ణా జిల్లాల్లోని మెట్ట భూములను సస్యశ్యామలం చేస్తూ పశ్చిమ గోదావరి జిల్లాలోని ఎర్ర కాలువలో కలుస్తోంది. దీని నిర్మాణానికి 900మంది కార్యాలయ, 2,500 మంది సాంకేతిక సిబ్బంది, 30 వేల మంది కార్మికులు పదేళ్ళ పాటు పనిచేశారు. ఈ కాలువల ద్వారా 1500 క్యూసెక్కుల నీరు ప్రవహిస్తోంది. దీని ద్వారా 8 లక్షల 75 వేల ఎకరాలకు సాగునీరు లభ్యమవుతోంది.



కుడి కాలువ ప్రారంభోత్సవ అనంతరం బహిరంగ సభలో ప్రసంగిస్తున్న ఇందిరాగాంధీ, పక్కన కాసు బ్రహ్మానందరెడ్డి, గౌతు లచ్చన్న, తదితరులు



డ్యామ్ నిర్మాణ పనుల్లో నిమగ్నమైన కూలీలు

# కనుమరుగవుతున్న విస్తళ్ళ తయారీ...

34వ పేజీ తరువాయి

పరిశ్రమగా గుర్తించాలని పలువురు కోరుతున్నారు.



ఎగుమతికి సిద్ధంగా వున్న విస్తళ్ళు

### వంద విస్తళ్ళకు రూ.10 మాత్రమే



కె నాగేశ్వరమ్మ

కష్టించి ముడిసరుకు సేకరించి వంద విస్తళ్ళు తయారు చేస్తే పది రూపాయలకు మాత్రమే కొనుగోలు చేస్తున్నారని కేశాని నాగేశ్వరమ్మ అనే మహిళ తెలిపింది. భార్యభర్తలం కలసి రోజంతా కుట్టడం ద్వారా చెరొక 60 రూపాయలు రావటం కష్టమవుతుందని ఆమె తెలిపింది.

### ఒకప్పుడు మంచి గిరాకీ



వాకా జయలక్ష్మి

అరటి బొత్తలతో తయారుచేసిన విస్తళ్ళకు ఒకప్పుడు మంచి గిరాకీ వుండేది. చేపల ఎగుమతులకు ఇచ్చితంగా ఈ విస్తళ్ళను వినియోగించే వారు. దీంతో డిమాండ్ దృష్ట్యా లారీల లో ఎగుమతి చేసే వారు.

### కాల్వ కట్టలపై జీవిస్తున్నాం



వాకా గోపెమ్మ

ఎన్నో ఏళ్ళుగా విస్తళ్ళ తయారీ ద్వారా జీవనం సాగిస్తున్న తమకు సొంత స్థలాలు లేక కట్టలపై జీవిస్తున్నాం. డ్వాక్రా సంఘాలలో వున్న తమ కుటుంబాలకు చెందిన మహిళలకు కుటీరపరిశ్రమ రుణాలు మంజూరు చేయాలి.











12 సంవత్సరాల జువ్విచెట్టు



16 సంవత్సరాల ఫైకస్‌నూడా వృక్షము



12 సంవత్సరాల మర్రిచెట్టు



బోన్సాయ్ మొక్కలతో ఆకురాతి నాగమల్లేశ్వరరావు, రమాదేవి దంపతులు

## బోన్సాయ్ మొక్కల పెంపకంలో

# 'ఆకురాతి' దంపతులు

సమాజానికి ఉత్తమ పౌరులను అందించటమేగాక, ప్రకృతిగా పెరటిలో బోన్సాయ్ మొక్కలుపెంచిన ఉపాధ్యాయులు ఆకురాతి నాగమల్లేశ్వరరావు, రమాదేవి ఆదర్శ దంపతులు పలువురి మన్ననలు చూరగొంటున్నారు. వృక్ష శాస్త్రాన్ని చదివిన విజ్ఞానంతో నాగమల్లేశ్వరరావు చిన్ననాటి నుంచి మొక్కలు పెంపకం, పురాతన నాణెములు, స్టాంపులు సేకరించడం అతని హాబీ. తాను సేకరించిన నాణెములు, స్టాంపులు, బోన్సాయ్ మొక్కలను జిల్లా, రాష్ట్ర స్థాయి ఎగ్జిబిషన్‌లో ప్రదర్శించి ఉన్నతాధికారులు, ప్రజాప్రతినిధుల మన్ననలు పొందారు. వందకు పైగా బోన్సాయ్ మొక్కలు పెంపకంలో భర్తకు భార్య రమాదేవి తనవంతు సహకారం అందిస్తున్నారు. ప్రతిరోజు ఉదయం దంపతులు ఇరువురు తమ పిల్లలను ఎలా సంరక్షించుకుంటారో అదేవిధంగా బోన్సాయ్ మొక్కలకు నీళ్ళుపెట్టడం, సేంద్రియ ఎరువులు వేయటం, అంటుకట్టడం, కుండీలు ఏర్పాటు చేయటం లాంటి పనులు చేసి కంటికి రెప్పలా పెంచుతున్నారు. 20 సంవత్సరాల మొక్కను సైతం చిన్నకుండీలో ఆకర్షణీయంగా అమర్చటంలో ఎంతో నైపుణ్యాం ప్రదర్శిస్తున్నారు. గార్డెన్ (మిగతా 39లో)

# బోన్సాయ్ మొక్కల పెంపకంలో 'ఆకురాతి' దంపతులు


10 సంవత్సరాల ఫైకస్ జాతి వృక్షం


14 సంవత్సరాల యూకా చెట్టు


10 సంవత్సరాల ఎడీనియం చెట్టు

(38వ పేజీ తరువాయి)

పెంపకంలో అలుపెరగని ఈ దంపతులు సెలవు రోజుల్లో మొక్కలను కత్తిరించటం, కుండీలు ఏర్పాటు చేయటం వంటి పనులలో నిమగ్నమవుతారు. అంతేగాక ఉపాధ్యాయురాలు రమాదేవి విద్యాశాఖ తరుపున సర్వశిక్ష అభియాన్, బడిబాట తదితర కార్యక్రమాలను ప్రభుత్వం ఏర్పాటు చేసిన పలు సాంస్కృతిక కార్యక్రమాలను మండలంలోని ప్రాథమిక పాఠశాలలో మాటల రూపంలో విద్యార్థులకు అవగాహన కలిగించారు. ఉపాధ్యాయ వృత్తిలో అంకితభావంతో పనిచేస్తూ మొక్కల పెంపకంలో తమకంటూ ఒక ప్రత్యేకతను చాటుకున్నారు. మర్రి, నేరేడు, జామ, యూకలిప్టస్, సపోటా, మామిడి, జువ్వి, రణపాల, జేడ్ వృక్షము, ఫైకస్ జాతి వృక్షం, యూకా, ఎడీనియం, ఫైకస్‌నూడా తదితర వందలాది మొక్కలను పెంచుతూ తమ పెరటిలో బోన్సాయ్ గార్డెన్‌ను ఏర్పాటు చేసిన ఆకురాతి నాగమల్లేశ్వరరావు, రమాదేవి దంపతులు పలువురికి ఆదర్శనీయులు.

– అజయ్‌బాబు, చెరుకుపల్లి


14 సంవత్సరాల వయస్సు వున్న ఫైకస్, జువ్వి జాతి వృక్షములు

# సహకారోద్యమానికి తలమానికం తెనాలి

రైతు దేశానికి అన్నదాత మాత్రమే కాదు. దేశ ఆర్థిక వ్యవస్థలో కీలకమైన వ్యక్తి. మనదేశ ఆర్థిక వ్యవస్థకు వెన్నుదన్నుగా నిలుస్తున్న రైతాంగం తరతరాలుగా రుణ భారంతో కృంగిపోవడాన్ని అరికట్టి తద్వారా సర్వతోముఖ గ్రామీణ వికాసానికి బాట వేయాలని మేథావులలోను, ప్రభుత్వంలోను గత శతాబ్ద కాలంలో కలిగిన ఆలోచన ఫలితమే సహకారోద్యమ ఆవిర్భావం. పెట్టుబడుల కోసం దేబిరించాల్సిన దుస్థితిలో రైతాంగం ప్రప్రథమంగా 1904లో తీసుకువచ్చిన అఖిల భారత సహకార చట్టం సహకారోద్యమానికి చేయూతనిచ్చి ముందుకు నడిపించింది. నిస్వార్థపరులైన నాయకులు, గ్రామీణ యువకులు చట్టం ఇచ్చిన చేయూతతో ఉద్యమంలో పాల్గొని పలు సహకార పరపతి సంఘాలను స్థాపించారు.

మన జిల్లాలో ప్రథమంగా 1906 అక్టోబరు 21వ తేదీన సూరేపల్లిలో సహకార పరపతి సంఘం రిజిస్టరై జిల్లా వ్యాప్తంగా పని చేయడం ప్రారంభించాయి. తెనాలి డివిజన్‌లో తొలిసారిగా స్వర్గీయ కొమ్మూరు కాశీ విశ్వనాధం 1906 జనవరి 15న తెనాలి అర్బన్ బ్యాంక్‌ను స్థాపించి సహకారోద్యమానికి శ్రీకారం చుట్టారు. 1904లో సహకార చట్టం అమలులోకి వచ్చిన వెంటనే తొలి సహకార రిజిస్ట్రార్ ఆర్.రామచంద్రరావు తెనాలి డివిజన్ అంతటా విస్తృతంగా పర్యటించి గ్రామాలలోని రైతులను, ఉత్సాహవంతులను ప్రోత్సహించి సహకార సంఘాల స్థాపనకు వారిని కార్యోన్ముఖులను చేయడంతో గ్రామాలలో సంఘాలు ఆవిర్భవించాయి. పరస్పర సహకారమే శ్రేయోదాయకం అన్న మూలసూత్రంపైన సహకార సంఘ పునాదులు ఏర్పడ్డాయి. ఆర్థిక సమానత్వం, వ్యాపార వ్యవహారాలలో పోటీ నివారణ, వ్యక్తి సంఘానికి - సంఘం అందరికీ అనే పవిత్ర ఆశయాలతో సహకార నిర్మాణం ఆరంభమైంది. ప్రజా బాహుళ్యం నుంచి డిపాజిట్ల రూపేణా సేకరించిన నిధులతో సహకార సంఘాలకు ఆర్థిక వనరులు సమకూర్చి సహకారోద్యమాన్ని పటిష్టవంతం చేయాలనే ధ్యేయంతో ఆనాటి ఆవిభక్త మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం జిల్లా సహకార బ్యాంకుల స్థాపనకు నడుం బిగించింది. అందులో భాగంగా ఆంధ్రప్రదేశ్‌లో మొట్టమొదటిసారిగా గుంటూరు జిల్లా కేంద్ర సహకార బ్యాంకు వెలసింది. గుంటూరు జిల్లాలో అన్ని రంగాలలో ముందంజ వేసిన తెనాలి పట్టణంలో



తెనాలి సహకార బ్యాంకు కార్యాలయం వద్ద ప్రతిష్ఠించిన ఆలపాటి వెంకట్రామయ్య విగ్రహం, వెనుక నిర్మాణంలో ఉన్న సహకార బ్యాంకు నూతన భవనం

కఠెవరానికి చెందిన గోళ్ళమూడి సూర్యనారాయణ చీఫ్ ప్రమోటర్‌గా 1904 భారత సహకార చట్టం కింద 1910 నవంబరు 28న ఈ బ్యాంక్ తెనాలి డిస్ట్రిక్టు అర్బన్ బ్యాంక్‌గా రిజిస్టరై, ఆ మరుసటి సంవత్సరం మార్చి 17 నుంచి పని చేయనారంభించింది. అదే రోజున తెనాలి తాలూకా నుంచి 77 మంది, రేపల్లె తాలూకా నుంచి 50 మంది, మరో 16 మంది ప్రభుత్వోద్యోగులతో తొలి మహాసభ జరిగింది. ఈ పెద్దల పెట్టుబడి ధనమే బ్యాంకుకు మూలధనమైంది. అప్పుడే జంపాల వెంకట సుబ్బారాయుడు అధ్యక్షునిగా మొదటి పాలకవర్గం ఎన్నికైంది. బ్యాంక్ పని చేయడం ప్రారంభించిన తర్వాత 1911 మే ఏడవ తేదీన వెంబాకం దేశికాచారి 20 వేల రూపాయలు డిపాజిట్ చేశారు.

1916లో బ్యాంకు పేరు గుంటూరు జిల్లా కో-ఆపరేటివ్ బ్యాంకింగ్ యూనియన్ లిమిటెడ్ గాను, 1928లో గుంటూరు జిల్లా కో-ఆపరేటివ్ బ్యాంక్ గాను, 1933లో గుంటూరు జిల్లా కేంద్ర సహకార బ్యాంక్‌గా మారి ప్రస్తుతం అదే పేరుతో కొనసాగుతోంది. జంపాల వెంకట సుబ్బారాయుడు అధ్యక్షునిగా ఉన్న పాలక వర్గం 1911 నుంచి మూడేళ్ల పాటు పని చేసింది. బ్యాంకు స్థాపన జరిగిన తర్వాత సహకార వ్యవస్థ పుంజుకుని అప్పటి వరకు గ్రామాలలో పనిచేస్తున్న సహకార సంఘాలు బ్యాంకు సభ్యత్వాన్ని పొంది ఆర్థిక సహాయం అందుకోవడం ప్రారంభించాయి. వెంకట సుబ్బారాయుడు తర్వాత 1914 - 18 కాలంలో గోళ్ళమూడి సూర్యనారాయణ బ్యాంకు పాలకవర్గ అధ్యక్షునిగా వ్యవహరించారు. ఆ తర్వాత యల్లంరాజు వెంకట సుబ్బారావు, లక్కరాజు సంగమేశ్వరరావు, లక్కరాజు రామకృష్ణయ్య పంతులు, కొండముది శ్రీరాములు పంతులు, గాదె సింహాచలం పంతులు, కొప్పువరపు వెంకట్రావు, డాక్టర్ కాకుమాను వుళ్ళక్కి, జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి, గాదె నరసింహం పంతులు, మంగళగిరి పరవస్తుదాసు, దాసరి శ్రీమన్నారాయణ చౌదరి, ఆలపాటి వెంకట్రామయ్య, కన్నెగంటి రెడ్డెమ్మ, కాసు వెంగళరెడ్డి, పుతుంబాక శ్రీరాములు, వెనిగళ్ళ సత్యనారాయణ, నూతలపాటి హనుమంతరావు, మారౌతు సీతారామయ్య, గుంటుపల్లి వెంకట అప్పారావు, మానం వెంకటేశ్వర్లు జిల్లా కేంద్ర సహకార బ్యాంకు అధ్యక్షులుగా పని చేశారు. ప్రస్తుతం నల్లపాటి శివరామ చంద్రశేఖరరావు ఛైర్మన్‌గా వ్యవహరిస్తున్నారు.

రాష్ట్రంలోని ఉన్నతమైన సహకార బ్యాంకులలో ఒకటిగా ఈ బ్యాంకును తీర్చిదిద్దిన (మిగతా 42వ పేజీలో)

# భక్త జనులకు పెన్నిధి

## వైకుంఠ పురం సన్నిధి



తెనాలి వైకుంఠపురంలోని శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వామి వారి దేవస్థానం

కళలకు కాణాచిగా, ధర్మ దాతృత్వాలకు పెన్నిధిగా, ఆంధ్రా ప్యారిస్‌గా ఖ్యాతినార్జించిన తెనాలి పట్టణంలో అంతర్భాగమై, రేపల్లె రైల్వే బ్రిడ్జి సమీపంలోని వైకుంఠపురంలో నిర్మితమైన శ్రీలక్ష్మీపద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వామి దేవస్థానం రాష్ట్రంలోని దివ్య క్షేత్రాలలో ఒకటిగా ప్రసిద్ధికెక్కింది. శాంతికి, ప్రశాంతికి నిలయమైన వాతావరణంలో నిర్మించబడిన ఈ దేవాలయం కమనీయంగాను, కన్నుల పండువగాను, కామితార్థదాయకంగాను విలసిల్లుతోంది.

నిత్య కల్యాణం పచ్చతోరణంగా విలసిల్లే శ్రీ వేంకటేశ్వరుడు భక్తాభీష్ట వరదుడై లక్ష్మీపద్మావతీ సమేతంగా పరమ ప్రసన్న శోభలు చిందిస్తూ బహుముఖ వైభవోపేతుడై విరాజిల్లుతున్నాడు. రాష్ట్రంలోని వేలాది భక్తులకు ఈ క్షేత్రం పవిత్ర యాత్రా స్థలమై వేనోళ్ళ కొనియాడబడుతున్నది. అపర తిరుపతిగా పిలువబడే వైకుంఠపురం దేవస్థానంలో స్వస్తిశ్రీ పరీధావీ నామ సంవత్సరం నిజ వైశాఖ బహుళ పంచమి శుక్రవారం స్వామి వారి విగ్రహ ప్రతిష్ఠ జరిగింది. అంతకు ముందు ఈ క్షేత్రానికి సంబంధించిన ప్రాశస్త్యం ఇలా ఉంది.

దేవస్థానం సంస్థాపకులైన తుళ్ళూరు బాల నరసింహారావు గౌడ్‌కు శ్రీవేంకటేశ్వరస్వామి నాగేంద్రుని రూపంలో స్వప్నంలో సాక్షాత్కరించి వైకుంఠపుర స్థలం పరమ పవిత్రమైనదని, ఇక్కడ తనకో దేవాలయాన్ని నిర్మించవలసిందిగా ఆజ్ఞాపించి అంతర్ధానమయ్యారు. ఈ స్వప్నం ఫలితంగా బాల నరసింహారావు గౌడ్ సంఘ సేవ పరాయణులతో కలిసి దేవాలయ నిర్మాణానికి

(మిగతా 42వ పేజీలో..)

# సహకారోద్యమానికి తలమానికం...

(40వ పేజీ తరువాయి)

మహనీయులలో స్వర్గీయ ఆలపాటి వెంకట్రామయ్య, కాసు వెంగళరెడ్డి, వెనిగళ్ళ సత్యనారాయణలను ప్రముఖులుగా చెప్పవచ్చు. ఆలపాటి వెంకట్రామయ్య 1950 నుంచి 62 వరకు బ్యాంకు అధ్యక్షునిగా వ్యవహరించి బ్యాంకు కార్యకలాపాలను విస్తరింపచేశారు. బ్యాంకు చరిత్రలోనే ఆలపాటి పాలనాకాలం సువర్ణాక్షరాలతో లిఖించదగినది. ఆయన యాజమాన్యంలో బ్యాంకు స్వరతోముఖాభివృద్ధి చెందడమే కాక సహకారోద్యమానికి ఒక విశిష్ట స్థానం సమకూర్చింది. డిపాజిట్ల సేకరణ, ఇతరత్రా గాని ఆలపాటి హయాంలో బ్యాంకు గణనీయమైన అభివృద్ధి సాధించింది. 1950లో ఆయన పదవి చేపట్టే సమయానికి మూడు లక్షల షేరు ధనం పదేళ్లకు 18 లక్షల 50 వేలకు పెరిగింది. బ్యాంకు వ్యాపారం 59 లక్షల నుంచి కోటి 86 లక్షల రూపాయలకు చేరుకుంది. తక్కువ ఆదాయం గల వర్గాలకు గృహ వసతి కల్పించాలన్న సంకల్పంతో శ్రీవెంకటేశ్వర కో-ఆపరేటివ్ హౌస్ బిల్డింగ్ సొసైటీ స్థాపనకు ప్రోత్సాహాన్నిచ్చారు. అయితే వెంకట్రామయ్య మరణానంతరం ఈ సంస్థలు మూలనపడ్డాయి. అది నుంచి చేస్తూ బ్యాంకు అధ్యక్షునిగా పనిచేసిన వారు అత్యధికులు తెనాలి డివిజన్‌కు చెందిన వారే ఉండటం విశేషం. విస్తృతమైన మాగాణి భూములు కలిగి ఉన్న కారణంగా ఈ ప్రాంతంలో రైతుల అవసరాలను తీర్చేందుకు సహకార వ్యవస్థ బాగా వేళ్ళూనుకుంది. తెనాలి ప్రాంతంలో సహకార ఉద్యమ వ్యాప్తికి ఆచార్య రంగా, కల్లూరి చంద్రమౌళి, మంతెన వెంకట్రాజు, నన్నపనేని వెంకట్రావు, పుతుంబాక శ్రీరాములు, వెలువోలు సీతారామయ్య, వెనిగళ్ళ సత్యనారాయణ, ధాసరి వెంకట సుబ్బారావు, చింతమనేని శివరామయ్య చౌదరి, గట్టినేని కోటయ్య చౌదరి విశిష్ట సేవలందించారు.

తెనాలి అర్బన్ బ్యాంక్, విశ్వనాధ్ కో-ఆపరేటివ్ బిల్డింగ్ సొసైటీల అభివృద్ధికి నిర్విరామ కృషి చేశారు. ప్రస్తుతం పాత భవనం స్థానంలో నూతన భవనం నిర్మాణం జరుపుకుంటూ, సహకార బ్యాంకు అభివృద్ధిపథంలో పయనిస్తున్నది.

(యార్లగడ్డ శరత్‌బాబు - తెనాలి)

# భక్త జనులకు పెన్నిధి...

(41వ పేజీ తరువాయి)

సంకల్పించారు. లక్ష్మీ పద్మావతీ సమేతంగా స్వామి వారి విగ్రహాలను తయారు చేయించి ఒక శుభ ముహూర్తాన ప్రతిష్ఠించారు. అప్పటి నుంచి ఈ క్షేత్ర మహత్యం దిన దిన ప్రవర్ధమానమై లక్షలాది మంది భక్తులు ఇక్కడకు వచ్చి స్వామి వారిని దర్శించి తరిస్తున్నారు.

దేవస్థాన వ్యవస్థాపకులు బాల నరసింహారావు గౌడ్ స్వామి వారిని సందర్శించడానికి వచ్చే భక్తుల రాకపోకలకు వీలుగా దేవస్థానం స్థలం పక్కనే ప్రవహిస్తున్న తూర్పు కాల్వపై కాలి వంతెన నిర్మించారు. కాలక్రమంలో భక్తుల రద్దీ పెరగడంతో కాలి వంతెనకు ఎగువన పెద్ద వంతెన నిర్మించారు. అనతి కాలంలోనే దేవస్థానం గణనీయమైన అభివృద్ధి సాధించింది. ప్రతి సంవత్సరం ఇక్కడ దాదాపు రెండు వేలకు పైగా వివాహాలు స్వామి వారి సన్నిధిలో జరుగుతుంటాయి. దూర ప్రాంతాల నుంచి వచ్చే భక్తుల కోసం వివాహాలు, అన్నప్రాసనలు జరుపుకునే భక్తుల కోసం అన్ని సదుపాయాలు ఉన్నాయి. దేవస్థానం ఆవరణలో విశాలమైన పొంగలి షెడ్డు, కళ్యాణ మండపాలు ఉన్నాయి. భక్తులు మొక్కుబడులు చెల్లించేందుకు ఎల్లప్పుడు నీటి వసతి గల ప్రత్యేక కేశ ఖండన శాల ఉంది.

క్రేన్ సంస్థల అధినేత గ్రంధి సుబ్బారావు స్వామి వారికి రాజగోపురం నిర్మించారు. భక్తుల సహకారంతో స్వామి వారికి బంగారు కిరీటం, శ్రీస్వామి, అమ్మవార్లకు రజత వస్త్రాలు, రజత మకర తోరణాలు, రజత పాద పీఠాలు అలంకరించారు. శ్రీనివాసుని దర్శించ వచ్చే భక్త జనులకు తిరుమలలో మాదిరిగా శాశ్వత నిత్యాన్నదాన పథకాన్ని వైకుంఠపురం దేవస్థానంలో అమలు చేస్తున్నారు. ఎంతో మంది దాతలు ఈ పథకానికి విరాళాలు అందిస్తున్నారు. దాతల విరాళాలను శాశ్వత నిత్యాన్నదాన పథకం కింద బ్యాంకులలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేసి తద్వారా వచ్చే వడ్డీతో నిత్యాన్నదాన కార్యక్రమం నిర్వహిస్తున్నారు. సాధారణ భక్తులు కూడా ఈ పథకంలో పాలుపంచుకుని వారి సహాయాన్ని అందించాలనే ఉద్దేశ్యంతో దేవస్థానం వారు విరాళాల పరిధిని గణనీయంగా విస్తరించారు. ఏటా స్వామి వారి బ్రహ్మోత్సవాలు, తెప్పోత్సవం, ఇతర ఉత్సవాలు వైభవంగా జరుగుతుంటాయి.

(యార్లగడ్డ శరత్‌బాబు - తెనాలి)

# శత వసంతాల తెనాలి మున్సిపాలిటీ



రాజకీయ, వాణిజ్య, వ్యవసాయ రంగాలలోనే కాక సంగీత, నాటక, వైజ్ఞానిక, శాస్త్ర సాంకేతిక, సినీ, కళా, సాహితీ, సాంస్కృతిక రంగాల్లో పేరెన్నిక గన్న తెనాలి పట్టణం ఆంధ్రా ప్యారిస్‌గా రాష్ట్రంలోనే ఒక ప్రత్యేకత సంతరించుకుంది. వివిధ రంగాల్లో ఎందరో ఉద్దండుల్ని తీర్చిదిద్దింది. స్వాతంత్రోద్యమంలో కీలకపాత్ర వహించింది. వివిధ రంగాల్లో నేటికీ తెనాలి తన సంప్రదాయాన్ని, ప్రత్యేకతను, విలక్షణ సంస్కృతిని నిలబెట్టుకుంటూనే ఉంది. ప్రస్తుతం జిల్లాలో అతి పెద్ద మున్సిపాలిటీగా ఉన్న తెనాలి ఒకనాడు మైనర్ పంచాయతీగా ఉండి, ఆ తర్వాత మేజర్ పంచాయతీ స్థాయికి ఎదిగి 1909లో మున్సిపాలిటీగా మారింది. తెనాలి మున్సిపాలిటీ ఆవిర్భవించి 100 సంవత్సరాలు పూర్తయిన సందర్భంగా శతాబ్ది ఉత్సవాలను ఘనంగా నిర్వహించారు. 1965 నుంచి స్పెషల్ గ్రేడ్ మున్సిపాలిటీ స్థాయి వచ్చింది. ఈ మున్సిపాలిటీకి తొలి ఛైర్మన్‌గా డిప్యూటీ కలెక్టర్ పి.నాగేశ్వరరావు పంతులు 1910 నుంచి 1912 వరకు పని చేశారు. తర్వాత పి.కామరాజు పంతులు (1912), సి.భక్తవత్సలం నాయర్ (1913-16) నియమితులు కాగా, ఆ తర్వాత సీవీ సుబ్రహ్మణ్యశాస్త్రి ఛైర్మన్‌గా ఎన్నికయ్యారు. (1920-21) పిల్లలమర్రి ఆంజనేయులు పంతులు (1921 నుంచి 1925 వరకు) సాహితీవేత్త, సంస్కర్త త్రిపురనేని రామస్వామి 1934లో ఎన్నికై 1938 వరకు ఛైర్మన్‌గా పని చేశారు. స్వాతంత్ర్య సమరయోధుడు రావి సత్యనారాయణ 1938లో ఎన్నికై 1943 వరకు, మళ్ళీ 1948లో ఎన్నికై 1949 వరకు పని చేయగా, 1943 నుంచి 1944 వరకు షేక్ అబ్దుల్ వహాబ్ సాహెబ్, 1944 నుంచి 1945 వరకు కన్నెగంటి వీరయ్య, 1946 నుంచి 1947 వరకు న్యాయవాది వేదాంతం లక్ష్మీనారాయణ ఛైర్మన్‌గా వ్యవహరించారు.

స్వాతంత్ర్యం తర్వాత 1949 నుంచి 1952 వరకు, 1952 నుంచి 1955 వరకు, తిరిగి 1956 నుంచి 1958 వరకు సామ్యవాది నన్నపనేని వెంకట్రావు మూడు పర్యాయాలు ఛైర్మన్‌గా ఎన్నికయ్యారు. హేతువాది, హ్యూమనిస్టు ఉద్యమ ప్రముఖుడు, న్యాయవాది ఆవుల గోపాలకృష్ణమూర్తి 1955 నుంచి 1956 వరకు ఛైర్మన్‌గా ఉన్నారు. ఇక, ఆలపాటి వెంకట్రామయ్య 1959లో ఛైర్మన్‌గా ఎన్నికై, 1962లో మున్సిపాలిటీ శాఖ మంత్రిగా నియమితులు కావడంతో ఈ పదవికి రాజీనామా చేశారు. ఆ మీదట తవ్వా శ్రీరాములు 1962 నుంచి 1964 వరకు ఛైర్మన్‌గా పని చేశారు. 1967 నుంచి 1972 వరకు బండ్ల పుల్లయ్య, 1981 నుంచి 1982 వరకు అన్నాబత్తుని సత్యనారాయణ, 1982 నుంచి 1986 వరకు, తిరిగి 1987 నుంచి 1992 వరకు డాక్టర్ రావి రవీంద్రనాథ్, 1995 నుంచి 2000 వరకు ఆలమూరి విజయలక్ష్మి కుమారి ఈ పదవిని అధిష్ఠించారు. 2000 నుంచి 2005 మార్చి వరకు యడ్ల గంగాధరరావు కొనసాగారు. తర్వాత డాక్టర్ తాడిబోయిన మస్తానమ్మ, ఉమ్మలనేని జానకీ రామచంద్రరావు, దొడ్డక సీతామహాలక్ష్మి ఛైర్‌పర్సన్లుగా వ్యవహరించారు. గతంలో ఆలపాటి వెంకట్రామయ్య, నన్నపనేని వెంకట్రావు, అన్నాబత్తుని సత్యనారాయణల హయాంలో పట్టణంలో గణనీయమైన అభివృద్ధి జరిగిందనే చెప్పాలి. ఆలపాటి హయాంలో ఓవర్‌బ్రిడ్జి నిర్మాణం, మున్సిపల్ కార్యాలయ భవనానికి నిధులు మంజూరు, భూగర్భ మురుగుపారుదల పథకానికి ఆమోదం, అదేవిధంగా రక్షిత మంచినీటి పథకానికి నిధుల విడుదల, 1942 క్విట్ ఇండియా ఉద్యమ అమర వీరుల స్థూపాల నిర్మాణం, జెఎంజె మహిళా కళాశాల, ప్రభుత్వ ఐటిఐ ఏర్పాటు జరిగాయి. నన్నపనేని వెంకట్రావు హయాంలో పటిష్టమైన సిమెంట్ రోడ్ల నిర్మాణం జరిగింది. పేదల పూరిళ్లపై పన్నును నన్నపనేని రద్దు చేశారు. సైకిళ్లు, ఎడ్లబండ్లపై పన్ను రద్దు పర్చారు. పట్టణ మాస్టర్ ప్లాన్ ఆయన రూపొందించారు. అన్నాబత్తుని సత్యనారాయణ హయాంలో ప్రధాన వీధుల్లో ఆక్రమణల్ని సాహసోపేతంగా తొలగించి వీధుల్ని విశాల పర్చారు. నిర్మాణం పనుల్లో నిర్దుష్టమైన నాణ్యత ఉండేలా చూశారు. ఆయన హయాంలో పువ్వేదిక, పండ్ల మార్కెట్ ఏర్పాటయ్యాయి. త్రిపురనేని రామస్వామి హయాంలో గాంధీ మున్సిపల్ కూరగాయల మార్కెట్ ఏర్పాటైంది. జాతరలు, జంతు బలుల నిషేధం అమలైంది. డాక్టర్ రావి రవీంద్రనాథ్ హయాంలో మరుగు దొడ్లు, రోడ్ల నిర్మాణం, మురికి వాడల్లో అభివృద్ధి పనులు చేశారు. యడ్ల గంగాధరరావు హయాంలో మున్సిపల్ ఆదాయాన్ని పెంచే షాపింగ్ కాంప్లెక్సుల నిర్మాణం, మురికి వాడల అభివృద్ధి, ఏపీయూఎస్పీ నిధులు, పట్టణంలో 90 శాతం సిమెంట్ రోడ్ల నిర్మాణం జరిగింది. గడచిన కౌన్సిల్ హయాంలో ఆరు కోట్ల రూపాయల వ్యయంతో అధునాతన కూరగాయల మార్కెట్, 90 కోట్లతో పట్టణానికి కృష్ణా జలాలను అందించే మంచినీటి పథకం పనులు ప్రారంభమయ్యాయి. ఇలా తెనాలి ఛైర్మన్లుగా పని చేసిన వారంతా వారి హయాంలో పట్టణాభివృద్ధికి ఎంతో కృషి చేశారు.



తెనాలిలో ప్రతిష్ఠించిన తెనాలి రామలింగ కవి విగ్రహం

(యార్లగడ్డ శరత్‌బాబు - తెనాలి)

# ప్రసిద్ధ క్షేత్రం గుత్తికొండ బిలం

(ఆన్‌లైన్, పిడుగురాళ్లరూరల్)

పిడుగురాళ్ల మండలం గుత్తికొండ గ్రామానికి ఐదు కిలోమీటర్ల దూరంలో కొండల మధ్య ప్రకృతి శోభతో బిలం ప్రసిద్ధక్షేత్రంగా అలరారుతోంది. దక్షిణ కాశీగా పిలువబడే బిలం నుంచి కాశీకి జయమార్గం వుందని ప్రతీతి. పూర్వం ముచికుందుడనే మహర్షి శ్రీ కృష్ణుని సాక్షాత్కారానికై తపస్సు చేశారని గ్రంథాల ద్వారా తెలుస్తోంది. పల్నాటి వీరుడు బ్రహ్మనాయుడు యుద్ధానంతరం ఈ బిలంలో ప్రవేశించి తపస్సు చేశారని గ్రంథాల ద్వారా తెలుస్తోంది. పురావస్తుశాఖ వారి అన్వేషణలో లభించిన అలనాడు బ్రహ్మనాయుడు వాడిన ఆయుధాన్ని హైదరాబాద్ పురావస్తు శాలలో పదిలపరిచారు. బిలంలో పలు అంతర గుహలున్నాయి. బిలంలోని కోనేరులో నీరు చాలా స్వచ్ఛంగా వుంటుంది. 1960 సంవత్సరంలో గుహముఖ ద్వారం వద్ద మెట్లు నిర్మించారు. విఘ్నేశ్వరాలయం, నవగ్రహాలయం , రాజరాజేశ్వరి ఆలయాలను నిర్మించారు. బాలమల్లేశ్వరాలయం, అమ్మవారి ఆలయాలున్నాయి. ప్రతి ఏడాది ఆషాఢశుద్ధ ఏకాదశి నాడు జరిగే బిల మహోత్సవానికి పెద్ద ఎత్తున భక్తులు తరలివస్తారు. ఈ బిల స్నానం సకల పాపాలను హరిస్తుందని వారి విశ్వాసం. ప్రకృతీ రమణీయతతో అలరించే ఈ బిలానికి రావాలంటే యాత్రికులు మాత్రం శ్రమించక తప్పటం లేదు. మిగతారోజుల్లో గుత్తికొండ నుంచి ఐదు కిలోమీటర్ల దూరం కాలినడక తప్పదు. బిలంలోకి తాత్కాలికంగా విద్యుత్ సరఫరాతో ఏర్పాటు చేసిన బల్బులు బిల సౌందర్యాన్ని చూపలేకపోతున్నాయి. అధ్యాత్మికంగా పర్యాటక కేంద్రమైన గుత్తికొండ బిలానికి కమ్యూనిస్టు ఉద్యమ వేదికగాను పేరుంది. 1968వ సంవత్సరంలో చారుమజుందార్ నేతృత్వంలో పీపుల్స్‌వార్ సమావేశాలు ఈ బిలంలోనే గోప్యంగా సాగాయి. 2004లో ప్రభుత్వానికి పీపుల్స్‌వార్‌కు మధ్య చర్చలకు ముందు ఈ బిలాన్ని వేదిక చేసుకునే పీపుల్స్‌వార్ బహిరంగ సభ నిర్వహించింది. వార్ అగ్రనేత అక్కిరాజు రామకృష్ణ కొండపై చారుమజుందార్ స్మారక స్థూపాన్ని ఆవిష్కరించారు. ఫిబ్రవరి నెలలో అప్పటి జిల్లా కలెక్టర్ బి వెంకటేశం గుత్తికొండ బిలాన్ని సందర్శించి పర్యాటక కేంద్రంగా అభివృద్ధి చేస్తామని హామీ ఇచ్చారు. ఆ తర్వాత వెంకటేశం రాష్ట్ర పర్యాటక సంస్థ డైరెక్టర్‌గా నియమితులయ్యారు. బదిలీ అయినప్పటికి ఇచ్చిన హామీ నెరవేర్చాలనే ఉద్దేశ్యంతో గుత్తికొండ బిలాన్ని పర్యాటక శాఖపరంగా ఏ మేరకు అభివృద్ధి చేయవచ్చో ఆ దిశగా సంబంధిత ఇంజనీర్లు, డిజైనర్లు సర్వే బృందాలను పంపించారు. బిలాన్ని సందర్శించి అభివృద్ధి పరిచేందుకు కావాల్సిన మౌలిక వసతుల కల్పనకు నివేదిక తయారుచేసి పర్యాటక శాఖ డైరెక్టర్ వెంకటేశంకు అందచేస్తామని తెలిపారు. త్వరలో గుత్తికొండ బిలానికి పర్యాటక శోభ సంతరించుకోనుంది. బిలంలో ఏకాదశి, దసరా వేడుకలను ఘనంగా నిర్వహిస్తుంటారు. గుత్తికొండ బిలంలోని పవిత్ర జలపాతంలో స్నానమాచరిస్తే పుణ్యం లభిస్తుందని భక్తుల ప్రగాఢ విశ్వాసం. కారుచీకట్లో నెలకొని వున్న బిలంలో భక్తుల సౌకర్యార్థం ప్రభుత్వం విద్యుత్ బల్బులు ఏర్పాటుచేసింది. తొలి ఏకాదశి పురస్కరించుకొని ప్రతి సంవత్సరం వేల సంఖ్యలో భక్తులు పుణ్యక్షేత్రాన్ని సందర్శిస్తుంటారు. బిలంలో స్నానమాచరించిన భక్తులు గృహంలో నెలకొని వున్న శివలింగానికి పూజలు నిర్వహిస్తారు. భక్తుల రద్దీని దృష్టిలో వుంచుకొని అధికారులు మరిన్ని సౌకర్యాలు కల్పించాలని వీవీ నాగేశ్వర రావు తెలిపారు.



గుత్తికొండ బిలం లోపలి భాగం



ముఖ ద్వారం

## రెండోసారి రాజ్యసభకు ఎన్నికైన జేడీ శీలం

(ఆన్‌లైన్ - గుంటూరు)

గుంటూరు జిల్లా నుంచి 28 సంవత్సరాల తరువాత రాజ్యసభకు రెండవ సారి ఎన్నికయ్యే అవకాశం జెడి శీలంకు దక్కింది. 1982 నుంచి ఇప్పటి వరకు జిల్లాలో రెండవ సారి రాజ్యసభకు ఎవరూ ఎన్నిక కాలేదు.

కాంగ్రెస్ నుంచి 1982లో రాయపాటి సాంబశివరావు, 1990లో ప్రగడ కోటయ్య, 2004 జెడి శీలంలు రాజ్యసభకు ఎన్నికయ్యారు.

తెలుగుదేశం నుంచి 1988లో డాక్టర్ యలమంచిలి శివాజి, 1996లో యడ్లపాటి వెంకటరావు, 2000లలో



ఎస్ ఎం లాల్‌జాన్ బాషాలు రాజ్యసభకు జిల్లా నుంచి ప్రాతినిధ్యం వహించారు.

28 సంవత్సరాల తరువాత పెదనందిపాడు మండలం పుసులూరుకు చెందిన జెడి శీలం రాజ్యసభకు రెండవ సారి ఎన్నికై రికార్డు సృష్టించారు. కర్నాటకకు చెందిన ఐ ఎ ఎస్ అధికారి శీలం ఉద్యోగానికి రాజీనామా చేసి 1999లో బాపట్ల లోక్‌సభకు కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీ చేసి ఓడిపోయారు. 2004లో ఆయనకు పార్టీ రాజ్యసభ సభ్యత్వం ఇచ్చి న్యాయం చేసింది. సోనియాకు విధేయుడుగా ఢిల్లీ కేంద్రంగా రాజకీయాలు కొనసాగించే శీలం రెండవ సారి పదవిని దక్కించుకున్నారు.

## దేశంలోనే అరుదైన రక్షిత మంచినీటి పథకం

# నరసరావుపేట సొంతం



రక్షిత మంచి నీటి పథకం చెరువు

(ఆన్‌లైన్, నరసరావుపేట)

నరసరావుపేట పట్టణానికి రక్షిత మంచి నీరు సరఫరా ప్రకృతి వరప్రసాదం. మానవ మేధస్సుకు ఒక మచ్చుతునక. ఈ రక్షిత మంచి నీటి పథకం దేశంలోనే అరుదైనదిగా పేర్కొనవచ్చు. నరసరావుపేట పథకంతో పాటు మరొకటి మాత్రమే వున్నట్టు చెపుతారు. సాంకేతిక పరంగా అద్భుతమైన ఈ మంచి నీటి పథకంలో ప్రజలకు నీటి సరఫరా చేసే దానిలో విద్యుత్ శక్తి, ఎటువంటి యాంత్రిక వినియోగం లేదు. ఖర్చు లేకుండా ప్రజలకు నీటి సరఫరా జరుగుతుందంటే ప్రతి ఒక్కరూ ఆశ్చర్య పోక తప్పదు. ఇదేమిటనే ప్రశ్న ప్రతి ఒక్కరికి తలెత్తవచ్చు. కారణం మంచి నీటి పథక రచనలో స్టోరేజ్ చెరువులను శాంతినగర్, నకరికల్లుల వద్ద ఏర్పాటు చేశారు. శాంతినగర్ చెరువు పట్టణానికి ఎనిమిది కిలో మీటర్ల దూరంలో ఉండగా, నకరికల్లు చెరువు 18 కిలోమీటర్ల దూరంలో ఉంది. నకరికల్లు వద్ద వున్న నరసరావుపేట రక్షిత మంచి నీటి చెరువు పట్టణం కంటే 125 మీటర్ల ఎత్తులో ఉంది. అలాగే శాంతినగర్ వద్ద ఉన్న చెరువు పట్టణం కంటే 95 మీటర్ల ఎత్తులో ఉంది. దీని కారణంగా పట్టణానికి నీరు ఎటువంటి యంత్రాలు వినియోగించకుండా నేరుగా ఓవర్ హెడ్ ట్యాంక్‌ల్లోకి నీరు చేరుతుంది. నకరికల్లు వద్ద చెరువు నుంచి శాంతినగర్ వద్ద వున్న ఫిల్టరేషన్ ప్లాంట్‌లకు నీరు పైపుల ద్వారా చేరుస్తారు. ఫిల్టరేషన్ ప్లాంట్ నకరికల్లు కంటే 30 మీటర్ల దిగువున ఉంది. అక్కడి నుంచి శుద్ధి చేసిన నీరు కూడా పైపుల ద్వారా పట్టణంలోని వివిధ ప్రదేశాల్లో నిర్మించిన ఓవర్ హెడ్ ట్యాంకులకు కూడా ఎటువంటి యాంత్రిక వినియోగం లేకుండా చేరుతుంది. ఫిల్టరేషన్ ప్లాంట్‌కు ఓవర్ హెడ్ ట్యాంకుల మధ్య భూవ్యత్యాసం 32 మీటర్లు ఉంది. ఓవర్ హెడ్ ట్యాంకులు 17 మీటర్ల ఎత్తులో నిర్మించబడి ఉంది. పట్టణంలో కూడా వివిధ ప్రదేశాల్లో భూవ్యత్యాసం పది మీటర్లు ఉన్నందున నీటి సరఫరా కూడా వేగంగా జరుగుతుంటుంది. ఎన్నో ఏళ్ళ క్రితం నిర్మించిన మొదటి దశ రక్షిత మంచి నీటి పథకం ద్వారా ప్రజలకు నీటి సరఫరా సరిపోనందున ప్రస్తుతం రెండో దశ రక్షిత మంచి నీటి పథకం నిర్మించారు. ఈ పథకం విస్తరణ పనులు జరుగుతున్నాయి. రాష్ట్రంలో తీవ్ర నీటి కరువు నెలకొన్న నరసరావుపేటలో మాత్రం మండు వేసవిలో సైతం రెండు పూటలా నీటి సరఫరా చేశారు. భూ వ్యత్యాసం వలన యంత్రాల వినియోగం లేనందున పురపాలక సంఘానికి మంచి నీటి సరఫరా నిర్వహణ ఖర్చు ఇతర పట్టణాలతో పోల్చుకుంటే ప్రతి ఏటా సుమారు 70 లక్షల వరకు ఆదా అవుతున్నట్టే. డబ్బు ఆదాతో పాటు నిర్వహణలో సాంకేతిక పరమైన నిపుణత లేనందున నిర్వహణ కూడా సులభసాధ్యంగా ఉంది. ప్రకృతి వైపరీత్యాల వలన విద్యుత్ కోత వున్నా పట్టణ మంచి నీటి సరఫరాకు ఎటువంటి ఆటంకం లేకుండా సజావుగా పట్టణానికి నీటి సరఫరా జరుగుతుండడం, ఈ పథకం ద్వారా లభిస్తున్న ఆదాయంతో అభివృద్ధి పనులు చేపడుతున్నారు.

**నకరికల్లు వద్ద వున్న నరసరావుపేట రక్షిత మంచి నీటి చెరువు పట్టణం కంటే *125* మీటర్ల ఎత్తులో ఉంది. అలాగే శాంతినగర్ వద్ద ఉన్న చెరువు పట్టణం కంటే *95* మీటర్ల ఎత్తులో ఉంది. దీని కారణంగా పట్టణానికి నీరు ఎటువంటి యంత్రాలు వినియోగించకుండా నేరుగా ఓవర్ హెడ్ ట్యాంక్‌ల్లోకి నీరు చేరుతుంది. శాంతి నగర్ చెరువు పట్టణానికి ఎనిమిది కిలో మీటర్ల దూరంలో ఉండగా, నకరికల్లు చెరువు *18* కిలోమీటర్ల దూరంలో**

## తళుకుబెళుకుల నృత్యాలు

# దయనీయమైన జీవితాలు

(ఆన్‌లైన్, నరసరావుపేట)

డిస్కో రాధ, నాగలక్ష్మి, మీనా, లిల్లీ, శాంతి, దంపుడులక్ష్మి...పేర్లు సినీ తారలను గుర్తు చేసే లాగ తమాషాగా ఉన్నాయి కదూ. తమ అసలు పేర్లను మరిచిపోయిన స్టేజి డాన్సర్లు వీళ్ళు. రికార్డింగ్ డాన్సర్లనగానే నరసరావు పేట ప్రతి ఒక్కరికి గుర్తుకువస్తుంది. 60వ దశకం నుంచి అనేక మంది మహిళలు ఈ వృత్తిలో తమ బతుకులను వెళ్లదీస్తున్నారు. సినీతారల పేర్లు పెట్టుకొని వీళ్ళు రికార్డింగ్ నృత్యాలు చేస్తుంటారు. ఇదే వీరి జీవనోపాధి. సినీ తారలకు వలె చెమికీలు, తళుకుబెళుకవలతో మెరిసిపోయే దుస్తులు వేసుకొని, అలంకరణ చేసుకొని అర్ధరాత్రి 12 గంటల నుంచి తెల్లవారి ఆరు గంటల దాక అలసట అన్న భావాన్ని ముఖాల పై కొద్దిగా కూడా కన్పించకుండా తమ నృత్యాలతో రసిక జనాలను ఆనందింప జేస్తుంటారు.'భక్తి' పాటలతో మొదలయ్యే వీళ్ళ డాన్స్‌లు తెల్లవారే సరికి పూర్తి రక్తితో కూడిన నృత్యాలు అవుతాయి. వాళ్ళని కదిపితే ఆకలి కథల చిట్టా విప్పినట్లే. స్టేజి పై గ్లామర్‌తో మెరిసి పోయే ఈ తారల నిజజీవితం మటుకు ఇందుకు పూర్తిగా విరుద్ధంగా వుంటుంది. నృత్యం చేయకపోతే కడుపునిండని పరిస్థితి వారిది. నగ్న నృత్యం చేస్తే పోలీసులు దండన, చేయకుంటే తిరునాళ్ళలో ప్రజల దాడులను ఈ కళాకారులు ఎదుర్కోవాల్సి వస్తుంది. అడకత్తెరలో పోకచెక్క జీవితాలు వీళ్ళవి. పొట్టకూటి కోసమే ఇలాంటి నృత్యాలు చేస్తున్నాం తప్ప ఇష్టమై కాదు. పది మంది ముందు దుస్తులు ఊడదీసుకోవడం మాకేమైనా ఇష్టామా? ఆక్షణాల్లో మాగుండెల్లో గూడు కట్టుకొని ఉండే బాధ ఎవరికి తెలుసు? అని నృత్య తారలు అంటున్నారు.





ప్రభల పై నృత్యాలు

### కడుపు నింపుకోవడానికే...

రికార్డ్ డ్యాన్స్‌లని పిలిచే ఇవి నిజానికి రికార్డ్ డ్యాన్స్‌లు కావని, ఆర్కెస్ట్రా డ్యాన్స్‌లని కళాకారులు అంటున్నారు. ఈ ప్రాంతంలో ప్రముఖ పుణ్యక్షేత్రమైన కోటప్పకొండ, పల్నాడు ప్రాంతాల్లో తిరుణాలు బాగా జరుగుతుంటాయి. గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, కడప జిల్లాల్లో ప్రతి ఏటా మొత్తం 116 తిరునాళ్ళు జరుగుతుంటాయి. ఈ ప్రాంతాల్లో నరసరావుపేట నృత్య తారలు సుపరిచితులు. కాబట్టి డ్యాన్స్‌ల జోరు ఎక్కువగా వుంటుంది. ఏడాదిలో నాలుగు నెలలు నృత్య తారలు బిజీగా ఉంటారు. ఆ తర్వాత వారి బతుకు జీవన్మరణ సమస్యే. గతంలో డ్యాన్సు చేసే టప్పుడు డాన్సు పార్టీల మధ్య పోటీ ఏర్పడుతుంది. ఈ పోటీ తీవ్రస్థాయిలో జరిగి చివరకు నగ్న నృత్యాలకు దారి తీస్తోంది. పోటీ పడే సందర్భంలో నగ్న నృత్యానికి అంగీకరించని పక్షంలో ఆ డ్యాన్సు పార్టీ తారల మీద ప్రజలు దాడి చేస్తుంటారు. ఇలా చేయడం ఇష్టంలేక తప్పుకుందామంటే మరోవైపు ఆకలి. అవసరాలు వాళ్ళ జీవితాలను విషాదంగా మారుస్తున్నాయి. పోలీసులు వేధింపులు ఒక సమస్య అయితే, వాళ్లకు లంచాలు ఇచ్చి అనుమతి పొందడం మరో సమస్య.

ఒక రోజు నృత్యానికి ఒక మహిళా డాన్సర్‌కి 250-350 రూపాయలు మాత్రమే ఇస్తారు. ఈ సంపాదన కూడా కేవలం మూడు నెలల పాటే ఉంటుంది. ఈ కుటుంబాల్లో 12 ఏళ్ళ వయసునుంచే బాలికలు నృత్య ప్రదర్శనలివ్వడం చూస్తాం. ఒకే స్టేజిపై తల్లికూతుళ్ళు, తండ్రి కొడుకులు నృత్య ప్రదర్శనలిచ్చిన ఘటనలు కోకొల్లలు. దీనిపై డ్యాన్సర్లు మాట్లాడుతూ వేరే వృత్తి చేతగాక మా పిల్లల్ని కూడా ఈ రంగంలోనే దింపుతున్నాం అని ఆవేదన వ్యక్తం చేస్తున్నారు.

ఈ వృత్తిని మానివేయడానికి మేమూ సిద్ధమే. మాకు ఈ సమాజం ఉపాధి చూపించ గలదా? అని ఆవేశంగా విమర్శించే వారిని ప్రశ్నిస్తుంటారు. ప్రభుత్వం వీళ్ళకు ఉపాధి కల్పించడంలో విఫలమైందనే విషయం వాస్తవమేనని విమర్శకులు అంగీకరిస్తుంటారు.

నరసరావుపేటలో పాత పోలీసు స్టేషన్ రోడ్డులో డ్యాన్సు పార్టీల కంపెనీలు చాలా ఉన్నాయి. అందుకే ఆ వీధిని డ్యాన్సు పార్టీల వీధని పిలుస్తున్నారు. ఒక్కొక్క డ్యాన్సు పార్టీకి ఐదుగురు మహిళలు, ఒక యువకుడు డ్యాన్సర్లుగా, ఇద్దరు కామిక్ ఆర్టిస్టులు, వాయిద్య సహకారం అందించడానికి ఆరుగురు వ్యక్తులూ ఉంటారు. ప్రభుత్వం నరసరావుపేట డ్యాన్సర్లపై నిషేధాజ్ఞలు తప్ప ఉపాధి చూపించే ప్రయత్నాలు చేయడం లేదని నృత్యతారలు విమర్శిస్తున్నారు. డాన్స్ ప్రదర్శనల పై జీవనం సాగిస్తున్న కుటుంబాలు నరసరావుపేటలో 150 దాకా ఉన్నాయి. పదేళ్ళ క్రితం 20 నుంచి 25 వరకు డ్యాన్స్ ట్రూపులు వుండేవి. ప్రస్తుతం వీటి సంఖ్య ఐదారు మధ్య వుంది. పాలకులు చెపుతున్న సంక్షేమం నరసరావుపేట డ్యాన్సర్ల దరి చేరలేదు. వృత్తి మానేయమని పోలీసు శాఖ, పాలకులు పదే పదే కోరుతుంటారు. సామాజిక వర్గాల వారీగా ఉపాధి అవకాశాలు కల్పిస్తున్న ప్రభుత్వం వృత్తి కళాకారులైన నృత్యతారాలను విస్మరించింది. నగ్న నృత్యాల జోరు పెరగటంతో పోలీసు శాఖ కన్నెర్ర చేసింది. నృత్యం చేస్తే పోలీసులు, నగ్న నృత్యం చేయక పోతే ప్రభల నిర్వహకులు దాడులు పెరగటంతో కొందరు ఈ వృత్తిని మానేసి వెళ్ళారు. కూలీ పనులు చేసుకొని కొందరు జీవనం సాగిస్తున్నారు. అన్ సీజన్‌లో నూటికి రూ 10 వడ్డీకి అప్పులు చేసి సీజన్‌లో వచ్చే డబ్బుతో రుణాలు తీరుస్తూ ఆర్థికంగా ఆ కుటుంబాలు చితికి పోతున్నాయి. నృత్య ప్రదర్శనలకు వెళ్ళే సమయంలో చెప్పే మాటలు డబ్బు చెల్లించే సమయంలో నిర్వాహకులు అనుసరించరని, నగ్న నృత్యం చేస్తేనే డబ్బు ఇస్తామని బెదిరిస్తుంటారని, ఇందుకు అంగీకరించక పోతే కర్రలతో దాడులు చేసిన సంఘటనలు వున్నాయని పలువురు నృత్య తారలు ఆవేదన వ్యక్తం చేశారు. ఈ వృత్తిని వదిలేయాలని వున్నా ప్రభుత్వం ఆసరా లేకనే కొనసాగించాల్సి వస్తున్నదని విచారం వ్యక్తం చేస్తున్నారు. స్వచ్ఛంద సేవా సంస్థలు, పాలకులు నగ్న నృత్యాల పై విమర్శల కంటే ఆ వృత్తిని మాన్పించి చేయూతనందించే దిశగా నేటి వరకు ప్రయత్నించిన వారు లేరు. చిలకలూరిపేట, గుంటూరులలో కూడా రికార్డు డ్యాన్స్ ట్రూపులు వున్నాయి.

# సాతానుపల్లే... సత్తెనపల్లి



వేణుగోపాలస్వామి దేవాలయం



వావిలాలఘాట్

(ఆన్‌లైన్, సత్తెనపల్లి)

సత్తెనపల్లికి ఆ పేరు ఎలా వచ్చింది. ఇది ఉత్సాహం కలిగించే విషయం. దీనికి సంబంధించి విభిన్న కథనాలు ప్రచారంలో ఉన్నాయి. సాతానుల నివాసకేంద్రం కనుక సాతానుపల్లి పేరు రానురాను సత్తెనపల్లిగా మారిందని కొందరు అంటారు.



గడియారస్తంభం

సత్తెన్న అను ఒడియరాజు పాలించిన ప్రాంతం కనుక సత్తెన్నపల్లి కాలక్రమేణా సత్తెనపల్లిగా మారిందని మరికొందరు అంటారు. సత్తెనపల్లి పాతతాలూకా ఇటు కొండవీడు, అటు అమరావతి ప్రాంతానికి పశ్చిమంగా అచ్చంపేట, క్రోసూరు కృష్ణతీరం వెంట గ్రామాలు కూడా దీనిలో ఉండేవి. చరిత్రలో ప్రసిద్ధిచెందిన స్థలాలుగా కొండవీడు, అమరావతి, ధరణికోట, సత్తెనపల్లిగా చెప్పుకోవచ్చు. అమరలింగేశ్వరస్వామి దేవాలయం, నందులరేవు, బౌద్ధమత ప్రచార స్థూపాలు, సత్తెనపల్లి దేవాలయం, నీలకంఠేశ్వరస్వామి దేవాలయం, రామలింగేశ్వరస్వామి, ఆంజనేయ స్వామి దేవాలయాలు ఈ ప్రాంతంలో పురాతనమైనవిగా ప్రసిద్ధి చెందాయి. నాగార్జునసాగర్ నీరు వినియోగంలోకి రాకముందు ఇది మెట్టప్రాంతం. అపరాలు పండించే వారు. జొన్న, మిర్చి, పొగాకు, శనగపంటలుండేవి. నీటి వసతి ఏర్పడ్డాక వరి, పత్తి, మిర్చి, పసుపు, అపరాలు వంటి వాణిజ్యపంటలు విస్తారంగా పండిస్తున్నారు. రాజకీయ పోరాటాలు సాగాయి. స్వాతంత్ర్య పోరాటంలో ఈ ప్రాంతం నుంచి యోధులు పాల్గొన్నారు. సత్తెనపల్లి నియోజకవర్గంలోని ముప్పాళ్ళ గ్రామంలో జన్మించిన భవనం వెంకట్రామ్ రాష్ట్ర ముఖ్యమంత్రిగా పదవి నిర్వహించారు. వావిలాల గోపాలకృష్ణయ్య, ఆమంచి నరసింహారావులాంటి ప్రముఖులు స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొని జైలుశిక్ష అనుభవించారు. వావిలాల గోపాలకృష్ణ ఆజన్మ బ్రహ్మచారిగానే కాక ప్రముఖ రాజకీయ వేత్తగా కూడా గుర్తింపు పొందారు. వావిలాల గోపాలకృష్ణయ్య సత్తెనపల్లికి నాలుగుసార్లు శాసనసభ్యునిగా ఎన్నికయ్యారు. ఆయన మరణానంతరం ఆయన మృతికి చిహ్నంగా 3వవార్డులో వావిలాలఘాట్ ఏర్పాటు చేశారు. నాగార్జునసాగర్ నిర్మించాలని సత్తెనపల్లిలో రైతులు ఉద్యమాలు నడిపారు. తెలంగాణ సాయుధపోరాటంలో పాల్గొని ఉద్యమాలు నిర్మించిన వారిలో రైతునేత పుతుంబాక వెంకటపతి ఉన్నారు. నాటక, సినీ రచయిత, దర్శకుడు గోళ్ళపాటి నాగేశ్వరరావు, నటులుగా సినీ ప్రపంచంలో హాస్యబ్రహ్మగా పేరొందిన బ్రహ్మానందం సత్తెనపల్లి వాడే. అలాగే సినీ గేయాలాపనతో ఉర్రూతలూగిస్తున్న నాగూర్‌బాబు (మనో) సత్తెనపల్లి వాడే. సాంస్కృతిక పరంగా సత్తెనపల్లికి రాష్ట్రస్థాయిలో గుర్తింపు తెచ్చిన వారిలో పత్రి జగన్నాధం ఒకరు. ప్రగతి కళామండలిని స్థాపించి రాష్ట్రస్థాయి నాటక పరిషత్‌లు నిర్వహించారు. ఆయన మరణానంతరం నూతలపాటి సాంబయ్య కళాపరిషత్‌ను నిర్వహిస్తున్నారు.

చిత్రకళలో వర్ణచిత్రాలు, ప్రకృతి చిత్రాలు, దేవతామూర్తుల చిత్రాల చిత్రకారుడు జింకా రామారావు సత్తెనపల్లి వాసే. రాజకీయ, సాంస్కృతిక కళారంగాలలో సత్తెనపల్లి ప్రాంతం వెలుగొందుతుంది. సత్తెనపల్లి పట్టణంలో ఉన్న గడియారస్తంభానికి ఎంతో ప్రాధాన్యత ఉంది. శ్రీ వేణుగోపాలస్వామి ఆలయం కూడా ఈ ప్రాంతంలో ఎంతో పేరు ప్రసిద్ధి చెందింది. ప్రతి ఏటా ఆలయంలో ఉత్సవాలు నిర్వహిస్తుంటారు.

# పోలీస్ వ్యవస్థలో సమూల మార్పులు



అర్బన్ ఎస్పీ కార్యాలయం

## అర్బన్ జిల్లాతో కొత్త హంగులు
## మరో ఏడాదిలో కమిషనరేట్
## ముగ్గురు అదనపు ఎస్పీల నియామకంపై సందిగ్ధం
## ఇదీ అర్బన్ పోలీస్ ముఖచిత్రం

(బెల్లంకొండ బూర్థురాజు, గుంటూరు)

జిల్లా పోలీస్ వ్యవస్థలో సమూల మార్పులు చోటు చేసుకున్నాయి. దశాబ్దాలుగా ఒకే గొడుగు కింద ఉన్న జిల్లా పోలీస్‌ను రెండుగా విభజించారు. అర్బన్, రూరల్‌గా విభజించటం ద్వారా ప్రజలకు మరింత చేరువ కావటంతో పాటు నేరాలను అరికట్టేందుకు ప్రభుత్వం చర్యలు ప్రారంభించింది. దీనిలో భాగంగా జిల్లా పోలీస్ కార్యాలయంలోనే తాత్కాలికంగా అర్బన్ పోలీస్‌కు కార్యాలయం ఏర్పాటు చేశారు. అలాగే కాకాని రోడ్డులోని వై జంక్షన్ వద్ద అర్బన్ పోలీస్ కార్యాలయం నూతన భవనం నిర్మాణానికి ప్రభుత్వం గ్రీన్ సిగ్నల్ ఇచ్చింది. ఈ మేరకు కొద్ది నెలల క్రితం సి ఎం రోశయ్య అర్బన్ కార్యాలయాన్ని, కార్యాలయ నూతన భవన సముదాయానికి శంకుస్థాపన చేశారు. అయితే పెద్ద సంఖ్యలో పోలీస్ సిబ్బందిని ఏర్పాటు చేయాల్సింది.

* ఇప్పటికే పోలీస్ అధికారుల నియామకం కొనసాగుతూ వస్తుంది. ముగ్గురు అదనపు ఎస్పీలతో పాటు ట్రాఫిక్ డి ఎస్పీని నియమించాల్సి ఉంది. పెద్ద సంఖ్యలో సిబ్బంది నియమించాల్సి ఉన్నప్పటికీ కొరత కారణంగా శిక్షణ ఉన్న బ్యాచ్ కోసం ఎదురు చూస్తున్నారు. వీటన్నింటిని అధిగమించి ఏడాదిలో అన్నీ సర్దుకుంటే గుంటూరు పోలీస్ కమిషనరేట్‌గా అవతరించే అవకాశాలు ఉన్నాయి.

నిన్నటి వరకు గుంటూరు జిల్లా పోలీసులు ఒకే ఒక్క ఎస్పీ కింద విధులు నిర్వహిస్తూ వచ్చారు. గుంటూరు నగరంతోపాటు మారుమూల గ్రామంలో ఏ సమస్య వచ్చినా వారికి ఎస్పీ ఒక్కరే ఉన్నతాధికారి. కిందిస్థాయిలో న్యాయం జరగలేదనుకుంటే జిల్లా పోలీసు కార్యాలయానికి పరిగెత్తేవారు... కానీ ఇప్పుడు జిల్లాలో ఇరువురు ఎస్పీలు విధులు నిర్వహిస్తున్నారు. అర్బన్ ఎస్పీగా చౌహాన్‌ను, రూరల్ ఎస్పీగా రవి చంద్రను నియమించారు. ఆయనతో పాటు ముగ్గురు అదనపు ఎస్పీలను నియమించాల్సి ఉంది. అలాగే ఆరుగురు డి ఎస్పీలను నియమించారు. ఆయా అధికారులకు కార్యాలయాలు, వాహనాలు, ప్రభుత్వ సెల్ ఫోన్‌లు, క్యాంప్ కార్యాలయాలు లేక ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. ట్రాఫిక్, ఎల్‌అండ్‌వోలకు ఒక్కొక్కరు చొప్పున, సిసిఎస్, పాలనా విభాగాలకు కలిపి ఒకరిని అదనపు ఎస్పీగా నియమించాల్సి ఉంది. అర్బన్ ఎస్పీగా డీఎస్ చౌహాన్ (94910 67800), రూరల్ ఎస్పీగా రవిచంద్ర (9440796200)లు కొనసాగుతున్నారు. ప్రస్తుతం అర్బన్ జిల్లాకు సంబంధించి జోన్‌ల వారీగా వివరాలు ఇలా ఉన్నాయి...

### ఈస్ట్ జోన్ సబ్ డివిజన్...
### డీఎస్పీ: టి.వి.నాగరాజు (9491067804)

కొత్తపేట, పాతగుంటూరు, లాలాపేట పోలీసు స్టేషన్లు ఈ డివిజన్ పరిధిలో ఉన్నాయి. ఇందులో లాలాపేటను ఎస్‌హెచ్‌వోగా ప్రకటించారు. ఈ సబ్ డివిజన్ లాలాపేట ప్రధాన కార్యాలయంగా కొనసాగుతుంది. సిఐ మధుసూదనరావు (9491067811) స్టేషన్ హౌస్ ఆఫీసర్ (ఎస్‌హెచ్‌వో)గా విధులు నిర్వహిస్తున్నారు. మిగిలిన కొత్తపేట, పాత గుంటూరు స్టేషన్లు ఈస్ట్ సర్కిల్ కింద ఉన్నాయి. ఈస్ట్ సిఐగా రామాంజనేయులు (9440796211) విధులు నిర్వహిస్తున్నారు. త్వరలో కొత్తపేట, పాతగుంటూరులను వేర్వేరు ఎస్‌హెచ్‌వోలుగా విభజించాల్సి ఉంది. సిఐ రామాంజనేయులు కొత్తపేట ఎస్‌హెచ్‌వోగా, పాతగుంటూరుకు మరో సిఐను నియమిస్తారు.

### వెస్ట్‌జోన్ సబ్ డివిజన్...
### డీఎస్పీ: డి కోటేశ్వరరావు (9440796204)

అరండల్‌పేట, పట్టాభిపురం, నగరంపాలెం పోలీసు స్టేషన్‌లు ఈ డివిజన్ పరిధిలో ఉన్నాయి. ఈ సబ్ డివిజన్‌కు ప్రస్తుతం ఎస్పీ కార్యాలయం రోడ్డులో ఉన్న డీఎస్పీ కార్యాలయమే ప్రధాన కార్యాలయం. అరండల్‌పేట, పట్టాభిపురంలను ఎస్‌హెచ్‌వోలుగా ఇప్పటికే ప్రకటించారు. సీఐ సీతారామయ్య (94407 96212) అరండల్‌పేట ఎస్‌హెచ్‌వోగా విధులు నిర్వహిస్తున్నారు. అలాగే పట్టాభిపురం, నగరంపాలెం స్టేషన్లు వెస్ట్ సర్కిల్ కింద ఉన్నాయి. వెస్ట్ సిఐగా విజయభాస్కర్‌రావు (94910 67812) విధులు నిర్వహిస్తున్నారు. త్వరలోనే పట్టాభిపురం, నగరంపాలెంలను ప్రత్యేక ఎస్‌హెచ్‌వోలుగా ప్రకటించనున్నారు. విజయభాస్కర్‌రావు పట్టాభిపురం ఎస్‌హెచ్‌వోగా ఎంపిక చేస్తే, మరొకరిని నగరంపాలెం ఎస్‌హెచ్‌వోగా నియమించాల్సి ఉంది.

(తరువాయి 49లో..)



డి కోటేశ్వరరావు, వెస్ట్ డీఎస్పీ



టీవీ నాగరాజు, ఈస్ట్ డీఎస్పీ



అన్నపూర్ణారెడ్డి, నార్త్ డీఎస్పీ

## పోలీస్ వ్యవస్థలో సమూల మార్పులు

(48వ పేజీ తరువాయి)

**నార్త్‌జోన్ సబ్ డివిజన్...**
**డీఎస్పీ: అన్నపూర్ణారెడ్డి (9440796205)**

మంగళగిరి టౌన్, రూరల్, పెదకాకాని, తాడేపల్లి, తాడికొండ పోలీసు స్టేషన్‌లు ఈ సబ్ డివిజన్ పరిధిలో ఉన్నాయి. ఈ సబ్ డివిజన్ మంగళగిరి ప్రధాన కార్యాలయంగా కొనసాగుతుంది. వీటిలో మంగళగిరి టౌన్, పెదకాకానిలను ఎస్‌హెచ్‌వోలుగా ప్రకటించారు. మంగళగిరి టౌన్ ఎస్‌హెచ్‌వోగా రమణకుమార్ (94400 50269) విధులు నిర్వహిస్తున్నారు. పెదకాకాని ఎస్‌హెచ్‌వోను నియమించాల్సి ఉంది. ప్రస్తుతం మంగళగిరి రూరల్ సిఐ కె నాగేశ్వరరావు (94407 96216) పెదకాకాని ఇన్‌చార్జిగా వ్యవహరిస్తున్నారు. మం గళగిరి రూరల్ సర్కిల్ పరిధిలో మంగళగిరి రూరల్, తాడేపల్లి, తాడికొండ పోలీసు స్టేషన్లు ఉన్నాయి. వీటికి సిఐగా కె నాగేశ్వరరావు కొనసాగుతున్నారు.

**సౌత్‌జోన్ సబ్ డివిజన్...**
**డీఎస్పీ: వెలిశల రత్న (9491067805)**

రూరల్, మేడికొండూరు, చేబ్రోలు, ప్రత్తిపాడు, వట్టిచెరుకూరు పోలీసు స్టేషన్‌లు ఈ సబ్ డివిజన్ పరిధిలో ఉన్నాయి. ఈ సబ్ డివిజన్ నల్లపాడు ప్రధాన కార్యాలయంగా కొనసాగుతుంది. రూరల్, మేడికొండూరులను ఎస్‌హెచ్‌వోలుగా ప్రకటించారు. రూరల్ స్టేషన్‌ను నల్లపాడులో ఏర్పాటు చేయాల్సి ఉంది. రూరల్ ఎస్‌హెచ్‌వోగా డి దుర్గాప్రసాద్ (9440796215) విధులు నిర్వహిస్తున్నారు. మేడికొండూరు ఎస్‌హెచ్‌వోగా పూర్ణచంద్రరావు (94409 00882) విధులు నిర్వహిస్తున్నారు. చే బ్రోలు సర్కిల్ పరిధిలో చేబ్రోలు, ప్రత్తిపాడు, వట్టిచెరుకూరు స్టేషన్లు ఉన్నాయి. చేబ్రోలు సీఐగా ఎం చిన సత్యనారాయణ (94400603 30) విధులు నిర్వహిస్తున్నారు.

**సీసీఎస్ సబ్ డివిజన్...**
**డీఎస్పీ: నంజుడప్ప (9491067806)**

సీఈఎస్ డీఎస్పీగా చిత్తూరు జిల్లా పుంగనూరు సీఐగా పని చేస్తూ పదోన్నతి పొందిన నంజుడప్పను నియమించారు. సీఈఎస్ సబ్ డివిజన్ పరిధిలో ప్రస్తుతం ముగ్గురు సిఐలు విధులు నిర్వహిస్తున్నారు. ఈస్ట్ సిసిఎస్ సిఐగా ఎస్ శ్రీనివాసరావు (94407 96214), వెస్ట్ సీసీ ఎస్ సీఐగా ప్రతాప్ (99087 77755) విధులు నిర్వహిస్తున్నారు. మరో సీఐ సుబ్బారెడ్డి విధులు నిర్వహిస్తున్నప్పటికీ పది రోజులలో ఆయన పదవీ విరమణ చేయనున్నారు.

**ట్రాఫిక్ డీఎస్పీ కోసం ఎదురు చూపు**

ఇదిలా ఉంటే ట్రాఫిక్‌కు తులసీ రాంప్రసాద్‌ను డీఎస్పీగా నియమించారు. ప్రస్తుతం ఆయన హైదరాబాద్ సీఐడీ విభాగంలో డీఎస్పీగా కొనసాగుతున్నారు. ప్రస్తుతం ట్రాఫిక్‌లో ఇరువురు సీఐలు ఉన్నారు. ఈస్ట్ ట్రాఫిక్ సీఐగా రామిరెడ్డి విజయభాస్కర్‌రెడ్డి (94910 67 813), వెస్ట్ ట్రాఫిక్ సీఐగా యూ రవిచంద్ర (9440 796213) కొనసాగుతున్నారు.



అర్జున్ ఎస్పీ చౌహాన్



రవిచంద్ర, రూరల్ ఎస్పీ



వెలిశల రత్న, సౌత్ డీఎస్పీ



నంజుండప్ప, సీసీఎస్ డీఎస్పీ

## ఉపాధి కేంద్రంగా నర్సరీలు

### మొక్కల పెంపకంలో రాజుపాలేనికి గుర్తింపు

(ఆన్‌లైన్, రాజుపాలెం) దేళ్ల క్రితం ఎందుకూ పనికిరావనుకున్న పొలాలు నేడు సిరులు కురిపిస్తున్నాయి. ఒకప్పుడు కంది, ఆముదాలు తదితర మెట్టపంటలకే పరిమితమైన పొలాలు నేడు నిత్యం మిరపనారు, టమాటో నారుతో పచ్చగా కళకళలాడుతోంది. రైతుల మనసుదోచి వారిని ఇక్కడకు రప్పిస్తున్నా యి. రెండు మూడు సంవత్సరాల క్రితం అరకొరగా ప్రాంతంలో నర్సరీ ప్లాంట్లు ఏర్పడ్డా ఈ ప్రాంతం నేడు సుమారు 200 ఎకరాల్లో మిరపనారు పెంపకం జరుగుతోంది. వివరాల్లోకి వెళితే గుంటూరు- మాచర్ల రాష్ట్ర రహదారిపై రాజుపాలెం గ్రామం వుంది. మండల కేంద్రమైనా ఎలాంటి అభివృద్ధికి నోచుకోలేదు. ఒక్కప్పుడు గ్రామంలోని కూలీలు నిత్యం పిడుగురాళ్లకు ఉపాధి కోసం వెళ్తుండేవారు. నేడు ఆ అవసరం లేకుండాపోయింది. రాజుపాలెంకు కూతవేటు దూరంలో వున్న బెల్లంకొండ అడ్డరోడ్డు నుండి రెడ్డిగూడెం గ్రామం వరకు సుమారు 200 ఎకరాలలో నర్సరీ ప్లాంట్లను ఏర్పాటుచేశారు.

కొద్ది సంవత్సరాల క్రితం వరకు రాజుపాలెంలోని సన్నచిన్న కారు కూలీలందరూ పిడుగురాళ్లలోని క్వారీలు, సున్నపు మిల్లులు తదితర పరిశ్రమలలో ఉపాధి పొందే వారు. మే నెలనుండే నర్సరీలో పనులు ప్రారంభం కావటంతో మగవారు మొత్తం నర్సరీ పనికే వెళ్తున్నారు. జూలై నుంచి మహిళా కూలీలకు ఉపాధి లభిస్తుంది. నర్సరీలలో మాదల, దమ్మాలపాడు, నాగవరం, కొండమోడు, కొత్తూరు, 88 తాళ్లూరు తదితర గ్రామాల ప్రజలు కూడా ఉపాధి పొందుతున్నారు.

మొక్కల పెంపకానికి ఎర్రపొలం ఎంతో శ్రేయస్కరంగా చెబుతారు. ఎర్రపొలంలో పెంచిన మొక్క ఏ నెలలోనైనా ఇమిడిపోయి బతకగలదని, ఈ పొలం మొక్కను ధృడంగా, సురక్షితంగా వుంటుందని నర్సరీ యజమానులు చెబుతున్నారు. రాజుపాలెంలో ఏర్పాటుచేసిన నర్సరీ ప్లాంట్లలో పెంచుతున్న మిరపనారు కొరకు సుదూర ప్రాంతాల నుండి వస్తుంటారు. జిల్లా నలుమూలల నుండే కాక పక్క జిల్లాలైన ప్రకాశం, నెల్లూరు, కృష్ణాలోని ప్రాంతాల నుండి వస్తుంటారు. మాచర్ల, మండాది, ముటుకూరు, ఇనిమెళ్ల, మిర్యాలగూడెం, పుల్లలచెరువు తదితర గ్రామాల ప్రజలు మొక్కల కొరకు ఇక్కడకు వస్తుంటారని ప్లాంట్ యజమానులు చెబుతున్నారు.



టమాటో నారుతో కళకళలాడుతున్న నర్సరీ



దుగ్గిరాల యార్డులో పసుపు రాసులు పోసిన దృశ్యం

## అంతర్జాతీయ ఖ్యాతి గడించిన

# దుగ్గిరాల పసుపు యార్డు

దేశంలో పసుపుకు దుగ్గిరాల పసుపునకు యార్డు ప్రసిద్ధి చెంది, ప్రత్యేకతను సంతరించుకుంది. రాష్ట్రంలో దేశ వాళీ రకం పసుపుకు దుగ్గిరాల ప్రాంతం ప్రసిద్ధి చెందగా కడప, కర్నూలు తదితర ప్రాంతాలతో పాటు రాష్ట్రం నలుమూలల నుంచి దుగ్గిరాల యార్డుకు పసుపు వస్తుంది. బహిరంగ వేలం ద్వారా పసుపుఅమ్మిన వెంటనే డబ్బు చెల్లించడం, రైతుబంధు పథకం ద్వారా రుణాలు అందజేయడం, రైతుకు అవసరమైన ఎరువులను సకాలంలో సరసమైన ధరకు అందించడం వంటి కార్యక్రమాలతో అభివృద్ధిలో ముందంజలో ఉంది. ఇటీవలే రైతులకు పసుపు అమ్మిన రోజు మధ్యాహ్న భోజనం ఏర్పాటు చేయటం జరిగింది. యార్డులో పసుపుతో పాటు అపరాల నిల్వ ఉంచేందుకు 20 ఎకరాల స్థలంలో గిడ్డంగులను నిర్మించారు.

గిట్టుబాటు ధర పలికేంత వరకు రైతులు మూడు నెలల కాలం ఎలాంటి బాడుగ లేకుండా నిల్వ పెట్టుకుని, నిల్వపై రైతుబంధు ద్వారా రుణాలు అందిస్తున్నారు.

ఏడాదికి 200 కోట్ల రూపాయలకు పైగా టర్నోవర్ కలిగి రెండు కోట్లకు పైగా మార్కెట్ ఫీజు ఆదాయంగా లభిస్తోంది. యార్డులో 140 మంది పురుష, మహిళా హమాలీలు పసుపు యార్డుపై ఆధారపడి జీవిస్తున్నారు. దీనికి అనుబంధంగా పసుపు ఫ్యాక్టరీలలో 500 మంది కూలీలు జీవిస్తున్నారు. వందకు పైగా లైసెన్సు కలిగిన సంస్థలు పసుపు వ్యాపారం కొనసాగిస్తున్నాయి. యార్డులో రైతుల సమక్షంలో బహిరంగ వేలం ద్వారా కొనుగోలు చేసిన పసుపు పాలిష్ నిర్వహించి, దేశంలోని లక్నో, సాంగ్లీలతో పాటు బంగ్లాదేశ్, సౌదీ దేశాలకు కూడా ఎగుమతులు చేస్తుంటారు.

పసుపు విత్తనం, వండే పద్ధతులలో నాణ్యత లోపించినందునే ఇతర మార్కెట్‌లతో పోల్చినప్పుడు తక్కువ ధర పలుకుతోందని సర్వేలు తెలియజేస్తున్నాయి. రైతులకు అవసరమైన విశ్రాంతి భవనాల, హమాలీలకు ప్రత్యేక భవనం, ఎలక్ట్రానిక్ కాటాల ద్వారా తూకం నిర్వహణ వంటి ప్రత్యేకతలు కలిగి, వేలం నిర్వహణలో పారదర్శకతను కలిగిన యార్డుగా ప్రసిద్ధికెక్కింది.

– శ్రీనివాసరావు, దుగ్గిరాల

## ప్రభల నిర్మాణంలో ఖ్యాతిగాంచిన

# చిలకలూరిపేట మండలం



ప్రభ నిర్మాణంలో నిమగ్నమైన గ్రామస్తులు

(ఆన్‌లైన్, చిలకలూరిపేట రూరల్)

శివరాత్రి వచ్చిందంటే చాలు గ్రామాలలో సందడి వాతావరణం నెలకొని ఉంటుంది. సంక్రాంతి నుండి గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయ పనులు చివరి దశలో ఉంటాయి. ఇక శివరాత్రి పండుగ వచ్చిందంటే వ్యవసాయ పనులు ముగించుకుని పండుగను ఏ విధంగా జరుపుకోవాలో గ్రామాలలో ప్రణాళికలు రూపొందించడంలో గ్రామస్తులు ముమ్మరమై ఉంటారు. కోటప్పకొండ తిరునాళ్లకు చిలకలూరిపేట ప్రాంతంలో ప్రభలు కట్టుకుని వెళ్లడం శతాబాలుగా ఆచారంగా వస్తుంది. గ్రామస్తులంతా సమిష్టిగా రోజుల తరబడి కష్టపడి శివరాత్రి రోజుకు కోటప్పకొండ వద్దకు ప్రభను తీసుకుని వెళ్లి మొక్కుబడులను తీర్చుకుంటారు. ఇక కోటప్పకొండకు తరలివెళ్లే ప్రభలలో మండలంలోని కావూరు ప్రభకు విశేషమైన స్థానం ఉంది. తిరునాళ్ల ప్రారంభం నుండి తమ గ్రామప్రభ తరలివెళుతుందని గ్రామంలో ఉన్న వృద్ధతరం వారు తమ జ్ఞాపకాలను నెమరువేసుకుంటుంటారు. శివరాత్రికి కట్టే ఈ విద్యుత్ ప్రభకు ఈ సంవత్సరంతో 65 ఏళ్లు నిండాయి. ప్రతి సంవత్సరం ఒక్కొక్క ముఠా ప్రభ నిర్మాణంలో ముఖ్య భూమిక పోషిస్తుంటారు. ఒక ముఠావారు ఆర్థికంగా వెచ్చించినప్పటికీ మిగతా గ్రామస్తులంతా ప్రభ నిర్మాణానికి సహకరిస్తారు. మొత్తం గ్రామంలో 6 ముఠాలు ఈ ప్రభ నిర్మాణాన్ని నిర్వహిస్తుంటారు. గతంలో ప్రభ నిర్మాణానికి రూ.15వేలు ఖర్చయితే ప్రస్తుతం రూ.5 లక్షల వరకు ఖర్చవుతుందని తెలిపారు. గతంలో ప్రభను కొండమీదకు తీసుకుని వెళ్లేవారని తమ పూర్వీకులు తమతో చెప్పేవారని ప్రస్తుతం తమకు కేటాయించిన స్థలంలో కొండవద్ద ప్రభను నిలుపుతున్నామని తెలిపారు. 30 నుండి 40 రోజుల వరకు ప్రభ నిర్మాణానికి సమయం పడుతుందని, శివరాత్రి ముందురోజు గ్రామంలో ఉత్సవం నిర్వహించి ప్రభను కోటప్పకొండకు తరలిస్తారని తెలిపారు. శివరాత్రి అనంతరం గ్రామంలోకి బంధువులను, స్నేహితులను ఆహ్వానించి ఉత్సవం నిర్వహించి సాంస్కృతిక కార్యక్రమాలు ఏర్పాటుచేస్తామని తెలిపారు. ఏ గ్రామంలో లేని విధంగా కావూరులో ప్రభను నిర్మించే వస్తువులను భద్రపరచడానికి పక్కా భవనాన్ని నిర్మించడం విశేషం. మండలంలోని కావూరు గ్రామమేకాకుండా బొప్పూడి గ్రామస్తులు కూడా ప్రభ నిర్మాణంలో మంచి ప్రావీణ్యం గడించారు. ఈ గ్రామస్తులు ప్రభను నిర్మించడమేకాకుండా ఇతర గ్రామాల వారికి కూడా సహాయ సహకారాలు అందించడంలో ముందున్నారు. గతంలో ప్రభను తరలించడానికి ఎద్దుల జతను వినియోగించేవారని, ప్రస్తుతం ట్రాక్టర్లను వినియోగిస్తున్నారు. ఈ సందర్భంగా ప్రభ నిర్వాహకులతో 'ఆన్‌లైన్' పలుకరించగా...

### ప్రభ నిర్మాణం ప్రారంభం నుండి గ్రామం వచ్చేదాక వెన్నంటే ఉంటా : అమ్మనబ్రోలు రామబ్రహ్మం

కొన్ని దశాబ్దాలుగా ప్రభ నిర్మాణంలో పాలు పంచుకుంటున్నాను. ప్రభ నిర్మాణానికి పట్టినన్ని రోజులు గ్రామంలో పండుగ వాతావరణం నెలకొని ఉంటుంది. ప్రభ ప్రారంభం నుండి గ్రామానికి వచ్చేదాక ప్రభను అంటిపెట్టుకుని ఉంటాను. మరమ్మత్తులు ఏమైనా వస్తే వెంటనే తగిన చర్యలు తీసుకుంటాం.

### ఖర్చులు పెరిగాయి : కందుల ఆంజనేయులు

గతంలో ప్రభ నిర్మాణానికి వేలల్లో అయితే నేడు లక్షల రూపాయల వ్యయం అవుతుంది. ఎకరాకు కొంత సొమ్మును వసూలుచేసి ప్రతి ఏటా ప్రభ నిర్మాణానికి వెచ్చిస్తాం. ఈ నెల రోజులు రాజకీయాలకు అతీతంగా శ్రమకోర్చి ప్రభను కట్టి కొండకు తీసుకువెళతాం. తరాల నుంచి వస్తున్న సంప్రదాయాన్ని నేటితరం కూడా ఆచరిస్తూ ప్రభ నిర్మాణాన్ని కొనసాగిస్తున్నాం.



విద్యుద్దీపాలతో అలంకరించిన ప్రభ







# బుర్రకథకు పర్యాయపదం పద్మశ్రీ నాజర్

(డాక్టర్ కందిమళ్ల సాంబశివరావు)

'ఎన్నాళ్లీ కాపురాలు... ఏ చెరో సురో బడి చేద్దామన్నా... కాపురమంతా కరువుల సంత. జీవితమంతా చిరుగుల బొంత' అంటూ అన్నదాతల హృదయ విదారక విషాద గాథలను కళ్లకు కట్టినట్లు, హృద్యంగా రాసి, పాడిన అమర గాయకుడు పద్మశ్రీ నాజర్. 'ఏరన్నా రాకముందకే ఏరువాక వచ్చేరన్నా.. ఎవరింటా ఉందువన్నా ఓరన్నా జీతగాడా' అంటూ కూలీనాలీ జనం గుండె చప్పుళ్లను తన కవిత్వంలో ధ్వనించిన నాజర్ ఒక లేజర్ కిరణం. జానపదాలు నాజర్‌ను సృష్టిస్తే, నాజర్ జానపదాలను సృష్టించాడు. బుర్రకథకు పర్యాయపదంగా నిలిచిన నాజర్ పొన్నెకల్లు గ్రామంలో 1920 ఫిబ్రవరి 5న షేక్ మస్తాన్ బీబీ దంపతులకు జన్మించాడు. స్కూలు వార్షికోత్సవంలో 'ద్రోణ విజయం' నాటికలో ద్రోణుని పాత్రను ధరించి మెప్పును పొందారు. శ్రీరామ నవమి పందిళ్లలో 'కనకతార' నాటకంలో నటించారు. హార్మోనిస్ట్ ఖాదర్, నాజర్‌లోని ప్రతిభను గుర్తించి పెదరావూరులోని బాలరత్నసభ నాటక సమాజంలో



అగ్గిరాముడులో ఎన్‌టీఆర్‌తో కలిసిన నటించిన నాజర్, అంతరచిత్రంలో నాజర్

చేర్చారు. రామదాసు, తులాభారం, కృష్ణలీల, రాధాకృష్ణ నాటకాలలో స్త్రీ పాత్రలను అద్భుతంగా పోషించారు.

నాజర్‌లోని గాత్రమాధుర్యానికి మరింత మెరుగులు దిద్దిన గురువు నరసరావుపేటకు చెందిన ముగుగుళ్ల సీతారామయ్య. ఆయన వద్ద సంగీత శిక్షణ పొందుతూ, ఇంటింటికి తిరిగి భిక్షమెత్తారు. దర్జీగా బతుకుతూ పొన్నెకల్లు గ్రామం లో పాదుకా పట్టాభిషేకం, ఖిల్జీ రాజ్యపతనం నాటకాలను ప్రదర్శించారు. నాజర్ వద్ద సినీ సంగీత దర్శకుడు చక్రవర్తి సంగీతాన్ని నేర్చుకున్నాడు. వేములపల్లి కృష్ణ, కొండపనేని బలరాం ప్రోత్సాహంతో రామకోటి, పురుషోత్తం బుర్రకథను నేర్చుకున్నారు. కాకుమాను సుబ్బారావు రచించిన సోవియట్ వీరవనిత బుర్రకథను వందలాది గ్రామాలలో చెప్పారు. గుంటూరు జిల్లా ప్రజానాట్య మండలి దళంలో సభ్యుడైన నాజర్‌ను రాష్ట్రద ళంలోకి ఆహ్వానించారు. సంచలనం సృష్టించిన మా భూమి నాటకంలో ప్రతినాయకుడైన జగన్నాథరెడ్డి దేశ్‌ముక్ పాత్రను అనితర సాధ్యంగా పోషించారు. అహమ్మదాబాద్‌లో జరిగిన 'ఇప్టా'మహాసభల్లో నాజర్ దళం ప్రదర్శించిన బుర్రకథకు ప్రథమ బహుమతి లభించింది. మద్రాసు ఆంధ్ర మహాసభ లో ఏర్పాటు చేసిన కార్యక్రమంలో నాజర్ బుర్రకథను విన్న గోవిందరాజుల సుబ్బారావు ఇదిగుంటూరు గోంగూర దెబ్బ అంటూ ప్రశంసించారు. గూడవల్లి రామబ్రహ్మం సినిమా కోసం తయారు చేసిన పల్నాటి వీరచరిత్ర కథను యిచ్చి బుర్రకథగా తయారు చేయమని ప్రోత్సహించారు.

పలనాటి వీరచరిత్రకథను బాపట్ల హైస్కూలులో చెబుతున్న సమయంలో బళ్లారి రాఘవ ఉద్వేగంతో వేదికపైకి వచ్చి కౌగిలించుకొని బావురుమన్నాడట. 1948లో ప్రజానాట్య మండలిపై మద్రాసు ప్రభుత్వం నిషేధం విధించడంలో నాజర్ కొండ గుహల్లో అజ్ఞాతవాసం చేశారు. కుటుంబసభ్యులపై పోలీసులు చేసిన అరాచకాలను తట్టుకోలేక మంగళగిరి క్యాంపు లో లొంగిపోయారు. ఆరు నెలల జైలుశిక్ష అనుభవించిన అనంతరం సుంకర రచించిన అల్లూరి సీతారామరాజు, కష్టజీవి, బుర్ర కథలను, వందలాది గ్రామాలలో చెప్పి,

(తరువాయి 54వ పేజీలో..)



పుట్టిల్లు చిత్రంలో బుర్రకథ చెబుతున్న నాజర్

# అగ్రగణ్యులు గుంటూరు జిల్లా.. నాటక రచయితలు


దామరాజు పుండరీ కాక్షుడు


విడదల సాంబశివరావు

(డాక్టర్ కందిమళ్ల సాంబశివరావు)

తెలుగు నాటక ఆరంభం నుంచి గుంటూరు జిల్లా నాటక రచయితలు అగ్రస్థానంలో నిలిచారు. తొలిదశలో కందుకూరికి పూర్వమే కొక్కొండ వెంకటరత్నం పంతులు, వావిలాల వాసుదేవశాస్త్రి రచయితలుగా చరిత్రలో నిలిచారు. కొక్కొండ సంస్కృత నాటక అనువాదానికి బీజం వేయగా, వావిలాల ఆంగ్ల నాటక అనువాదాలకు శ్రీకారం చుట్టారు. జిల్లాకు చెందిన కొండుభట్ల సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీరామ జననం, సీతా కల్యాణం, ప్రహ్లాద వంటి నాటకాలను రచించి ప్రదర్శించారు. తెలుగు నాటకరంగ చరిత్రలో అత్యంత ప్రజాధరణ పొందిన సత్యహరిశ్చంద్ర నాటకాన్ని బలిజేపల్లి లక్ష్మీకాంత రచించారు. త్రిపురనేని రామస్వామి చౌదరి, చలం, జీవీ కృష్ణారావు వంటి రచయితలు అద్భుతమైన హేతువాద నాటకాలను రచించారు.

తెల్లవారి గుండెల్లో నిద్రించిన జాతీయ నాటకకవి దామరాజు పుండరీ కాక్షుడు గాంధీ విజయం, గాంధీ స్వరాజ్యము, పాంచాల పరాభవం వంటి నాటకాలను రచించారు. దామరాజు నాటకాలను బ్రిటిష్ ప్రభుత్వం నిషేధించింది. జీ వేదాంత కవి జమీన్‌రైతు, రాజకోట, బ్రిటిష్ గయోపాఖ్యానం, తెలుగుతల్లి వంటి నాటకాలను రచించారు. వేదాంత కవి నాటకాలలో కొన్నింటిని బ్రిటిష్ ప్రభుత్వం నిషేధించింది. తెలుగుతల్లి నాటకంలో అక్కినేని కథానాయిక భారతి పాత్రను ధరించేవారు. కొప్పరపు సుబ్బారావు రచించిన రోషనార నాటకాన్ని బ్రిటిష్ ప్రభుత్వం నిషేధించింది.

ఆధునిక వీధి నాటిక ప్రక్రియలో తొలిసారిగా రచన చేసిన పోరాటకవి తిరునగరి రామాంజనేయులు వెట్టిచాకిరి నాటికను ఆశువుగా రచించి స్వయంగా ప్రదర్శించారు. గుర్రం జాషువా చిదానంద ప్రభాతము, వీరాబాయి వంటి నాటకాలను రచించారు. ఉన్నవ లక్ష్మీనారాయణ నాయకురాలు నాటకాన్ని రాసారు. రాజకీయ ఇతివృత్తాలతో నాటక రచన చేసిన తొలికవిగా బొల్లిముంత శివరామకృష్ణ చరిత్ర సృష్టించారు. రాజకీయ గయోపాఖ్యానం, రాజకీయ కురుక్షేత్రం, సంభవామి యుగేయుగే వంటి నాటకాలను బొల్లిముంత రచించారు. తొలి తెలుగు మూకాభినయ నాటక రచయితగా పేరుపొందిన అనిశెట్టి శాంతి, మానవుడు చిరంజీవి వంటి నాటకాలను రచించారు. ప్రఖ్య శ్రీరామమూర్తి కాళరాత్రి, ఫణి, దయ్యం వంటి నాటకాలు, నాటికలను రచించారు.

శతాధిక నాటక రచయిత డాక్టర్ కొర్రపాటి గంగాధరరావు రచించిన నాటకాలు, నాటికలు వాసిపరంగా, రాశిపరంగా ఉన్నతంగా నిలిచాయి. నాబాబు, పెళ్లిచూపులు, పుడమి తల్లికి పురిటి నొప్పులు, యథారాజా తథా ప్రజా వంటి నాటకాలను ఆయన రచించారు. గ్రామీణ ప్రాంత ఇతివృత్తి నేపథ్యంతో కొడాలి గోపాలరావు వందకు పైగా నాటకాలు, నాటికలను రచించారు. చైర్మన్, దొంగవీరడు వంటి నాటకాలు విశేష ప్రజాదరణను పొందాయి. ఆంధ్రనాటక కళాపరిషత్ పోటీలలో తొలి ఉత్తమనాటక రచయితగా ఎంపికైన కొండముది గోపాలరాయశర్మ రచించిన ఎదురీత నాటకం అభ్యుదయానికి దారులు వేసింది. బుర్రకథ పితామహుడు పద్మశ్రీ నాజర్ ఆసామి అనే నాటకాన్ని రచించి ఆంధ్ర నాటక కళాపరిషత్‌లో బహుమతిని పొందారు. సముద్రాల జూనియర్, ఆచార్య మొదలి నాగభూషణశర్మ, వడ్లమూడి సీతారామారావు, బెల్లంకొండ రామదాసు, కొర్రపాటి జేమ్స్, మోదుకూరి జాన్సన్, రెంటాల గోపాలకృష్ణ, పీవీ రావు, పి పాములయ్య

(తరువాయి 54వ పేజీ)

# సీత జాడ 'విన్న' కొండ



కొండపైన రామలింగేశ్వరస్వామి ఆలయం



రామలింగేశ్వరస్వామి మూలవిరాట్

(ఎం. విశ్వేశ్వరరావు వినుకొండ)

త్రేతాయుగంలో శ్రీరామచంద్రు డు అరణ్య వాసానికే గినపుడు సీతాదేవిని అపహరించుకువెళ్ళే సమ యంలో జటాయివుపక్షి లంకాధీశునితో పోరాడి నిస్సహాయురాలుగా మిగి లింది. ఆ సమయంలో సీతాన్వేషణ చేస్తూ వచ్చిన శ్రీరామచంద్రుడికి సీతాపహరణ గురించి విన్నవించుకొని జాటాయువు అసువులు బాసింది. సీతాపహరాణ గురించి మొదటగా శ్రీరామచంద్రుడు జటాయివు ద్వారా విన్న ప్రాంతమే నేటి వినుకొండ. నాటి విన్నకొండే కాలక్రమే ణా వినుకొండగా మారింది. రావణ సంహరణ అనంతరం శ్రీరామచంద్రుడు సీతాసమేతం గా వినుకొండ కొండపై శ్రీ రామలింగేశ్వరుడ్ని ప్రతిష్ఠించాడని ప్రజలనానుడి. అంతేకాకుండా ఈ కొండపై శ్రీరామచంద్రు డు సీతాసమేతంగా వనవాస సమయంలో కొంత కాలం ఇక్కడ గడిపాడని చెప్పేందుకు ఆనవాలు గా కొండపై 'సీతగుండం', 'రామగుండం' అనే నీటి కొలనులున్నాయి. అదేవిధం గా సీతాదేవి వామనగుంటలు ఆడినట్లు సొరంగమార్గంలో జానకిబండ అనే పేరుతో కొండపై గుహ వుంది. రావణుడితో యుద్ధసమయంలో మరణించిన జటాయివు పక్షి రెక్కలున్నట్లు చరిత్రకారులు చెపుతున్నారు. వినుకొండ చారిత్రాత్మక ప్రాధాన్యతను సంతరించుకోవడంతో ప్రతియేడాది అషాడశుద్ధ ఏకాదశి(తొలి ఏకాదశి) పర్వదినాన తిరునాళ్ళ ఘనంగా జరుపుకుంటారు. కొండకు నాలుగు వైపులా రక్షణగా ఆంజనేయస్వామి దేవాలయాలుండటం ప్రాధాన్యతను సంతరించుకుంది. చిన్నకొండపై వినాయకస్వామి, ఉగ్ర నరసింహస్వామి దేవాలయాలున్నాయి. ఉగ్ర నరసింహస్వామి దేవాలయాన్ని గజని మహమ్మద్ ధ్వంసం చేసి నిధులు కొల్లగొట్టి ఆలయ ప్రాంగణంలోనే మసీదును నిర్మించినట్లు చరిత్రకారులు చెబుతున్నారు. కొండపక్కన ఉన్న గుంటి ఆంజనేయస్వామి దేవాలయం కూడా ప్రసిద్ధి చెందింది.

## బుర్రకథకు పర్యాయపదం పద్మశ్రీ నాజర్

(52వ పేజీ తరువాయి)

అశేష ప్రేక్షకులను ఉర్రూతలూగించారు. డాక్టర్ రాజారావు నిర్మించిన 'పుట్టినిల్లు' చిత్రంలో రాణి రుద్రమ బుర్రకథను చెప్పారు. నాజర్ రచించిన 'ఆసామి' నాటకం ఆంధ్రనాటకం ఆంధ్రనాటక కళాపరిషత్ పోటీలలో ప్రథమ బహుమతిని పొందింది. రాయలసీమ కరువు, బొబ్బిలియుద్ధం,వీరాభిమన్యు అనే బుఱ్ఱకథలను పిట్టలదొర, నాచేతి మాత్ర అనే ఏకపాత్రలను రచించారు. అగ్గిరాముడు, భలేబావ, నిలువు దోపిడీ, పెత్తందార్లు, నగటుమనిషి చిత్రాలలో బుఱ్ఱకథలను చెప్పారు. కాకినాడలో రథానికి 70 జతల ఎడ్లను కట్టి, పురవీధులలో ఊరేగించి స్వర్ణగండపెండేరాన్ని బహూకరించి నాజర్‌కు 'బుఱ్ఱకథా సామ్రాట్' అనే బిరుదును ప్రదానం చేశారు. ఆగ్రా, బొంబాయి, అహమ్మదాబాద్, కలకత్తా, టాటానగర్ లలో బుఱ్ఱకథలు చెప్పారు. సినీనటి జమున నాజర్ వద్ద శిష్యరికం చేసి నటనలో మెళకువలను నేర్చుకున్నారు. 1986లో కేంద్ర సంగీత నాటక అకాడమీ పురస్కారాన్ని పొందారు. ముఖ్యమంత్రి హోదాలో ఎన్.టి రామారావు గుంటూరు పర్యటించిన సమయంలో తాను 'నాజర్' అభిమానినని ప్రకటించారు. వరంగల్లులో నాజర్ బుఱ్ఱకథను విన్న ప్రజాకవి కాళోజి బంగారు నక్షత్రాన్ని బహూకరించి తలపాగాకు అలంకరించారు. 'పండించేవానికి భోజనానికి బొత్తిగలేదు. పేదల కష్టం ప్రభువుల పాలు. బాధలన్ని మన పల్లెల పాలు..' అంటూ పల్లీయుల గాథలను, చెప్పి ఒక కంట నీరును, ఒక కంట ఉద్రేకాన్ని పరవళ్లు తొక్కించిన నాజర్ 1997 ఫిబ్రవరి 22న గుంటూరు అమరావతి రోడ్డులోని స్వగృహంలో కన్నుమూశారు.

## రోశయ్యను ఓడించిన గోగినేని ఉమ

(ఆన్‌లైన్ – గుంటూరు)



1999 అసెంబ్లీ ఎన్నికల్లో డాక్టర్ రోశయ్యను దివంగత ఆలపాటి వెంకటరామయ్య మనవరాలు డాక్టర్ గోగినేని ఉమ ఓడించారు. 1999 అసెంబ్లీ ఎన్నికల్లో ఆయన తెనాలి నుంచి కాంగ్రెస్ తరపున బరిలోకి దిగారు. ఆ ఎన్నికల్లో సిట్టింగ్ ఎమ్మెల్యేగా ఉన్న డాక్టర్ రావి రవీంద్రనాథ్‌కు టిక్కెట్ ఇవ్వకుండా తెలుగుదేశం పార్టీ డాక్టర్ గోగినేని ఉమను తటస్థుల కోటాలో బరిలోకి దించారు. ప్రతిష్టాత్మకంగా జరిగిన ఈ ఎన్నికల్లో రోశయ్య సామాజిక వర్గం ఆయనకు పెద్ద ఎత్తున ఆర్థికంగా అండగా ఉంది. అయినా ఆ ఎన్నికల్లో ఉమ రోశయ్యను సుమారు 4వేల ఓట్ల తేడాతో ఓడించారు. సిట్టింగ్ ఎమ్మెల్యేగా ఉన్న ఉమ 2004లో ఓడిపోగా 2009లో ఆమెకు తెలుగుదేశం పార్టీ టిక్కెట్ కూడా ఇవ్వలేదు. రోశయ్య 2004లో చీరాల నుంచి ఎన్నికై మంత్రిగా పని చేశారు. తర్వాత ఎమ్మెల్సీగా ఎన్నికై వైఎస్ మరణానంతరం ముఖ్య మంత్రిగా కొనసాగుతున్నారు.

## అగ్రగణ్యులు గుంటూరు జిల్లా నాటక రచయితలు

(53వ పేజీ తరువాయి)

కోనా గోవిందరావు, గన్నిశెట్టి వెంకటేశ్వరరావు, వై శంకరరావు, ఎం దివాకరబాబు, కేఎస్‌టీ సాయి, ఎన్ తారక రామారావు, సోంపల్లి బాపయ్యచౌదరి, పీవీ రామకుమార్, కె న్యూటన్, వల్లూరి శివప్రసాద్, సుంకర కోటేశ్వరరావు, కావూరి సత్యన్నారాయణ, నుసుము నాగభూషణం, ఎస్ చంద్రశేఖర్, వైఎస్ కృష్ణేశ్వరరావు, వరికూటి శివప్రసాద్, దోనేపూడి రాజారావు, ఆరిశెట్టి శివన్నారాయణ, అద్దేపల్లి భరత్‌కుమార్, ఆచార్య కొలకలూరి ఇనాక్, మన్నే శ్రీనివాసరావు, జీ రమేష్‌బాబు, టీ ఫణీంద్ర, షేక్ హుస్సేన్, మండెపూడి పూర్ణ, ఎన్‌వీ రమణ, పనసాల, జరుగుల రామారావు, గోళ్లపాటి నాగేశ్వరరావు, గంథం నాగరాజు, బుర్రా సాయిమాధవ్, పీవీ శరణ్, చెరుకూరి సాంబశివరావు, విడదల సాంబశివరావు, గంజి రామారావు, తోట నరసింహారావు వంటి రచయితల నాటకాలు, నాటికలు విశేష ప్రజాదరణను పొందాయి.

# ఉబికి వస్తున్న జలధారలు

## కరువు తెలియని నరసింగపాడు - సంవత్సరానికి రెండు పంటలు

(ఆన్‌లైన్, నకరికల్లు)

సాగు నీటి కరువు తెలియని గ్రామం గుంటూరు జిల్లా నకరికల్లు మండలంలోని నరసింగపాడు. రూపాయి ఖర్చు లేకుండా 365 రోజులూ ఉబికి వచ్చే గంగమ్మతో రైతులు వరి సాగు చేస్తున్నారు. ఈ గ్రామానికి ప్రకృతి ఇచ్చిన వరం రైతుల అభివృద్ధికి బాటలు వేసింది. పొలాల్లో బోరు వేస్తే పాతాళ గంగ ఉబికి వస్తూ సిరులు పండిస్తుంది. గతంలో రాష్ట్రమంతటా కరువు కాటకాలతో రైతాంగం అల్లాడింది. ఈ గ్రామంలో మాత్రం ఉబికి వస్తున్న గంగమ్మ.. రెండు పంటల వరి సాగును అందించింది. తాగునీటి సమస్య ఆ గ్రామ దరి చేరదు. బోర్ల నుంచి వస్తున్న గంగమ్మ పరవళ్ళను చూసి ప్రతి ఒక్కరూ సంభ్రమాశ్చర్యాలకు లోనవుతుంటారు. గ్రామానికి ఆనుకొని ఉన్న శివాలయం ప్రాంతంలో బోర్లు నుంచి జలధారలు భూమిపైకి ఎగబాకుతున్నాయి. ఈ బోర్ల కింద 500 నుంచి 600 ఎకరాలు వరి సాగవుతోంది. గత ఏడాది ఎకరాకు 35 నుంచి 40 బస్తాల ధాన్యం దిగుబడి వచ్చింది. ఇలా రెండు పంటలు పండించి మూడో పంటగా గేదెలకు గడ్డి సాగు చేయడం ఇక్కడ ఆనవాయితీ. గ్రామంలో 20 నుంచి 30 బోర్లలో గంగమ్మ భూమి పైకి ఉబికి వస్తున్న దృశ్యాలు కన్పిస్తూ ఉంటాయి. మోటార్లతో పని లేకుండా నీరు పైకి రావడంతో ఆ నీటిని కాల్వల ద్వారా పొలాలకు మళ్ళించుకుంటున్నారు. పొలాల్లో వినియోగించుకోగా మిగిలిన నీటిని వాగుల్లోకి వదిలేస్తున్నారు. దీంతో నెమలపురి తదితర ప్రాంతాలలో ఈ వాగు నీటితో కొందరు రైతులు పొలాలు సాగు చేస్తున్నారు. ఒక్కొక్క బోరు నిర్మాణ వ్యయం రూ.20వేలు అవుతుందని రైతులు పేర్కొంటున్నారు. నరసింగపాడులో 50 శాతం కుటుంబాలు ఈ బోర్లపై ఆధారపడి జీవనం సాగిస్తున్నాయి. 300 నుంచి 350 అడుగుల లోతు వరకు ఈ బోర్లు ఏర్పాటు చేశారు. గ్రామానికి కిలోమీటరు దూరంలో ఇటువంటి బోర్లు పడ్డ దాఖలాలు లేవు. అక్కడ రైతులు బోర్లకు మోటార్లు బిగించుకొని సాగు నీటిని వాడుకోవాల్సివుంది. నరసింగపాడు జీవన విధానాన్ని జలధారలు మార్చి వేశాయి. బోర్లు లేక ముందు ఎకరం రూ.లక్ష ఉండగా, ప్రస్తుతం రూ.10 లక్షలు దాటింది. జలధారలు ఎలా వస్తున్నాయన్న విషయాన్ని ఎవరూ కనుగొనే ప్రయత్నం చేయలేదు. గ్రామస్తులు మాత్రం గుత్తికొండ బిళం ఉందని, ఈ బిళంలో ఎప్పుడూ నీరు ప్రవహిస్తుందని, ఆ నీరు తమ పొలాల మీదుగా వెళ్తున్నందున ఇలా వస్తుందని రైతులు చెపుతున్నారు. సాగర్ కెనాల్ నీరులాగే దీని రుచి ఉంటుంది. శివాలయానికి వచ్చే భక్తులు బోర్ల నుంచి వస్తున్న నీటిని పుణ్య జలంగా భావిస్తున్నారు. సమీపంలో నదీ ప్రవాహం లేనప్పటికీ శివుని గంగ భూమిపైకి దిగివచ్చినట్లు సంవత్సరం పొడవునా అమృత జలధారలు కురిసినట్టు భూగర్భ జలం పైకి ఉబికి వస్తుంది. స్వచ్ఛమైన జలాలు పైకి ఉబికి రావటంతో శివాలయానికి వచ్చే భక్తులు ఈ ఆలయం మరో మహానందిగా పేరుగాంచినదని పేర్కొంటున్నారు.



బోర్ల నుంచి ఉబికి వస్తున్న జలం

















# ఆయుధపూజ

## పల్నాటి చరిత్రకు సజీవ సాక్షాలు

(ఆన్‌లైన్, కారంపూడి)

ప్రపంచవ్యాప్తంగా చరిత్రలెన్నో ఉద్భవించాయి. కొన్ని చరిత్రలు కాల గర్భంలో కలిసిపోయాయి. మరి కొన్ని చరిత్రలు చెరగని ముద్ర వేశాయి. క్రీ.శ. 1181లో జరిగిన పల్నాటి యుద్ధం.. ప్రతీ పల్నాటి పౌరుడి హృదయాల్లో నేటికి మారు మోగుతూనే ఉంది. అలనాటి చరిత్రకు వీరులువాడిన ఆయుధాలే సాక్ష్యాలుగా నిలిచాయి. అమరత్వాన్ని అణువణువునా నింపుకొని వీరపూజలందుకుంటున్నాయి. ఆ ఆయుధాలే దేవుళ్లుగా అలరారుతూ పూజలందుకోవటం చాలా అరుదు. అలాంటి సంస్కృతి రోమ్ నగరం తర్వాత పల్నాడులోనే కనపడుతుంది. ఇక్కడి ఆయుధాలు శాసిస్తాయి.. కత్తులు నర్తిస్తాయి అంటూ కథలు కథలుగా చెప్పుకుంటారు.

ఏటా జరిగే పల్నాటి ఉత్సవాలలో వివిధ ప్రాంతాల నుంచి వచ్చిన వారు అలనాటి భీకర పల్నాటి యుద్ధ దృశ్యాలను స్ఫురణకు తెచ్చుకొని, వీరావేశంతో ఒళ్లు గగుర్పొడిచేలా వీరంగం వేస్తారు. ఇంతటి ప్రాచుర్యం పొందిన పల్నాటి ఆయుధాలకు ఎంతో విశిష్టత ఉంది. శైవ వైష్ణవ సాంప్రదాయాలకు అద్దం పట్టే ప్రాచీన ఆయుధాలు ఎన్నో కనుమరుగు కాగా కొన్ని మాత్రం ఇప్పటికీ చెక్కుచెదరకుండా ఉన్నాయి.

**బ్రహ్మనాయుడి నృసింహ కుంతలం**

త్రిశూలాకారంలో ఉన్న ఈ ఆయుధం పల్నాటి వీరుల ఆయుధాల అన్నింటిలో అత్యంత ముఖ్యమైనది. 'రాగోల' అనే పిలిచే ఈ ఆయుధం 64 కోణాలు కలిగి విశ్వకర్మచే తయారు చేయించి చెన్నకేశవ వరప్రసాదంగా బ్రహ్మనాయుడికి ఇచ్చినట్లు చరిత్ర చెబుతుంది. పరమ భీకర అరణగండ్ల యుద్ధం తరువాత బ్రహ్మనాయుడికి ఈ ఆయుధం లభించినట్లు చెబుతుంటారు. వీరారాధన ఉత్సవాలలో మాత్రం సేవాస్థలంలో ఉంచి మిగిలిన అన్ని రోజులు చెన్నకేశవ దేవాలయంలో ఈ ఆయుధాన్ని ఉంచి పూజలు నిర్వహిస్తారు.

**కన్నమదాసు భైరవ ఖడ్గం**

ఒక్కవేటుకు ఆరుతలలు నేలకు రాల్చగలిగే అత్యంత శక్తిమంతమైన ఆయుధంగా భైరవఖడ్గం పేరుగాంచింది. కాలభైరవ ఉపాస ఫలితంగా ఈ ఆయుధం కన్నమదాసుకు సంక్రమించింది. దీని బరువు దాదాపు 15 కేజీలు ఉంటుంది. మాచర్ల రాజ్యానికి సర్వసైన్యాధ్యక్షుడైన కన్నమదాసు ఈ ఆయుధంతోనే విజయకీర్తి సంపాదించాడని ప్రతీతి.

**బాలచంద్రుడి సామంతరాగోల**

అత్యంత పిన్నవయసులోనే రణరంగంలో దిగి తన సామంతరాగోల ఖడ్గంతో శత్రువుల కుత్తుకలను కత్తిరించిన సాహసవీరుడు బాలచంద్రుడు. ఈ సామంత రాగోల ఖడ్గం చెన్నకేశవ వరప్రసాదంగా బ్రహ్మనాయుడు చేతుల మీదుగా బాలచంద్రుడికి అందినట్లు పేర్కొంటున్నారు.

**అలరాజు సూర్య బేతాళం**

అత్యంత శౌర్యప్రతాపాలు కల్గిన వీరుడుగా పేర్కొన్న అలరాజుకు సూర్యవర ప్రసాదంగా సూర్యబేతాళం అనే ఆయుధం సంప్రాప్తించింది. కనులు మిరమిట్లు గొలిపే ఈ ఆయుధం చేబూని అలరాజు గొప్ప యోధుడిగా పేరొందాడు. నాయకురాలు నాగమ్మ తంబళ్ల పెద్దితో చేయించిన విషప్రయోగం ఫలితంగా అలరాజు పల్నాటి యుద్ధానికి ముందే మరణించాడు.

**నాగమ్మ వీర ఖడ్గం**

నాయకురాలు నాగమ్మకు శివప్రసాదంగా వీరఖడ్గం లభించిందని చరిత్ర చెబుతోంది. బ్రహ్మనాయుడి సైన్యం మంత్రాలమ్మ కనుమదాటకుండా స్వయంగా నాగమ్మే ఆయుధం చేబూని అడ్డు నిలిచిందని, దానికి ప్రతీకగా పక్కనున్న కొండను నరికి బ్రహ్మనాయుడు మార్గం చేసుకొని యుద్ధరంగానికి వచ్చాడని చరిత్ర తెలుపుతుంది. ఈ ఆయుధం చేబూనగా ఆమెను ఎదుర్కొనే శక్తి ఒక్క బ్రహ్మనాయుడుకు మినహా మరెవ్వరికి లేదని, అంతటి మహిమాన్వితమైనదిగా చెబుతారు.

**మాంచాల కనకదుర్గ ఖడ్గం**

బాలచంద్రుడి అర్ధాంగి మాంచాలకు కనకదుర్గ అమ్మవారి ఖడ్గం లభించిందని చరిత్ర తెలుపుతుంది. ఈ ఖడ్గం చేతిలో ఉన్నంతవరకు శత్రు సైన్యం ధాటికి రణరంగంలో నిలవలేక పోయింది. భర్త మరణించాడని యుద్ధరంగంలో తెలుసుకున్న మాంచాల నీరసించి ఖడ్గాన్ని జారవిడవటంతో శత్రువులు ఆమెను చుట్టుముట్టినట్లు తెలుస్తుంది.

ఈ ఆయుధాలతో పాటు అనుగురాజు సేనాని, అత్యంత నిష్ఠాగరిష్ఠుడైన విప్పలనేనికి అంకాళమ్మ అమ్మవారి ఆశీసులతో ఆయుధం పొంది అనేక యుద్ధాలలో గెలిచినట్లు తెలుస్తుంది. భిన్నక్రమాలలో ఉన్న కత్తులు, ఈటెలు, బల్లెలు, శూలాలు, కటారులు, ముద్గరాలు వాడినట్లు చరిత్రను బట్టి తెలుస్తుంది. ఆయుధాలన్నీ పంచలోహ నిర్మితమైనవి.



బ్రహ్మనాయుడి నృసింహ కుంతలం



కన్నమదాసు భైరవ ఖడ్గం

కొన్ని వందల సంవత్సరాలైనా తప్పుపట్టక పదును కలిగి ఉన్నాయి. కేవలం ఇటుకరాయి పొడితే రుద్దితే తళతళలాడే ఈ ఆయుధాలు పల్నాటి వీరుల స్పూర్తిని దశదిశలా వ్యాప్తి చేస్తున్నాయి.



బాలచంద్రుడి సామంతరాగోల



అలరాజు సూర్యబేతాళం

## అంతర్జాతీయ ప్రమాణాలతో

# మహిళా ఇంజనీరింగ్ కళాశాల



ఇంజనీరింగ్ కళాశాల భవన సముదాయం

(ఆన్‌లైన్-బాపట్ల)

బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ ఆధ్వర్యంలో అత్యాధునిక సౌకర్యాలతో ఏర్పాటు చేసిన మహిళా ఇంజనీరింగ్ కళాశాలను.. అంతర్జాతీయ ప్రమాణాలతో నిర్వహిస్తున్నారు. ఆర్ట్స్ అండ్ సైన్సు కళాశాల వెనుక ప్రాంగణంలో మహిళా ఇంజనీరింగ్ కళాశాల, హాస్టల్ భవన సముదాయాన్ని నిర్మించారు. హాస్టల్‌లో ఏసీ ఏర్పాటు చేశారు. విద్యార్థినుల భద్రతను దృష్టిలో ఉంచుకొని దేశంలో మరెక్కడా లేని విధంగా సంపూర్ణ వసతులతో కళాశాలను ఏర్పాటు చేశారు. దీనిని గత ఏడాది ప్రారంభించారు. విద్యాభివృద్ధికోసం 60 కంప్యూటర్లను ప్రత్యేకంగా ఏర్పాటు చేశారు. మొదటిగా ఈసీఈలో 60 సీట్లు, కంప్యూటర్ ఇంజనీరింగ్‌లో 60 సీట్లు, ఈఈఈలో 60 సీట్లు ఉండేవి. ఈ ఏడాది ఈసీఈ, కంప్యూటర్ ఇంజనీరింగ్‌లో 60 సీట్ల చొప్పున పెంచి రెండు సెక్షన్లను అదనంగా ఏర్పాటు చేశారు. అయినప్పటికీ కౌన్సెలింగ్‌లో అన్ని కోర్సులకు కన్వీనర్ కోటలోనే సీట్లు పూర్తయ్యాయి. అ తరువాత మేనేజ్‌మెంట్ సీట్ల కోసం అనేకమంది విస్తృత ప్రయత్నాలు చేశారు. విద్యార్థినులకు అవసరమైన మరో భవన నిర్మాణం కూడా చేపడుతున్నట్లు ఎడ్యుకేషన్ సొసైటీ అధ్యక్షుడు ముప్పలనేని శేషగిరిరావు తెలియజేశారు. మహిళా కళాశాలలో మహిళా అధ్యాపకులనే ఏర్పాటు చేశారు. విద్యార్థినులపై జరుగుతున్న అరాచకాలను దృష్టిలో ఉంచుకొని ఆడపిల్లలను బయటకు పంపాలంటే తల్లిదండ్రులు భయపడుతున్నారని, దీనిని దృష్టిలో ఉంచుకొని బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ ఏకకాలంలో తీర్మానం చేసి అత్యాధునిక సౌకర్యాలతో ఇంటర్నేషనల్ స్థాయిలో మహిళా ఇంజనీరింగ్ కళాశాలను ఏర్పాటు చేసి రెండేళ్ళగా నిర్వహిస్తున్నది.

### ఎడ్యుకేషన్ సొసైటీ ఆధ్వర్యంలో నిర్వహిస్తున్న కళాశాలలు

బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ ఆధ్వర్యంలో బాపట్ల ఇంజనీరింగ్ కళాశాల, బాపట్ల ఫార్మసీ కళాశాల, పాలిటెక్నిక్ కళాశాల, ఆర్ట్స్ అండ్ సైన్సు కళాశాల, బాపట్ల జూనియర్ కళాశాల, బాపట్ల పబ్లిక్‌స్కూల్‌లో నిర్వహిస్తున్నారు. ప్రతి కళాశాలను ఎడ్యుకేషన్ సొసైటీ అధ్యక్షుడు ముప్పలనేని శేషగిరిరావు ఉదయం, సాయంత్రం సందర్శించి విద్యాబోధన, హాజరు, కావాల్సిన వసతులు తదితర అంశాలపై క్షుణ్ణంగా పరిశీలిస్తుంటారు. దీంతో ప్రతి కళాశాలలో వంద శాతం ఉత్తీర్ణతతో పాటు అంతర్జాతీయ పురస్కారాలు లభిస్తున్నాయి. బాపట్ల ఇంజనీరింగ్ కళాశాల ఐఐటీ లొకేషన్‌లో ప్రథమశ్రేణి వచ్చింది. దీంతో మిగిలిన కళాశాలలు కూడా అదే బాటలో పయనిస్తున్నాయి. బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ అంతర్జాతీయ ప్రమాణాలతో విద్యాకుసుమాలను వెదజల్లుతున్నది.



వాలేశ్వరా లయంలోని నందీశ్వరుడు

# చారిత్రక దివ్య శైవక్షేత్రం 'చావలి'



చావలిలోని వాలేశ్వరాలయం



గుంటూరు జిల్లా, వేమూరు మండలంలోని చావలి గ్రామంలో చరిత్ర ప్రసిద్ధి చెందిన దివ్యశైవ క్షేత్రంగా శ్రీవాలేశ్వరాలయం భాసిల్లుతోంది. త్రేతాయుగంలో వాలి పూజ చేస్తున్న శివలింగాన్ని శ్రీరామచంద్రుడు ఇక్కడ ప్రతిష్ఠ చేసి, వాలేశ్వరుడు అని పేరు పెట్టినట్లు చరిత్ర చెబుతోంది. 1489 శకానికి సరైన 'ప్రభవ' సంవత్సర మాఘ శుద్ధ ఏకాదశి రోజున బొద్దులూరు అనే గ్రామాన్ని ఈ ఆలయంలో నిత్యకైంకర్యాదుల నిమిత్తం అర్చకులకు అమృతరాయల వారు, దారాదత్తం చేశారు. శ్రీ వరప్రతాప శ్రీరంగ మహారాయలవారు గోపీనాధ స్వామిని ప్రతిష్ఠించి, అర్చకులకు అయిదు కుచ్చెళ్ల ఈ నాము (భూములు) ఇచ్చారు. ఈ విధంగా చరిత్ర పుట్టల్లోకి ఎక్కిన ఈ గ్రామంలోనే వాలేశ్వరాలయంలో ప్రతిరోజూ విశేష కైంకర్యాదులు జరుగుతుంటాయి. విశిష్ఠ అద్వైత మతాచార్యులు శ్రీమాన్ త్రిదండి శ్రీమన్నారాయణ జీయర్ స్వామి వారు అష్టోత్తర శత రామకోటి స్తంభాల ప్రతిష్ఠల్లో భాగంగా ఈ గ్రామంలోనే చతుర్థ స్తంభాన్ని ఏర్పాటు చేయటం విశేషం. ముక్తికి సోపానంగా ఎనిమిది దిక్కులా రామ మందిరాల నిర్మాణం కూడా జరిగింది. వాలేశ్వరాలయానికి ఎదురుగా ఉన్న కోనేటి (మిగతా 60వ పేజీలో...)

## తెనాలి రైల్వే చరిత్ర ఘనం

# అభివృద్ధి అంతంత మాత్రం



తెనాలి జంక్షన్

స్వాతంత్రోద్యమ కాలంలో ప్రపంచ ప్రజల దృష్టిని ఆకర్షించిన సన్నివేశాలు, సంఘటనలను నింపుకున్న తెనాలి రైల్వే స్టేషన్ గుంటూరు జిల్లాలో ప్రముఖ రైల్వే జంక్షన్‌గా పేరొందింది. ఒకనాడు కేవలం రెండు ప్లాట్ ఫారాలతో, అరకొర సౌకర్యాలతో స్టీమ్ ఇంజన్ల రొద మధ్య ప్రస్తుత చెన్నై నాటి మద్రాసు-హౌరాల మధ్య రైలు మార్గంలో ఉన్న ఈ జంక్షన్ ప్రయాణికుల అవసరాలను తీర్చేదిశలో గణనీయమైన అభివృద్ధి సాధించింది. అభివృద్ధితో పాటు స్టేషన్ ఆదాయం కూడా పరిగణింపదగిన స్థాయికి చేరుకుంది. ఈ స్టేషన్ గత పదేళ్ల కాలం వరకు సామాన్యమైన రైల్వేస్టేషన్‌గా ప్రయాణీకులకు నామమాత్రపు సౌకర్యాలు అందిస్తూ వచ్చింది. ప్రయాణీకుల అవసరాలకు తగిన విధంగా కొన్నాళ్ల క్రితం అభివృద్ధి పనులు జరిగాయి. గతంలోని పాత బుకింగ్ ఆఫీసును పడగొట్టి అధునాతన భవన సముదాయం, వీఐపీల కోసం ప్రత్యేక లాంజ్, నాలుగు, ఐదు ప్లాట్‌ఫారాల నిర్మాణం, ఫుట్ ఓవర్ బ్రిడ్జి పొడిగింపు, కంప్యూటర్ రిజర్వేషన్ సౌకర్యం స్టేషన్‌లో సౌకర్యాలను కల్పించారు. దీనితో హౌరా – చెన్నయ్ రైలు మార్గంలో విజయవాడ తర్వాత, పెద్ద స్టేషన్‌గా తెనాలి జంక్షన్ రూపుదిద్దుకుంది. దీనికి తోడు పట్టణంలో ఓవర్ బ్రిడ్జి ఆవల వైపున ఉన్న చెంచుపేట పరిసర ప్రాంతాల ప్రజల సౌకర్యాన్ని దృష్టిలో ఉంచుకుని స్టేషన్‌కు పడమర వైపున మరో బుకింగ్ కార్యాలయం ఏర్పాటైంది. ప్లాట్‌ఫారంల సంఖ్య ఐదుకు పెరగటం వల్ల ఈ మార్గంలో రైళ్ల రద్దీ వల్ల ఏర్పడే సమస్యలకు పరిష్కారం లభించినట్లయింది. చెన్నయ్ - విజయవాడ రైలు మార్గంలో తెనాలి జంక్షన్ మీదుగా రోజూ 65 రైళ్లు ప్రయాణిస్తుంటాయి. ఇవి కాక జిల్లా కేంద్రమైన గుంటూరుకు పది, రేపల్లె వైపునకు ఏడు రైళ్లు ప్రయాణిస్తుంటాయి. ఈ స్టేషన్ నుంచి ప్రతి రోజూ మొత్తం 80కిపైగా రైళ్ల రాకపోకలు సాగుతుంటాయి. ప్రతి 15 నిమిషాలకు ఒక గూడ్స్ రైలు, వాటికి తోడు సూపర్‌ఫాస్ట్ రైళ్లు ప్రయాణిస్తుంటాయి. రవాణా సదుపాయాలతో పాటు స్టేషన్ ఆర్థికంగా కూడా దక్షిణ మధ్య రైల్వేలో గణనీయమైన స్థానంలో ఉంది. జీటీ ఎక్స్‌ప్రెస్, జన్మభూమి వంటి ఎక్స్‌ప్రెస్‌లతో తెనాలి స్టేషన్ ప్రాధాన్యం పెరిగింది. గతంలో మంగళ ఎక్స్‌ప్రెస్ తెనాలి మీదుగా ప్రయాణించేది. ఆ ఎక్స్‌ప్రెస్‌ను కొంకణ్ రైల్వే ద్వారా మళ్లించినందున, ప్రస్తుతం తెనాలి జంక్షన్ మీదుగా నడుపుతున్న కేరళ ఎక్స్‌ప్రెస్‌కు తెనాలి హాల్టింగ్ సౌకర్యాన్ని కల్పించాలని ప్రయాణికులు కోరుతున్నారు.

### ప్రజా ప్రతినిధుల శీతకన్ను

గత కొన్నేళ్ళుగా తెనాలి స్టేషన్ అభివృద్ధిపై ప్రజా ప్రతినిధులు శీతకన్ను ప్రదర్శిస్తున్నారు. ఇటీవలి కాలంలో తెనాలికి ఒక్క కొత్తరైలు హాల్టు లేకపోగా, సికింద్రాబాద్ నుంచి నడిచే ఇంటర్‌సిటీ ఎక్స్‌ప్రెస్ రద్దు చేసి దానిని జన్మభూమిగా విశాఖపట్నం వరకు పొడిగించారు. ఫలితంగా తెనాలి ప్రాధాన్యాన్ని తగ్గించి వేసినట్లయింది. పల్నాడు ఎక్స్‌ప్రెస్‌ను తెనాలి వరకు పొడిగించాలన్న అభ్యర్థన కూడా నెరవేరడం లేదు. రేపల్లె నుంచి సికింద్రాబాద్‌కు డెల్టా ఫాస్ట్ ప్యాసింజర్ మినహా తెనాలి కోసం ప్రత్యేకంగా ఒనకూర్చిన రైల్వే సౌకర్యాలు ఇటీవల లేవనే చెప్పాలి.

– యార్లగడ్డ శరత్‌బాబు, తెనాలి



# మహిమాన్విత కొండూరు మహంకాళి అమ్మవారు



కంతంరాజు కొండూరు
శ్రీ మహంకాళి అమ్మవారు

కృష్ణా, గుంటూరు జిల్లాల్లో భక్తులు విశేషంగా కొలిచే ప్రసిద్ధ ఆలయాల్లో శ్రీమహంకాళి అమ్మవారి దేవస్థానం ఒకటి. జిల్లాలోని దుగ్గిరాల మండలం కంతంరాజుకొండూరు గ్రామ పొలిమేరలో అమ్మవారు కొలువై ఉంది. ఆలయం భక్తుల ఆదరణతో దినదినాభివృద్ధి చెందుతోంది. 2006-07 సంవత్సరంలో 11 లక్షల రూపాయల ఆదాయం కలిగిన మహంకాళి ఆలయం 2009-10 నాటికి 3 రెట్లు పెరిగి 35 లక్షల రూపాయల ఆదాయాన్ని చేరుకుంది. మంగళగిరి నుంచి తుమ్మపూడి చిలువూరు మీదుగా 12 కిలోమీటర్ల దూరంలో అమ్మవారి ఆలయం ఉంది. అదే విధంగా గుంటూరు నుంచి విజయవాడ బైపాస్ రోడ్డులోనికి నంబూరు మీదుగా 20 కిలోమీటర్ల దూరంలోనూ, విజయవాడ నుంచి 22 కిలోమీటర్ల దూరంలోనూ, తెనాలి నుంచి దుగ్గిరాల, మంచికలపూడి మీదుగా 17 కిలోమీటర్ల దూరంలోనూ ఆలయం ఉంది. గ్రామానికి ఈశాన్య భాగంలో తూర్పు ముఖంగా చతుర్భుజాలు కలిగి విరాజిల్లుతున్న అమ్మవారు వెలసిన వృత్తాంతం విశేషంగా చెప్పుకుంటారు.

1975 మే నెల రెండో తేదీన దేవా భక్తుని సుబ్బారావు పసుపు కల్లంలో సంధ్య వేళ సేద తీర్చుకుంటుండగా, గజ్జెల సవ్వడి ఆలాపనగా వినిపించింది. అంతలోనే ఈశాన్య దిక్కున ఉన్న పొలంలో తవ్వించి తనను వెలికి తీయాల్సిందిగా ఎవరో తనకు చెప్పినట్లు స్వప్నంలో మాదిరిగా వినిపించింది. దీంతో గ్రామంలో ఒకరికి డబ్బు ఇచ్చి ఆ స్థలాన్ని తవ్వించమని సూచించారు. ఇద్దరు వ్యక్తులకు చెప్పినప్పటికీ ఆచరించ లేదు. తదుపరి ఆ ప్రదేశంలో సుబ్బారావు తవ్వించగా సున్నపు కట్టుబడితో ముఖ మండప నిర్మాణం కలిగి ఆ మండపంలో పద్మాసనాసీను రాలైన రూపంతో అమ్మవారి విగ్రహం బయట పడింది. చోళ రాజుల కాలంలో చింతామణి రాయితో రూపొందించబడిన అమ్మవారిని దండయాత్రలకు వెళ్లే ముందు దర్శించి ఖడ్గ పూజలు జరిపిన అనంతరం తరలి వెళ్లేవారని చరిత్ర చెబుతోంది. ఔరంగజేబు దండయాత్ర కాలంలో కూల్చిన హిందూ దేవాలయాల్లో మహంకాళి అమ్మవారి ఆలయం కూడా ఒక్కటై ఉండవచ్చునని తెలుస్తోంది.

చరిత్ర మాట ఎలా ఉన్నా, అమ్మవారి విగ్రహాన్ని బయటకు తీసిన అనంతరం 1977 మే 12వ తేదీన ఉదయం 6.45 నిమిషాలకు ఆలయ పునః ప్రతిష్ఠా కార్యక్రమాన్ని నిర్వహించారు. నాటి నుంచి నేటి వరకు నిత్యం ధూప, దీప నైవేద్యాలతో భక్తులు అమ్మవారిని పూజించి తరిస్తున్నారు.

ప్రతి ఆదివారం విజయవాడ నగర పరిసరాలతో పాటు మంగళగిరి, గుంటూరుల నుండి భక్తులు విశేషంగా ఆలయానికి వస్తుంటారు. దసరా సందర్భంగా నవరాత్రి ఉత్సవాలను అత్యంత వైభవంగా నిర్వహిస్తుంటారు. కార్తీక మాసం, అమ్మవారి మాస నక్షత్ర దినాలలో, ఇతర పర్వదిన వేడుకలలో వార్షిక పూజలు, ఉత్సవాలు ఘనంగా నిర్వహిస్తుంటారు. ఇటీవలే భారీ కల్యాణ మండపాన్ని, వాహనాల పార్కింగ్ ఏర్పాటు చేస్తున్నారు. అత్యంత భక్తి ప్రపత్తులతో ఈ అమ్మవారిని దర్శించే వారికి కోరిన కోర్కెలు తీరుతాయనేది ప్రగాఢ విశ్వాసం.

– సీహెచ్ శ్రీనివాసరావు, దుగ్గిరాల

































# రాజకీయ యోధుల పుట్టిల్లు తెనాలి

తెలుగుజాతి పరాక్రమ కీర్తి చంద్రికలను దిశదిశలా వ్యాపింపజేసిన ఘన చరిత్ర గల గుంటూరు జిల్లాలో తెనాలి ప్రాంతానికి ఒక ప్రత్యేక స్థానం ఉంది. ఇచట పుట్టిన చిగురు కొమ్మయినా చేవ కలిగి ఉండు అన్నట్టుగా మొక్కవోని రాజకీయ ధీరతకు తెనాలి ప్రాంతం అనాదిగా ఆటపట్టుగా ఉంటూ వస్తోంది. ఎత్తులతో చిత్తులు చేసే రాజకీయ వైకుంఠపాళిలో నిచ్చెనలెక్కి ఉన్నత స్థానాలను అందుకున్న ఎందరో రాజకీయ నేతలకు పుట్టినిల్లుగానే కాక, నిచ్చెనలు జారి రాజకీయ వలన వచ్చిన మరికొందరు నేతలకు అదృష్టపు మెట్టినిల్లుగా కూడా తెనాలి ప్రసిద్ధి కెక్కింది. రాష్ట్ర రాజకీయాలను సైతం ఒక మలుపు తిప్పగల ఎందరో రాజకీయ యోధానయోధులను తెనాలి తీర్చిదిద్దింది. ఒకనాడు రామలింగని పేరు చెబితే తెనాలి గుర్తుకు వచ్చేది. నేడు తెనాలి పేరు చెబితే స్ఫురణకు వచ్చేది మాత్రం రాజకీయ ఉద్దండులే. అలాంటి వారిలో తెనాలి మున్సిపల్ ఛైర్మన్‌గా రాజకీయ జీవితానికి నాంది పలికి రాష్ట్ర చరిత్రలో ప్రతిష్టాత్మక మంత్రి వర్గం నీలం సంజీవరెడ్డి మంత్రి వర్గంలో పురపాలక, దేవాదాయ శాఖల మంత్రిగా పనిచేసి సేవలందించిన ఆలపాటి వెంకట్రామయ్యను తెనాలి ప్రథమ యోధగా చెప్పవచ్చు. మంత్రిగా పదవి చేపట్టి వచ్చిన అలపాటిని ఏనుగు అంబారీపై ఊరేగించి ఆయన పట్ల గల గౌరవాభిమానాన్ని ఈ ప్రాంత ప్రజానీకం చాటుకుంది. ఇప్పటికీ వెంకట్రామయ్య పేరు వినగానే తెనాలి ప్రజలకు ఆనాటి అంబారీ ఊరేగింపు కళ్లల్లో కదలాడుతుంది. వెంకట్రామయ్యకు సమ ఉజ్జీగా రాజకీయ వేత్తగా గుర్తింపు పొందిన వారిలో నన్నపనేని వెంకట్రావు అగ్రగణ్యులు.

తెనాలిలో ప్రథమంగా డిగ్రీ కళాశాలను స్థాపించి విద్యావేత్తగా కూడా నన్నపనేని వినుతికెక్కారు. ఈ కళాశాల (వీఎస్ఆర్ అండ్ ఎన్‌వీఆర్) రాష్ట్రంలో పెద్ద కళాశాలల్లో ఒకటిగా పరిగణించబడుతోంది. ఆనాటి రాజకీయ మూర్తి త్రయంగా పేరొందిన ఆలపాటి, నన్నపనేని కాంగ్రెస్ పార్టీకి చెందిన వారు కాగా, రావి అమ్మయ్య కార్మిక ఉద్యమంలో కాకలు తీరిన కమ్యూనిస్టు పార్టీకి చెందిన వారు. తెనాలి పరిసర ప్రాంతానికి చెందిన రాజకీయ వేత్తలలో అందరికన్నా ముందుగా చెప్పదగిన వారు కల్లూరి చంద్రమౌళి. స్వాతంత్రోద్యమం, మరెన్నో ఉద్యమాలలో కీలకపాత్ర నిర్వహించిన చంద్రమౌళి ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో మంత్రిగా పనిచేశారు. రాజకీయ ఆధ్యాత్మిక రంగాలను సమభావంతో చూసిన కల్లూరి రాజకీయ రంగాలలో ఒక ఆణిముత్యం. కేంద్ర మంత్రిగా భారత ప్రథమ ప్రధాని నెహ్రూ ప్రశంసలందుకున్న కొత్త రఘురామయ్య కూడా తెనాలి ప్రాంతం వారే. కాసు బ్రహ్మానందరెడ్డి మంత్రి వర్గంలో పనిచేసిన వెనిగళ్ల సత్యనారాయణ ఇక్కడకు సమీపంలోని దుగ్గిరాలకు చెందిన వారు. మత్స్యశాఖ మంత్రిగా ఆయన ఈ ప్రాంత సర్వతోముఖాభివృద్ధికి కృషి చేశారు. నిజాంపట్నం చేపల హార్బర్‌కు ప్రథమ రూపశిల్పి సత్యనారాయణనే ఇప్పటికీ ఎవరినడిగినా చెబుతారు. రాజకీయంగా లబ్ధ ప్రతిష్టులైన పుతుంబాక శ్రీరాములు (పెదపాలెం), అవుతు రామిరెడ్డి సీనియర్ (కొల్లిపర) ఈ ప్రాంతానికి చెందిన వారే.

## రెండవ తరం

తెనాలి రాజకీయ చరిత్ర ద్వితీయ అధ్యాయంలో చెప్పుకోదగిన రాజకీయ వేత్తలు చాలామంది ఉన్నారు. వారిలో మున్సిపల్ ఛైర్మన్‌గా ప్రజలలో ఒక పదిలమైన స్థానాన్ని నిలుపుకొని శాసన సభ్యునిగా, రాష్ట్ర పౌర సరఫరాల శాఖామాత్యునిగా పనిచేసిన అన్నాబత్తుని సత్యనారాయణ ఒకరు. ఆయన హయాంలో తెనాలి ప్రాంతం గణనీయంగా అభివృద్ధి సాధించింది. ఆలపాటి వెంకట్రామయ్య తనయ, 17 సంవత్సరాల పాటు శాసనసభలో తెనాలి నియోజకవర్గానికి ప్రాతినిధ్యం వహించి, జిల్లా పరిషత్ తొలి మహిళా అధ్యక్షురాలైన దొడ్డపనేని ఇందిర మహిళా రాజకీయవేత్తగా రాణించి ఈ ప్రాంతానికి ఎనలేని ఖ్యాతిని తెచ్చిపెట్టారు. అన్నాబత్తుని సత్యనారాయణ తర్వాత తెనాలి నుంచి శాసనసభకు ఎన్నికైన మాజీ ముఖ్యమంత్రి నాదెండ్ల భాస్కరరావు ఈ ప్రాంతానికి చెందిన వారే. మున్సిపల్ ఛైర్మన్‌గా, ఎమ్మెల్యేగా పనిచేసిన డాక్టర్ రావి రవీంద్రనాధ్ ఈ ప్రాంతాన్ని అభివృద్ధి పథంలో నడిపించారు. ప్రస్తుత ముఖ్యమంత్రి కొణిజేటి రోశయ్య, రాజకీయాలలో ఉన్నత విలువలను అభిలషించిన మాజీ మంత్రి ఆలపాటి ధర్మారావు, మహిళా ఉద్యమాలతో రాజకీయ జీవితాన్ని ప్రారంభించిన నన్నపనేని రాజకుమారి, రాజ్యసభ మాజీ సభ్యుడు యడ్లపాటి వెంకట్రావు, మాజీ మంత్రి గొల్లపూడి వేదాంతరావు, నవ తరానికి చెందిన డాక్టర్ గోగినేని ఉమ, ఆలపాటి రాజేంద్రప్రసాద్, ప్రస్తుతం తెనాలి శాసనసభ్యుడు, డిప్యూటీ స్పీకర్ నాదెండ్ల మనోహర్ మొదలైన వారు రాజకీయంగా పూర్వీకుల అడుగుజాడల్లో నడుస్తూ ఈ ప్రాంత అభివృద్ధికి కృషి చేస్తున్నారు.

– యార్లగడ్డ శరత్‌బాబు, తెనాలి

# చారిత్రక దివ్య శైవక్షేత్రం ...





మూలవిరాట్ స్వరూపుడైన వాలేశ్వరస్వామి, పార్వతీ అమ్మవారు

(58వ పేజీ తరువాయి)

జలంలో పాదప్రక్షాళన చేసుకుని, ఆలయ ప్రవేశ ద్వారం వద్దకు వచ్చినంతనే మనోహరంగా కనిపించే ద్వారపాలక శిల్పాలు ఉంటాయి. ముఖ మండపంలో నందీశ్వరుడు దర్శనమిస్తాడు. పానువట్టంపై దర్శనమిచ్చే, లింగాకృతిని చూడగానే భక్తులు తన్మయత్వం చెందుతారు. స్వామికి ఎడమభాగంలో పార్వతీదేవి ఆలయం ఉంది. ఆలయంలో చతుర్ముఖ బ్రహ్మ, వీరభద్ర స్వామి వార్లతో పాటు ఆలయానికి ఉత్తర దిక్కున వాహనాధీశులైన నవగ్రహాల రూపాలు దర్శనమిస్తాయి. శైవ ఆగమం ప్రకారం పూజలందుకుంటున్న స్వామివార్లకి ప్రతి సోమవారం, మాస శివరాత్రి, మహాశివరాత్రి, అశ్వీయుజ మాసం నుంచి మాఘ మాసం వరకు ప్రతి రోజూ ఏకాదశి రుద్రాభిషేకాలు నిర్వహిస్తారు. అమ్మవారికి దసరా నవరాత్రులలో విశేష అలంకారాలు చేసి, కుంకుమార్చనలు నిర్వహిస్తారు. ఆలయంలోని నందీశ్వరునకు భక్తులు తమ కోర్కెలు తీర్చుకోవటానికి, గుగ్గిళ్ల మూటను ఆయన మెడలో కడుతుండటం విశేషంగా కానవస్తోంది. గ్రామంలోని మగసంతానానికి దాదాపుగా వాలేశ్వరస్వామి పేరే పెట్టుకుంటారు. ఈ ఆలయానికి రాష్ట్రంలోనే కాక, రాష్ట్రేతర ప్రాంతం వారు కూడా వచ్చి స్వామిని దర్శించుకుంటారు.

– ఎం. శ్రీనివాసమూర్తి, వేమూరు



వాహనాధీశులైన నవగ్రహాలు

## ప్రగతి కాంతుల సిరి...

# మంగళగిరి



మంగళగిరి టౌన్ వ్యూ

(వి.బ్రహ్మానాయుడు)

మంగళగిరి అంటే ఒకప్పుడు ఉద్యమాల పుట్టినిల్లు... వామపక్ష భావజాలం ముసురుకున్న ఈ ప్రాంతమంటే పారిశ్రామికుల్లో ఓ రకమైన వెనుకంజ కనిపించేది. ఫలితంగా రెండు పెద్ద నగరాల మధ్య వున్న మంగళగిరి ఏడేళ్ల ముందునాటి వరకు సాధారణ పట్టణంగానే మిగిలిపోయింది. మరి ఇప్పుడేమో! మంగళగిరి ఓ 'మహానగరి'గా రూపు దాల్చబోతుంది. ఇంతలోనే ఎంత మార్పు!! అన్నట్టు మంగళగిరి మారిపోతుంది. ఈ మార్పు చారిత్రాత్మకమనే చెప్పుకోవాలి. ఎందుకంటే మంగళగిరి పట్టణ రూపురేఖలను మార్చివేసే అత్యద్భుతమైన ప్రణాళికా రచనలు కార్యరూపం దాల్చుతున్నాయి. ఇప్పటివరకు మంగళగిరి ప్రత్యేకత రెండింటికే పరిమితమైంది. అవి మంగళగిరి ఓ పెద్ద వైష్ణవ నారసింహ క్షేత్రం, ప్రపంచంలోనే పేరెన్నిక గన్న చేనేత కేంద్రం. కాని, ఇప్పుడు మంగళగిరి జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో ఇంకా గొప్ప గుర్తింపును పొందేవిధంగా సరికొత్త హంగులను ఏర్పరుచుకుంటుంది. అవేమంటే... మంగళగిరి పట్టణానికి పశ్చిమ శివారులో సుమారు 65 కోట్ల రూపాయల అంచనా వ్యయంతో అంతర్జాతీయ క్రికెట్ స్టేడియం నిర్మాణాన్ని రాష్ట్ర క్రికెట్ అసోసియేషన్ ఇప్పటికే చేపట్టింది. అయితే నిధులను దశల వారీగా మంజూరు చేస్తూ స్టేడియంకు అంచెలంచెలుగా అంతర్జాతీయ స్థాయి హోదాను తీసుకురానున్నారు.

మంగళగిరి యూనివర్సిటీ జనరల్ ఆసుపత్రి స్థానంలో కోస్తాజిల్లాల సూపర్ స్పెషాలిటీ ఆసుపత్రిని సుమా రు వంద కోట్ల వ్యయంతో నిర్మించనున్నారు. యూజీహెచ్‌కు చెందిన 214 ఎకరాలలో సుమారు వంద ఎకరాలను దీనికి కేటాయించనున్నారు. ఇక్క డే హైకోర్టు బెంచ్‌ను ఏర్పాటు చేయాలని కోస్తాజిల్లాల న్యాయవాదులు ప్రభుత్వంపై ఒత్తిడిని తెస్తున్నారు. యూజీహెచ్‌కు చెందిన మరో 50 ఎకరాల స్థలంలో ఎన్‌డీఆర్‌ఎఫ్ వారి ప్రత్యేక బెటాలియన్‌ను ఏర్పాటు చేసేందుకు ప్రతిపాదించారు. ఇవన్నీ మంగళగిరికి మహత్తరమైన ప్రాజెక్టులు. ఇంతటితో కాకుండా మంగళగిరి నియోజకవర్గం పరిధిలో కొత్తగా రెండు ఎస్ఈజడ్‌లకు ప్రభుత్వం ప్రాధమిక అనుమతిని మంజూరు చేసింది. వీటిలో ఒకటి ఉడా టౌన్‌షిప్ పరిధిలో నే 43 ఎకరాల విస్తీర్ణంలో మంజూరై వుండగా, మరొకటి నాగార్జున యూనివర్సిటీ ఎదురుగా గల లింగమనేని ఎస్టేట్స్ వారి భూమిలో 110 ఎకరాలకు అనుమతి లభించింది.

ఇక్కడే లింగమనేని సంస్థ ఐజెయం వారి నేతృత్వంలో మరో బ్రహ్మాండమైన టౌన్‌షిప్‌కు శ్రీకారం చుట్టింది. ఇంతేకాకుండా మంగళగిరి - విజయవాడ బైపాస్ మార్గం వెంట మరో 100 ఎకరాల విస్తీర్ణంలో ఇంకొక ప్రైవేటు సంస్థ మలేషియా టౌన్‌షిప్ నిర్మాణానికి సర్వే చేస్తుంది. మంగళగిరి పట్టణానికి నైరుతి శివారులో కొత్తగా ఆటోనగర్ ఆవిర్భవించింది. ఏపీఐఐసీకి చెందిన ఈ ప్రాంతంలో సుమారు 40 ఎకరాల విస్తీర్ణంలో టైర్ల ఫ్యాక్టరీని నిర్మించేందుకు ప్రతిపాదనలు వున్నాయి. అలాగే చేనేత క్లస్టర్‌ను కూడా ఇక్కడ ఏర్పాటు చేయాలని భావిస్తున్నారు. ఇవన్నీ ఒక ఎత్తయితే... ఇప్పటికే మంగళగిరి నియోజకవర్గం పరిధిలో ఓ రెండు పెద్ద ప్రైవేటు ఆసుపత్రులు, ప్రైవేటు వైద్య కళాశాల, ప్రైవేటు ఇంజనీరింగ్ కళాశాల వున్నాయి. వీటికి తోడు ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం వుండనే వుంది.

(మిగతా 64వ పేజీలో)



మంగళగిరి గాలిగోపురం



ఏపీఎస్పీ ఆరవ బెటాలియన్ ప్రధాన కార్యాలయం

# వెండితెరను ఏలిన జిల్లా వెలుగులు


సావిత్రి


జమున

**తెలుగు చలనచిత్ర పరిశ్రమ ఆరంభం నుంచి వర్తమానం వరకు అగ్రశ్రేణి కథానాయకులకు కృష్ణా జిల్లా పురుడుపోస్తే... అభినయం అందచందాలు సమపాళ్లలో కలిసిన కథానాయికలను, గుండెలు పిండే విషాదాన్ని, వళ్లు జలదరించే విలనిజాన్ని, కడుపుబ్బ నవ్వించే హాస్యాన్ని పండించిన మహనీయ నటులకు వేదికగా నిలిచిన ఘనత గుంటూరు జిల్లాకు దక్కుతుంది.**


పోసాని


ధూళిపాళ్ల


ప్రభ


ప్రదీప్‌శక్తి

యువతరం కలల రాణిగా, వెండితెర దేవతగా అలనాటి హాలీవుడ్ తార కాంచనమాల (తెనాలి). విప్రనారాయణ, గృహలక్ష్మి, మాలపిల్ల, మళ్లీపెళ్లి, మైరావణ, వందేమాతరం వంటి చిత్రాలలో నటించిన కాంచన మాల తెలుగు కళామతల్లి ముద్దుబిడ్డగా నిలిచారు. అంతగొప్ప అందగత్తె ఇప్పటి వరకు తెలుగు తెరపై వెలుగు జిలుగులను విరజిమ్మలేదనేది సినీ పండితుల ఉవాచ. కళ్లు, పెదవులలోని అనితర సాధ్యమైన నటనను ఆవిష్కరిస్తూ, అభినయానికి అభినేత్రిగా నిలిచిన సావిత్రి (వడ్డేవారిపాలెం) స్వాతిశయం, స్వాభిమానాలకు పెట్టిందిపేరుగా కొంచెం వగరు, కొంచెం పొగరు కలగలిసిన పాత్రలకు పెట్టింది పేరుగా నిలిచిన జమున (దుగ్గిరాల), అభినవ సీతామహాసాధ్విగా అఖిలాంధ్ర ప్రేక్షకుల నీరాజనాలను అందుకున్న సాధ్వీనటీమణి శ్రీరంజని (మురికిపూడి), అమాయకత్వం, ముగ్ధ మోహనత్వాలను శంకరాభరణం ద్వారా చిలికిన రాజ్యలక్ష్మి(తెనాలి), చక్కని అభినయాన్ని ప్రదర్శించిన సుమలత(గుంటూరు) ఈ జిల్లావాసులే. గొల్లభామ, సతీఅనుసూయ, మోహినీ భస్మాసుర వంటి చిత్రాలలో నటించిన అలనాటి రంగస్థల సినీనటి దాసరి కోటిరత్నం(ప్రత్తిపాడు), గయ్యాళి పాత్రలకు జీవం పోసిన ఛాయాదేవి (తిక్కిరెడ్డిపాలెం), ప్రేక్షకుల మనోఫలకాలపై చిరముద్రనువేసిన కళ్యాణి (తెనాలి), మహాకవి కాళిదాసు, నర్తనశాల వంటి సంచలనాత్మక కళాఖండాల చిత్ర నిర్మాతగా, అపవాదు, పంతులమ్మ, మంగళసూత్రం, రాజు-పేద వంటి చిత్రాలలో ప్రముఖ పాత్రలను పోషించిన లక్ష్మీరాజ్యం(తెనాలి) ఇక్కడి వారే. హరికథా కళాకారిణిగా రాష్ట్ర వ్యాప్తంగా పేరుపొంది నీడలేని ఆడది చిత్రం ద్వారా వెండితెరకు పరిచయమైన ప్రభ (తెనాలి), సర్పయాగం, ఎర్రమల్లెలు వంటి వందలాది చిత్రాలలో నటించిన రంగస్థల సినీనటి శివపార్వతి (తెనాలి) జిల్లా కీర్తి కిరీటంలో వెలలేని మణులుగా రాణించారు. అలనాటి నటి జి వరలక్ష్మి, షావుకారు చిత్రం ద్వారా పరిచయమై సినిమా పేరునే ఇంటి పేరుగా మార్చుకున్న జానకి, కుల గోత్రాలు, భార్యాభర్తలు, భార్యాబిడ్డలు, ఉమ్మడి కుటుంబం, వరకట్నం వంటి చిత్రాలలో నటించిన కృష్ణకుమారి జిల్లాకు చెందిన వారే. తులాబారం, స్వయంవరం, నిమజ్జనం వంటి చిత్రాల ద్వారా మూడు సార్లు జాతీయస్థాయిలో ఉత్తమనటిగా ఊర్వశి పురస్కారాలను పొందిన శారద(తెనాలి)లకు పురుడుపోసింది గుంటూరు జిల్లానే.

సతీసావిత్రి, శ్రీకృష్ణలీలలు, సతీతులసి, ద్రౌపది వస్త్రాపహరణం, జరాసంధ, భక్తమార్కండేయా, దక్షయజ్ఞం వంటి చిత్రాలలో ప్రతి నాయిక పాత్రలను పోషించిన వేమూరి గగ్గయ్య(వేమూరు), మళ్లీ పెళ్లి, షావుకారు, కన్యాశుల్కం, పల్నాటి యుద్ధం వంటి చిత్రాలలో నటించిన డాక్టర్ గోవిందరాజుల సుబ్బారావు(తెనాలి) గొప్ప నటులుగా రాణించారు. ఈలపాటతో ఆంధ్రావనిని ఉర్రూతలూగించిన కళ్యాణం రఘురామయ్య(సుద్దపల్లి), నరకాసు వధ, భక్తకుచేల, గొల్లభామ, రుక్మిణీ కళ్యాణం వంటి చిత్రాలలో శ్రీకృష్ణునిగా, నారదునిగా ఆ పాత్రలకు జీవం పోశారు. ద్రౌపది మాన సంరక్షణ, సతీ తులసి, విజయదశమి, నలదమయంతి చిత్రాలలో పలు పాత్రలను పోషించిన మహానటుడు మాధవపెద్ది వెంకట్రామయ్య(తెనాలి), విప్రనారాయణ, పెద్ద మనుషులు, కన్యాశుల్కం, మాయా బజార్ వంటి చిత్రాలలో హాస్యాన్ని పంచిపెట్టి నవ్వుల పువ్వులను పూయించిన వంగర వెంకటసుబ్బయ్య (సంగం జాగర్లమూడి), లవకుశ, కృష్ణలీలలు, కాళిదాసు వంటి సినిమాల ద్వారా గాన మాధుర్యాన్ని తెలుగు వారికి విని పించిన పారుపల్లి సుబ్బారావు (తెనాలి), పెద్ద మనుషులు, భక్తపోతన, స్వర్గసీమ, ఆకాశరామన్న వంటి చిత్రాలలో నటించిన జంధ్యాల గౌరీనాథశాస్త్రి (గుంటూరు), భక్త తుకారాంలో నటించిన ముదిగొండ లింగమూర్తి (తెనాలి), ప్రియురాలు, బంగారుపాప, తోడికోడళ్లు, కలెక్టర్ జానకి, అల్లూరి సీతారామరాజు వంటి 300 చిత్రాలకు పైగా నటించిన కొంగర జగ్గయ్య(మోరంపూడి), తోడు దొంగలు, మహా మంత్రి తిమ్మరుసు, రాజమకుటం వంటి వందలాది చిత్రాలలో నటించి అసమాన క్యారక్టర్ నటుడిగా కీర్తి పొందిన గుమ్మడి వెంకటేశ్వరరావు (కొలకలూరు), భీష్మ చిత్రంతో పరిచయమైన ధూళిపాళ సీతారామశాస్త్రి (దాచేపల్లి), తెలుగు తెరపై ప్రతినాయకుడిగా రాణించిన ముక్కాముల (గుంటూరు), విలక్షణమైన డైలాగ్ డెలివరీతో గొప్ప నటునిగా తెలుగు సినీ చరిత్రలో నిలిచిపోయిన సిఎస్ఆర్ ఆంజనేయులు (నరసరావుపేట), డేరింగ్ డాషింగ్ హీరో సూపర్‌స్టార్‌కృష్ణ(బుర్రిపాలెం), ఆయన కుమారుడు మహేష్‌బాబు,అలనాటివిలన్‌గా పేరుపొందినకోనాప్రభాకరరావు(బాపట్ల), స్త్రీ జన్మ చిత్రం ద్వారా పరి చయమై యజ్ఞం చిత్రం ద్వారా జాతీయ స్థాయిలో ఉత్తమ సహా యనటునిగా అవార్డును పొందిన పిఎల్‌నారాయణ(బాపట్ల), వర్ధమాన సినీ హీరో శివాజి (గొరజవోలు), హాస్యనటులు డాక్టర్ బ్రహ్మానందం(సత్తెనపల్లి), ఏవీఎస్(తెనాలి),జీవా(గుంటూరు), ప్రదీప్‌శక్తి (గుంటూరు) గొప్పనటులుగా రాణించారు. సముద్రాలజూనియర్, సీనియర్ (రేపల్లె), ఎన్నో అనువాద చిత్రాలకు మాటలు, పాటలు అందించిన అనిశెట్టి సుబ్బారావు (నరసరావుపేట) పలు చిత్రాలకు కథా, మాటల రచయితగా రాణించిన డాక్టర్ కొర్రపాటి గంగాధర రావు(బాపట్ల), 50 చిత్రాలకు మాటల రచయితగా వ్యవహరించిన బలిజేపల్లి లక్ష్మీకంతా కవి (ఇటికంపాడు), ఎం దివాకరబాబు (గుంటూరు), తెలుగు తెరపై సెటైర్ డైలాగుకు ఒక వరవడిని సృష్టించిన బొల్లిముంత శివరామకృష్ణ (తెనాలి) ఇక్కడి వారే. రైతుబిడ్డ, పేరంటాలు చిత్రాలకు దర్శకుడిగా, నవలా రచయిత త్రిపురనేని గోపీచంద్ (తెనాలి), మరో ప్రపంచం, దేశోద్ధారకులు, నేటి భారతం వంటి చిత్రాల రచయిత మోదుకూరి జాన్సన్(కొలకలూరు), పండంటి కాపురం, గాంధీపుట్టిన దేశం, కార్తీక దీపం చిత్రాల రచయిత మద్దిపట్ల సూరి(తెనాలి), నాటక, సినీ రచయిత వైఎస్ కృష్ణేశ్వరరావు (పొన్నూరు), వర్ధమాన రచయిత కోన వెంకట్(బాపట్ల), పోసానికృష్ణమురళి(పెదకాకాని)చిత్ర సీమలో రాణించారు.

తెలుగు సినిమాకు విజ్ఞాన సర్వస్వంగా నిలిచిన చక్రపాణి(తెనాలి), పద్మాలయ సంస్థ నిర్వాహకులు జి ఆదిశేషగిరిరావు, హనుమంతరావు (బుర్రిపాలెం), రాజారమేష్, బంగారక్క, బలిపీఠం వంటి చిత్రాల నిర్మాత ముప్పలనేని శేషగిరిరావు(నరసాయపాలెం), జగత్‌కిలాడీలు వంటి క్రైం చిత్రాల నిర్మాత ఏకాంబరేశ్వరరావు (జమ్ములపాలెం), మానవుడు - దానవుడు వంటి చిత్రాలు నిర్మించిన చిన్నపరెడ్డి (గురజాల), జాతీయస్థాయిలో తెలుగు సంస్కృతిని ప్రతిబింబించే కళాఖండాలను చిత్రించిన కె విశ్వనాథ్ (పెదపులివర్రు), గూఢాచారి 116 వంటి చిత్రాలకు దర్శకత్వం వహించిన ఎం మల్లి ఖార్జునరావు (మురికిపూడి), ఎం శివనాగేశ్వరరావు (తక్కెళ్లపాడు), భీమనేని శ్రీనివాసరావు (తాతపూడి), సముద్ర (బోయపాలెం) గుంటూరు జిల్లా వాసులే. రంగుల రాట్నం వంటి చిత్రాలకు సంగీతాన్ని సమకూర్చిన బి గోపా ళం (మంగళగిరి), రెండు దశబ్దాలు తెలుగు చలనచిత్ర సీమను శాసిం చిన కొమ్మినేని చక్రవర్తి, శ్రీ(పొన్నెకల్లు), సినీ మధురగాయనిగా రాణించిన జానకి (రేపల్లె), మధుర గాయకుడు మనో (సత్తెనపల్లి), అద్భుతమైన గానంతో అలరించిన మాధవపెద్ది సత్యం (తెనాలి) మన జిల్లాకు ఎనలేని కీర్తి ప్రతిష్ఠ లను తెచ్చారు. కళాదర్శకులుగా మాగోఖలే (తెనాలి), సోమనాథ్ (చిలకలూ రిపేట), సినీ పాత్రికేయులుగా కొడవటిగంటి కుటుంబరావు, ఇంటూరి వెంకటేశ్వరరావు(తెనాలి) జిల్లా కీర్తిబావుటాలను ఎగురవేశారు.


శివాజీ

**డాక్టర్ కందిమళ్ల సాంబశివరావు**


బ్రహ్మానందం


సుమలత


ఏవీఎస్


జీవా


గుమ్మడి


జానకి


శారద


కృష్ణ

# అభివృద్ధి చెందిన గోవాడ శైవ క్షేత్రం

(ఆన్‌లైన్ - అమృతలూరు)

అమృతలూరు మండలం గోవాడ లోని పురాతన శైవ క్షేత్రం ఎంతగానో అభివృద్ధి చెందింది. దశాబ్దం క్రితం వరకు వసతుల సమస్యతో ఉన్న ఆలయ ప్రాంగణం దాతలు, ట్రస్టు బోర్డు, అధికారుల సహాయ సహకారాలతో అభివృద్ధి దిశగా అడుగులు వేస్తుంది. జిల్లాలోని ప్రసిద్ధి చెందిన శైవ క్షేత్రాలలో ఒకటైనా ఈ ఆలయానికి విశిష్ట చరిత్ర ఉంది. మహా శివరాత్రి పర్వదినం వైభవంగా జరిగే ఆలయాలలో జిల్లాలో ఈ క్షేత్రానికి రెండవ స్థానం దక్కుతుంది. మహిమాన్వితుడైన బాలకోటేశ్వర స్వామిని మహాశివరాత్రి పర్వదినాన తెనాలి డివిజన్‌లోని భక్తులు విశేష సంఖ్యలో దర్శించుకుంటారు. గోవాడ గ్రామానికి సుమారు కిలోమీటరు దూరంలో ఉన్న ఆలయ ప్రాంగణం 11వ శతాబ్దంలో దగ్గుమిల్లి అనే గ్రామంగా వ్యవహరింపబడేది. జైనులు ఎక్కువగా ఈ గ్రామంలో నివశించే వారు. 12శతాబ్దంలో బౌద్ధులు, వీరశైవుల మధ్య ఘర్షణలు జరిగి దగ్గుమిల్లిపై పడి అరాచకం సృష్టించటంతో భయపడిన జైనులు తమ గోవులతో దూరంగా ఉన్న పొలాలకు తరలివెళ్ళి తలదాచుకున్నారు. గోవులతో ఉన్న ఆ ప్రాంతం నేటి గోవాడ గ్రామంగా మారింది. ప్రముఖ కవి శ్రీనాధ కవిసార్వభౌముడు కూడా దగ్గుమిల్లికి చెందిన తిప్పన్న కుమార్తెను వివాహమాడి సోమేశ్వరస్వామిని అర్చిస్తూ శృంగార నైషధం రచించినట్లు తెలుస్తోంది. కాలచక్ర గమనంలో 20శతాబ్దం వచ్చింది. బ్రాహ్మణ కోడూరుకు చెందిన కూచిపూడి తిరుపతిరాయుడు బాటసారుల కోసం చెరువు త్రవ్వించేందుకు విరాళాల నిమిత్తం గోవాడ వచ్చి సోమేశ్వరస్వామి ఆలయ శిధిలాల వద్ద నిద్రించిన ఆయనకు ఈశ్వర ప్రభోదం కలిగి 1904లో ఆలయ నిర్మాణాన్ని పునర్మించేందుకు శ్రీకారం చుట్టారు. 1907లో నిర్మాణం పూర్తి కాగా శివరాత్రి ఉత్సవాలు ప్రారంభమయ్యాయి. దాతల సహాయ సహకారాలతో ఆలయానికి మహా ముఖమండపం, ముఖద్వారం, కార్యాలయం, గణపతి, ఆంజనేయస్వామి ఆలయం, విశిష్ట నవగ్రహాలయం వంటి వసతులు సమకూరాయి. గోవాడ నుండి ఆలయం వరకు ప్రభుత్వం రహదారి నిర్మించింది. శ్రీశైలం లో నిర్వహించే సర్పదోష నివారణ పూజలను ఈ ఆలయంలో కూడా జరిపేందుకు రాహు, కేతు విగ్రహాలను ప్రతిష్ఠించారు. దాతల సహకారంతో ఆలయం వద్ద మరిన్ని దార్మిక కార్యక్రమాలను చేపట్టారు. ఈ ఆలయానికి తెనాలి నుండి బస్సులో చేరుకోవచ్చు.


శ్రీ బాలకోటేశ్వరస్వామి ఆలయం


స్వామివారి మూలవిరాట్

# ప్రగతి కాంతుల సిరి

# 'మంగళగిరి'

(61వ పేజీ తరువాయి)

ప్రత్యేక పోలీసు పటాలాన్ని (ఆరవ బెటాలియన్), మూడు జిల్లాలకు చెందిన పోలీసు యంత్రాంగానికి ఉపకరించే ఫైరింగ్ రేంజ్ ఏరియా తాడేపల్లి మండలం నులకపేటలోనే వుంది.

ఆధ్యాత్మికంగా కూడ మంగళగిరి నియోజకవర్గం సుప్రసిద్ధమైంది. ఈ నియోజకవర్గంలో శ్రీ మంగళాద్రి లక్ష్మీ నృసింహస్వామి వారి దేవస్థానంతో పాటు చారిత్రాత్మకమైన ఉండవల్లి గుహాలయాలు, కృష్ణా తీరాన శ్రీ జియ్యర్ స్వామి, శ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజి ఆశ్రమాలు వున్నాయి. ఇక మంగళగిరి పట్టణానికి సుమారు నాలుగైదు కిలోమీటర్ల దూరంలో వున్న పెనుమాక కొండపై పాతకాలం నాటి కోట అవశేషాలు వున్నాయి. ఈ కొండపై కోట ప్రాకారం గోడ ఆనవాళ్లు, అనేక కోనేరులు, వ్యవసాయం చేసిన ఆనవాళ్లు ఇప్పటికి కనిపిస్తాయి.

మంగళగిరికి మంచి భవిష్యత్తు వుందనేది ఇపుడు అందరినోట వినవస్తున్న మాట!. తెలంగాణా నినాదం మరింత బలపడి రాష్ట్ర విభజన అంటూ జరిగితే ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రానికి మంగళగిరే సరికొత్త రాజధాని నగరంగా అవతరిస్తుందనేది పలువురి ఉవాచ.

అదే జరిగితే మంగళగిరి రాష్ట్రంలోనే ఓ పెద్ద మహానగర మవుతుందనడంలో సందేహం అక్కర్లేదు.



ఉడా టౌన్‌షిప్ మెయిన్‌గేటు

## పురాతన దేవాలయం

# విప్పర్ల వల్లభేశ్వర స్వామి దేవస్థానం

(ఆన్‌లైన్, విప్పర్ల(రొంపిచర్ల) మండలంలోని దేవాలయాలలో అతి పురాతన మైన దేవాలయం విప్పర్లలోని శ్రీ గంగా పార్వతి సమేత వల్లభేశ్వర స్వామి దేవస్థానం. ఈ దేవస్థానానికి క్రీస్తు శకం 4వ శతాబ్దంలో నిర్మించినట్టు అక్కడ వున్న శాసనాలు చెపుతున్నాయి. విప్పర్లలోని వల్లభేశ్వర స్వామి దేవస్థానానికి, చేజర్లలోని కపోతేశ్వర స్వామి దేవస్థానానికి దగ్గర సంబంధం వుంది. శ్రీకృష్ణ దేవరాయుల పరిపాలన కాలంలో చేజర్ల, కుంకలగుంట గ్రామాలకు కూడలిగా వున్న విప్పర్లకు వచ్చినట్టు శాసనాలపై వుంది. ఇంత పురాతన మైన దేవాలయాన్ని అధికారులు పట్టించుకోవటం లేదు. విప్పర్ల, రెడ్డిపాలెం, దాసరిపాలెం, కొత్తపల్లి, ఎడ్వర్డుపేట గ్రామాల ప్రజలకు ఈ వల్లభేశ్వర స్వామి మహిమాన్వితుడు. ప్రతి పర్వదినానికి ఇక్కడకు ప్రజలు అధిక సంఖ్యలో వస్తారు. ఈ ఆలయంలోనే శ్రీ లక్ష్మీ తిరుపతమ్మ తల్లి వెలిసింది. అదే విధంగా నాగేంద్ర స్వామి పుట్ట కూడా వుంది.



శ్రీ పార్వతి దేవి అమ్మవారి మూల విరాట్



శ్రీ వల్లభేశ్వర స్వామి మూల విరాట్

# ఆంధ్రా షిరిడీ... వడ్లపూడి

(ఆన్‌లైన్...మంగళగిరి రూరల్))

తెనాలి రోడ్డు వెంబడి పచ్చని పైర్ల నడుమ ఎంతో అందంగా, ఆధ్యాత్మిక భావాలను ముప్పిరిగొలిపే రీతిలో నిర్మించిన ఈ మందిరం స్వల్ప కాలంలోనే ఓ విశిష్టమైన సాయిమందిరంగా పేరొందింది. పెదవడ్లపూడిలోని శ్రీ షిరిడీ సాయినాధుని ఆలయ నిర్మాణం జరిగిన నాలుగేళ్లు పూర్తియై అయిదవ సంవత్సరంలోకి అడుగిడింది. ఈ సందర్భంగా పలు ఆధ్యాత్మిక, సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వాహకులు ఏర్పాటు చేసి నాల్గవ వార్షికోత్సవాన్ని అత్యంత వైభవోపేతంగా నిర్వహించి వేలాది మందికి అన్నదాన కార్యక్రమం నిర్వహించారు. ఈ ఆలయ నిర్మాణానికి జిల్లా పరిషత్ మాజీ ఛైర్మన్ పాతూరి నాగభూషణం నడుం కట్టారు. తన పదవీకాలంలో పెదవడ్లపూడిని ఓ ఆదర్శమైన గ్రామంగా తీర్చిదిద్దిన పాతూరి గ్రామంలో ఓ మంచి బడి, ఓ మంచి గుడి వుండాలన్న ఆశయంకొద్దీ అత్యాధునిక సౌకర్యాలతో కూడిన జిల్లా పరిషత్ హైస్కూల్‌ను, మనసును ప్రశాంత పరిచే వాతావరణంతో కూడిన శ్రీ షిరిడీ సాయినాధుని మందిరాన్ని నిర్మింపజేశారు. ఇదే మందిర ప్రాంగణంలో ముచ్చటగొలిపే రీతిలో శ్రీ విఘ్నేశ్వరస్వామి ఆలయాన్ని కూడా నిర్మించారు. ఈ మందిరానికి అనుబంధంగా వడ్లపూడి గ్రామస్తుల సౌకర్యార్థం భారీ వ్యయంతో ఫంక్షన్ హాలు నిర్మాణాన్ని కూడా చేపట్టారు. గత నాలుగేళ్ల కాలంలో పలువురు ప్రముఖులు, ప్రజాప్రతినిధులు, అధికారులు ఈ ఆలయాన్ని సందర్శించారు. షిరిడిలోని శ్రీ సాయినాధుని విగ్రహానికి దీటైన రీతిలో, మంచి వర్చస్సుతో ఈ ఆలయంలోని సాయి విగ్రహం భక్తులను విశేషంగా ఆకట్టుకుంటుంది. గుంటూరు, తెనాలి, విజయవాడ పరిసర ప్రాంతాల నుంచి కూడా భక్తులు గణనీయమైన సంఖ్యలో ఈ మందిరానికి వస్తున్నారు. అనతికాలంలోనే ఈ సాయిమందిరం రాష్ట్రంలో ఓ ప్రముఖ ఆలయంగా ప్రసిద్ధి చెందింది. జడ్పీ ఛైర్మన్‌గా పదవీకాలం ముగిసిన తరువాత పాతూరి నాగభూషణం ఆధ్యాత్మికంగా ముందుకు దూసుకుపోతూ ఈ గుడి అభివృద్ధితోపాటు రాష్ట్రంలో ఎక్కడా లేనివిధంగా ఇక్కడ నిర్వహిస్తున్న కార్యక్రమాలు పలువురు భక్తులను సుదూర ప్రాంతాల నుంచి కూడా ఇక్కడికి రప్పిస్తున్నాయి. ఈ ఆలయం ద్వారా పలు సేవాకార్యక్రమాలను కూడా నిర్వర్తిస్తున్నారు. ఆధ్యాత్మిక భక్తి భావాలతోపాటు సేవా కార్యక్రమాలను కూడా విస్తరింపజేసే లక్ష్యంతో ఉచిత వైద్యశిబిరాలను, పేద విద్యార్థులకు ఉపకార వేతనాలను అందజేస్తున్నామని ఆలయ కమిటి ఛైర్మన్, జడ్పీ మాజీ ఛైర్మన్ పాతూరి నాగభూషణం తెలిపారు. పలువురు దాతలు ఈ అన్నదానానికి అనేక రకాలుగా చేయూతనందిస్తున్నారు. సుమారు పదిహేను లక్షల రూపాయలను ఇందుకోసం వెచ్చిస్తున్నట్టు పాతూరి తెలిపారు. వేకువజామున స్వామి వారికి పాలాభిషేకం, సహస్ర పుష్పార్చనలతోపాటు ప్రతీరోజూ ప్రత్యేక పూజలను నిర్వహిస్తారు. రాష్ట్రంలోని పలువురు ప్రముఖులు పార్టీలకు అతీతంగా సాయినాధునికి ప్రత్యేకంగా నిర్వహిస్తున్నారు.



వడ్లపూడి శ్రీ షిరిడి సాయినాధుని దివ్యరూపం



శ్రీ సాయినాధుని ఆలయ సుందర దృశ్యం



రాష్ట్ర మంత్రి మోపిదేవికి జ్ఞాపికను అందజేస్తున్న పాతూరి నాగభూషణం

# రైతులకు అండగా నూరేళ్ల డీసీసీబీ

## రూ.100 కోట్ల ఆస్తులు.. విస్తృత సేవలు

జిల్లా కేంద్ర సహకార బ్యాంక్ (డీసీసీబీ)ని స్థాపించి వంద సంవత్సరాలు పూర్తవుతోంది. శత వార్షికోత్సవాలను వైభవంగా నిర్వహించాలని జీఎం విశ్వనాథం ప్రణాళిక తయారు చేశారు. 1911, మార్చి 17వ తేదీన తెనాలిలో జిల్లా సహకార కేంద్ర బ్యాంకును ఏర్పాటు చేశారు. ఇప్పటి వరకు ఈ బ్యాంకుకు అనేక మంది యోధానుయోధులు చైర్మన్‌లుగా పని చేశారు. తెనాలి కేంద్రంగా 85 సంవత్సరాలు, గుంటూరు కేంద్రంగా 15 సంవత్సరాల నుంచి డీసీసీబీ రైతులకు సేవలందిస్తోంది. తక్కువ వడ్డీకి రుణాలిచ్చే సహకార వ్యవస్థ ద్వారా రైతులకు ఈ బ్యాంకు మేలు చేస్తోంది.

- వంద సంవత్సరాల క్రితం తెనాలిలో జంపాల వెంకట సుబ్బారాయుడు చైర్మన్‌గా బ్యాంకును స్థాపించారు.
- నాబార్డు, ఆప్కాబ్, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల నుంచి డీసీసీబీకి నిధులు వస్తున్నాయి.
- వ్యవసాయ, అనుబంధ పరిశ్రమలకు పెద్ద ఎత్తున రుణాలిస్తున్నారు.
- కోళ్లఫారాలు, పాడి పరిశ్రమల అభివృద్ధి, ట్రాక్టర్లు, చేపల చెరువులు, వరికోత యంత్రాలు, తైవాన్ పవర్ స్ప్రేయర్లు, పవర్ టిల్లర్లు వంటి ఆధునిక వ్యవసాయ పరికరాలకు ఈ బ్యాంకు రుణాలిస్తుంది.



గుంటూరులోని డీసీసీబీ కార్యాలయం

**బ్యాంకు సాధించిన విజయాలు...**

- ఈ సంవత్సరం జిల్లాలోని 115 పీఏసీఎస్‌ల ద్వారా 45వేల మెట్రిక్ టన్నుల ఎరువులను రైతులకు సరఫరా చేశారు.
- పీఏసీఎస్‌ల ద్వారా మిర్చి, మొక్కజొన్నలను కొనుగోలు చేశారు.

82 చేనేత సొసైటీలకు రూ.3.51 కోట్లు, చేనేత కార్మికులు 2,166 మందికి రూ.97.47లక్షలను రుణాలుగా ఇచ్చారు.

- 35వేల మంది రైతులకు రుణాలను రూ.లక్ష వరకు పెంచారు. 2009-10లో రూ.4కోట్లు దీర్ఘకాలిక రుణాలు, డ్వాక్రా గ్రూపులకు రూ.2కోట్లు, రైతుమిత్రా గ్రూపులకు రూ.50లక్షలు పంపిణీ చేశారు.
- రుణమాఫీలో 1.6లక్షల మంది రైతులకు రూ.308 కోట్లు మాఫీ చేశారు.
- రుణాలు మాఫీ కానీ 92,513 మంది రూ.46 కోట్లు సకాలంలో చెల్లించినందుకు ఒక్కొక్కరికి రూ.5వేలు చొప్పున అందజేశారు.
- జనతా ఇన్సూరెన్స్ పథకం ద్వారా 175 మంది రైతులు లబ్ధిపొందారు.
- వైద్యనాథన్ కమిషన్ సిఫార్సుల వల్ల జిల్లాలోని 142 సంఘాలకు రూ.96కోట్ల ఆర్థిక సాయం అందింది.
- గ్రామీణ బండారు యోజన పథకం ద్వారా గిడ్డంగులు నిర్మించుకోవడానికి ఒక్కొక్కరికి రూ.25లక్షలు చొప్పున రుణాలిస్తారు.
- రాజీవ్ ఆరోగ్యశ్రీ పథకానికి బ్యాంకు ఉద్యోగులు రూ.5లక్షలు విరాళం అందజేశారు.
- నష్టపోయిన వారికి ముఖ్యమంత్రి సహాయ నిధి కింద రూ.4లక్షలు విరాళం ఇచ్చారు.

**బ్యాంకు చైర్మన్లుగా...**

- వంద సంవత్సరాల క్రితం ఏర్పడిన ఈ బ్యాంకుకు జంపాల వెంకట సుబ్బారాయుడు మొదటి చైర్మన్‌గా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. శతవార్షికోత్సవాలు జరుపుకుంటున్న సమయంలో నల్లపాటి శివరామ చంద్రశేఖరరావు ప్రస్తుతం చైర్మన్‌గా కొనసాగుతున్నారు.
- స్వర్గీయ ఆలపాటి వెంకటరామయ్య సుమారు 15 సంవత్సరాలపాటు నాలుగు సార్లు బ్యాంకు చైర్మన్‌గా పని చేశారు.
- జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి, వెనిగళ్ల సత్యనారాయణ, పుతుంబాక

(మిగతా 67వ పేజీలో)



శివరామ చంద్రశేఖరరావు



మానం వెంకటేశ్వర్లు



ఆలపాటి వెంకటరామయ్య



జీఎం విశ్వనాథం



కుర్రి పున్నారెడ్డి



కన్నెగంటి రెడ్డెమ్మ చౌదరి

# రైతు క్లబ్బుల ద్వారా బాయర్ క్రాప్ సైన్స్ సేవలు

**బాయర్ క్రాప్ సైన్స్ రైతు క్లబ్ లను ఏర్పాటు చేసి క్షేత్రస్థాయిలో పంటలపై చీడపీడల నివారణ, సస్య రక్షణ చర్యలపై అవగాహన కల్పిస్తున్నారు కంపెనీ ప్రతినిధులు, జనరల్ మేనేజర్ మోహనరావు. పత్తి, మిర్చి, పసుపు, వరి పంటలపై తీసుకోవాల్సిన సస్యరక్షణ చర్యలను వారు రైతులకు వివరిస్తున్నారు. సంస్థ క్షేత్రస్థాయిలో రైతుక్లబ్‌లను ఏర్పాటుచేసి వారికి అవసరమైన నాణ్యమైన ఎరువులు, విత్తనాలు, పురుగు మందులను సరఫరా చేస్తున్నారు. విత్తనం నాటే దశ నుంచి పైరు కోసే దశ వరకు తీసుకోవాల్సిన చర్యలను ఇలా వివరిస్తున్నారు.**

● కేవలం వ్యాపార దృక్పథంతో కాకుండా విస్తరణ విభాగాన్ని పెద్ద ఎత్తున పెంచామని తెలిపారు.

విషతుల్యమైన పురుగుమందుల వాడకంపై రైతుల్లో సరైన అవగాహన లేక అనేక మంది అనారోగ్యానికి గురవుతున్నారు. పురుగుమందు చల్లే సమయంలో రక్షక కవచనాలు ధరించాలి. కొన్ని ప్రాంతాల్లో బాయర్ క్రాప్ సైన్స్ సంస్థ ఉచితంగా వీటిని సరఫరా చేస్తోందని జీఎం చెప్పారు.

● ఇటీవల వర్షాల వల్ల నష్టపోయిన రైతులకు సంస్థ తరపున విత్తనాలను ఉచితంగా సరఫరా చేశామన్నారు.



మోహనరావు

● కొన్ని ప్రాంతాల్లో రైతుసదస్సులు, వైద్య శిబిరాలు నిర్వహిస్తున్నామన్నారు. గత ఏడాది వరదల వల్ల నష్టపోయిన రైతులను ఆదుకోవడానికి దుప్పట్లు, వంట పాత్రలు పంపిణీ చేశామని చెప్పారు.

● పర్యావరణాన్ని కాపాడటం కోసం ఎక్కువ విషపదార్థాలున్న పురుగు మందులను వాడకూడదని తాము ప్రచారం చేస్తున్నట్లు తెలిపారు. తక్కువ విషతుల్యాలు ఉంటేనే పర్యావరణానికి మేలు జరుగుతుందన్నారు. రైతులు తమకు అందుబాటులో ఉన్న వ్యవసాయశాఖ అధికారుల సలహాలు తీసుకోవాలని మోహనరావు సూచించారు.

● జిల్లా రైతుల్లో అవగాహన కల్పించటానికి బాయర్ క్రాప్ సైన్స్ జనరల్ మేనేజర్ మోహనరావు, ఆర్ఎం నాగేంద్రరావు, ఫీల్డ్ మార్కెటింగ్ మేనేజర్లు శ్రీధర్, శ్రీనివాసరెడ్డి, శ్రీనివాస్, ప్రసన్న, సాయిరాం, సురేష్ తదితరులు క్షేత్ర స్థాయిలో పర్యటిస్తున్నారు.



రెంటచింతలలో పత్తి రైతులతో మాట్లాడుతున్న మోహనరావు

**కొత్తగా నాటివో, గ్లామర్ మందుల విడుదల**

ఈ ఏడాది మార్కెట్లోకి కొత్తగా నాటివో, గ్లామర్ అనే మందులను విడుదల చేస్తున్నామన్నారు. వరిలో తెగుళ్లు, దోమకాటు నివారించటం కోసం ఈ మందులు బాగా ఉపయోగపడతాయని జనరల్ మేనేజర్ మోహనరావు తెలిపారు. పొడి రూపంలో ఉండే ఈ మందులను జర్మనీ సాంకేతిక పరిజ్ఞానంతో తయారు చేసినట్లు చెప్పారు.

-(ఆన్‌లైన్, గుంటూరు)

# రైతులకు అండగా నూరేళ్ల డీసీసీబీ

(66వ పేజీ తరువాయి)

శ్రీరాములు, కన్నెగంటి రెడ్డమ్మ చౌదరి, నూతలపాటి హనుమంతరావు, మారౌతు సీతారామయ్య, గుంటుపల్లి వెంకట అప్పారావు, మానం వెంకటేశ్వర్లు, కుర్రి పున్నారెడ్డి తదితరులు చైర్మన్‌లుగా పని చేశారు.

● డీసీసీబీ చైర్మన్‌లుగా పని చేసిన ఆలపాటి వెంకటరామయ్య రాష్ట్ర మంత్రిగా, వెనిగళ్ల సత్యనారాయణ కేంద్రమంత్రిగా పని చేశారు.

● డీసీసీబీ శతవార్షికోత్సవాలను సంవత్సరం పాటు నిర్వహించాలని పాలకవర్గం నిర్ణయించింది. దీనిలో భాగంగా ఖాతాదారులకు 9.5శాతం వడ్డీ ఇచ్చే విధంగా సెంచరీ డిపాజిట్ స్కీంను ప్రారంభించారు. ఈ డబ్బును రైతులకే రుణాలుగా ఇచ్చే విధంగా ఏర్పాటు చేశారు. కలెక్టర్ రామాంజనేయులు ఈ కార్యక్రమాన్ని ప్రారంభించారు.

● ముఖ్యమంత్రి రోశయ్యతో బ్యాంకు శతవార్షికోత్సవాలను వైభవంగా నిర్వహించాలని పాలకవర్గం నిర్ణయించింది. దానికి అనుగుణంగా తెనాలిలో రూ.3 కోట్లతో కార్యాలయల భవనాన్ని నిర్మిస్తున్నారు.

● కన్నెగంటి రెడ్డమ్మ చౌదరి రెండు సార్లు బ్యాంక్ చైర్మన్‌గా పని చేశారు. ఆయన హయాంలోనే బ్యాంక్ 50వ వార్షికోత్సవాన్ని తెనాలిలో నిర్వహించారు. ఆ ఉత్సవాల్లో కాసు బ్రహ్మానందరెడ్డి, నీలం సంజీవరెడ్డి వంటి ప్రముఖులు పాల్గొన్నారు.

-(కందిమళ్ల వెంకట్రావు, ఆన్‌లైన్, గుంటూరు)

బ్యాంకు స్థాపించిన తేదీ : 17-03-1911
జిల్లాలో బ్రాంచీల సంఖ్య...35
బ్యాంకుకున్న ఆస్తుల విలువ...రూ.100 కోట్లు
డీసీసీబీలో సిబ్బంది సంఖ్య...300 మంది
167 పీఏసీఎస్‌లలో సిబ్బంది సంఖ్య...256 మంది
బ్యాంకు డిపాజిట్లు...రూ.300 కోట్లు
ఖాతాదారుల సంఖ్య...4.5లక్షలు
ఈ ఏడాది గోల్డ్‌లోన్‌లకు .. రూ.500 కోట్లు
పంట రుణాలు...రూ.250 కోట్లు



తెనాలిలో 50వ వార్షికోత్సవ సభలో ప్రసంగిస్తున్న నీలం సంజీవరెడ్డి, వేదికపై బ్రహ్మానందరెడ్డి

# దేశ సేవలో 'నగరం' కళాశాల

**దేశ సేవలో 'నగరం' కళాశాల ప్రధాన భూమిక పోషిస్తోంది. నగరం గ్రామంలోని శ్రీ వెలగపూడి రామకృష్ణాస్మారక కళాశాలకు చెందిన సాలీనా 30 నుంచి 40మంది విద్యార్థులు భారత సైన్యంలో చేరుతున్నారనటం అతిశయోక్తి కాదు. 1969లో నగరంలో డిగ్రీ కళాశాల స్థాపించిన నాటినుంచి ఎన్‌సీసీ ఉత్తమస్థాయిలో నిర్వహించటమేకాక 2008లో ఉత్తమ ఎన్‌సీసీ ఆఫీసర్ పురస్కారం పొందింది. గతంలో కూచినపూడి నియోజకవర్గ వ్యాపితంగా, ప్రస్తుత రేపల్లె నియోజకవర్గ వ్యాపితంగా కూడా ఎన్‌సీసీ సౌకర్యం విద్యార్థులకు అందిస్తున్న ఏకైక కళాశాల నగరం కాలేజీ. 22 ఆంధ్రా బెటాలియన్‌లో 117-ఏ కంపెనీగా పనిచేస్తున్న నగరం కాలేజీ ఎన్‌సీసీ విభాగానికి అధిక ప్రాధాన్యత వుంది.**



కళాశాల ముఖద్వారం

1999వరకు 80 మంది క్యాడెట్‌లకు పరిమితమ్మైన ఎన్‌సీసీ ప్రస్తుతం 150 మందికి శిక్షణనిస్తున్నది. ఈ శిక్షణ పొందటం కారణంగా అనేక మంది నగరం కాలేజీ విద్యార్థులు పోలీస్‌శాఖలో ఉద్యోగాలు పొందుతున్నారు.

అత్యంత ప్రతిష్మాత్మకంగా భావించే గణతంత్రదినోత్సవ మార్చ్ ఫాస్ట్(న్యూఢిల్లీ)లో నగరం కళాశాల ఎన్‌సీసీ విభాగం నుంచి ఇద్దరు క్యాడె ట్‌లు పాల్గొనటం విశేషం. న్యూఢిల్లీలో జరిగే 'తరసైనిక్' క్యాంప్‌కు ఇద్దరు క్యాడెట్‌లు ఎంపికై మొత్తం క్యాంప్‌కు వన్నె తెచ్చారు. ఆకాశంలో విమాన విన్యాసాలకు సంబంధించిన పేరాసైలింగ్(జంప్) శిక్షణకు నగరం కాలేజీ ఎన్‌సీసీ విభాగం నుంచి ఎంపికైన అమర్తలూరి రవీంద్రబాబు ఆగ్రాలో ఆరునెలల శిక్షణ పొందాడు. మన రాష్ట్రం నుంచి ఎంపికైన క్యాడెట్‌లలో రవీంద్రబాబు ఒకరు కావటం విశేషం.

హైదరాబాద్‌లో నిర్వహించే (ఐడీసీ) ఇండిపెండెన్స్ డే క్యాంప్, రిపబ్లిక్ డే పరేడ్‌లకు ఎంతోమంది క్యాడెట్‌లు ఇంచుమించు ప్రతిసంవత్సరం ఎంపికవుతుంటారు. 117-ఎ ఎస్‌వీఆర్‌యం కాలేజి కంపెనీని ఉన్నతంగా తీర్చిదిద్దినందుకు కెప్టెన్ ఎం.సాంబశివరావుకు 2008 సంవత్సరంలో ఉత్తమ ఎన్‌సీసీ ఆఫీసర్ పురస్కారం లభించింది. సరిహద్దు భద్రతాదళంలో నగరం విద్యార్థులు ఎక్కువగా భద్రతా సేవలందిస్తున్నారన్న విషయం మన ప్రాంతానికి గర్వకారణం. రక్తదాన శిబిరాలు, సామాజిక సేవా కార్యక్రమాలు, క్లీన్ అండ్ గ్రీన్ కార్యక్రమాల్లో పాల్గొని ఎన్‌సీసీ క్యాడెట్ అనేపదాన్ని సార్థకం చేసుకుంటున్న నగరం కాలేజీ విద్యార్థులను సమాజంతోపాటు అధికారులందరు ప్రశంసించటం తమకు ఆనందాన్ని ఇస్తుందని ప్రిన్సిపాల్ జీయస్‌బీ ప్రభాకరరావు సంతృప్తి వ్యక్తం చేశారు. ఎన్‌సీసీ ఆఫీసర్ కెప్టెన్ సాంబశివరావు 'ఆన్‌లైన్'తో మాట్లాడుతూ సెంట్రల్ విజిలెన్స్ కమిషన్ కార్యక్రమమ్మైన యాంటీ కరప్షన్ ర్యాలీలు నిర్వహించటం, పల్స్‌పోలియోలో సేవలందించటం తనకెంతో సంతృప్తి కలిగిస్తున్నాయన్నారు. తెఫ్ట్ ఇరాడికేషన్ ప్రోగ్రాం చేయాలని ప్రయత్నిస్తున్నామని ఆయన సగర్వంగా తెలిపారు.

ప్రతి సంవత్సరం 'బీ' సర్టిఫికెట్ పరీక్షలో 70శాతం, 'సీ' సర్టిఫికెట్ పరీక్షలో 60శాతం ఫలితాలు పొందుతున్నామన్నారు.

-(ఆన్‌లైన్, నగరం)



కళాశాల భవన సముదాయం, (ఇన్‌సెట్లో) ఎన్‌సీసీ కార్యాలయం



కవాతు నిర్వహిస్తున్న ఎన్‌సీసీ క్యాడెట్లు

# రెండోసారి టీడీపీ జిల్లా అధ్యక్షుడిగా ప్రత్తిపాటి

- ప్రజా సమస్యలపై సంఘటిత పోరాటం
- సమర్థమంతంగా ప్రతిపక్ష పాత్ర

తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడిగా ప్రత్తిపాటి పుల్లారావు రెండోసారి ఏకగ్రీవంగా ఎంపికయ్యారు. అధ్యక్ష స్థానానికి పార్టీ నేతల నుంచి పోటీ ఎదురుకాలేదు. 2004 ఎన్నికల్లో తెలుగుదేశం పార్టీ జిల్లాలో ఘోర పరాజయాన్ని చవి చూసింది. ఆ ఎన్నికల్లో పొన్నూరు నియోజకవర్గం నుంచి ధూళిపాళ్ల నరేంద్రకుమార్ ఒక్కరే ఎమ్మెల్యేగా ఎన్నికయ్యారు. మిగిలిన అన్ని నియోజకవర్గాల్లో టీడీపీ అభ్యర్థులు ఓటమి పాలయ్యారు. ఈ నేపథ్యంలో జిల్లా పార్టీ శ్రేణులు ఏ మాత్రమూ అధైర్యానికి గురి కాకుండా చూడటంలోనూ, ప్రభుత్వ ప్రజావ్యతిరేక విధానాలపై పోరాటంలోనూ జిల్లా నేతలు కొంత వరకు సఫలీకృతులయ్యారు. తిరిగి 2009లో జరిగిన ఎన్నికల్లో 17 నియోజకవర్గాలకు గాను ఆరింటిలో టీడీపీ అభ్యర్థులు విజయ బావుట ఎగురవేశారు. జిల్లా టీడీపీ అధ్యక్షుడు ప్రత్తిపాటి పుల్లారావు చిలకలూరిపేట నియోజకవర్గం నుంచి, నాలుగోసారి పొన్నూరు నియోజకవర్గం నుంచి ధూళిపాళ్ల నరేంద్రకుమార్ విజయం సాధించారు. వీరితోపాటు గురజాల నుంచి యరపతినేని శ్రీనివాసరావు, వినుకొండ నుంచి జీవీవీఎస్.ఆంజనేయులు, పెదకూరపాడు నుంచి కొమ్మాలపాటి శ్రీధర్, వేమూరు నుంచి నక్కా ఆనందబాబు గెలుపొందారు. జిల్లాలో మూడు ఎంపీ స్థానాలకుగాను నరసరావుపేట నుంచి టీడీపీ అభ్యర్థి మోదుగుల వేణుగోపాలరెడ్డి అనూహ్యంగా విజయం సాధించారు. వైఎస్ మృతి చెందటం, అనంతరం ముఖ్యమంత్రిగా జిల్లాకు చెందిన కొణిజేటి రోశయ్య ఎంపిక కావటం జరిగింది. కానీ జిల్లాకు ప్రత్యేకంగా ఒరిగిందేమి లేదు. ఈ నేపథ్యంలో తెలుగుదేశం పార్టీ సమర్థమంతంగా ప్రతిపక్ష పాత్ర పోషిస్తోంది. ప్రభుత్వ ప్రజావ్యతిరేక విధానాలపై పోరాటాలు సాగిస్తోంది. జిల్లాలో ప్రధాన సమస్యలను గుర్తించి అక్కడి పరిస్థితులను అధ్యయనం చేసేందుకు ఆ పార్టీ ప్రజాప్రతినిధులతో పాటు ముఖ్య నేతలు ఐక్యంగా పర్యటనలకు వెళుతున్నారు. ఆయా సమస్యలపై సభల్లో గళమెత్తుతున్నారు. వీరితో పాటు టీడీపీ అధికార ప్రతినిధి, మాజీ మంత్రి డాక్టర్ కోడెల శివప్రసాదరావు పార్టీలో తన వంతు పాత్ర పోషిస్తూనే ప్రభుత్వ విధానాలను ఎండగడుతున్నారు. పార్టీ సీనియర్ నేతలైన యడ్లపాటి వెంకటరావు, డాక్టర్ ఉమ్మారెడ్డి వెంకటేశ్వర్లు సైతం పార్టీ కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొంటూ శ్రేణుల్లో ఉత్సాహం నింపుతున్నారు. మరో మాజీ మంత్రి ఆలపాటి రాజేంద్ర ప్రసాద్ ప్రభుత్వ విధానాలపై జరిగే పోరాటంలో తన వంతు పాత్ర పోషిస్తున్నారు. ఎన్నికల ఫలితాల అనంతరం మాజీ మంత్రులు డాక్టర్ మాకినేని పెదరత్తయ్య, జేఆర్.పుష్పరాజ్ పూర్తి సమయం పార్టీ కార్యక్రమాల్లో పాల్గొనకపోయినప్పటికీ వివిధ సందర్భాల్లో హాజరవుతున్నారు. ఎమ్మెల్సీ నన్నపనేని రాజకుమారి ప్రభుత్వ విధానాలపై జరిగే ఉద్యమాల్లో ముందుంటున్నారు. పార్టీ ఉపాధ్యక్షుడు ఎస్ఎం.లాల్‌జాన్ బాషా కూడా ముఖ్య కార్యక్రమాల్లో పాల్గొంటున్నారు. ఇలావుంటే జిల్లాలోని ఆయా నియోజకవర్గాల ఇన్‌చార్జిలు మాజీ ఎమ్మెల్యే ఎస్ఎం.జియావుద్దీన్, తెనాలి శ్రావణ్‌కుమార్, మాదల రాజేంద్ర, అనగాని సత్య ప్రసాద్ గౌడ్, చీరాల గోవర్ధనరెడ్డి, నిమ్మకాయల రాజనారాయణలతో పాటు పార్టీ నాయకులు, కార్యకర్తలు సైతం తమ వంతు పాత్ర పోషిస్తున్నారు. మొత్తంమీద జిల్లాలో గడిచిన ఏడాదిలో తెలుగుదేశం నేతలు ఉమ్మడి పోరుతో వ్యూహాత్మకంగా ముందుకు సాగుతున్నారు. వచ్చే స్థానిక సంస్థల ఎన్నికలతో పాటు 2014 ఎన్నికలే లక్ష్యంగా పని చేస్తున్నారు.

గతంలో ఉన్నంతగా నేతల మధ్య విభేదాలు లేనప్పటికీ అభిప్రాయ బేధాలు మాత్రం కొట్టొచ్చినట్లు కనిపిస్తున్నాయి. వాటిని సరి చేసుకొని ముందుకు సాగితే రానున్న రోజుల్లో తెలుగుదేశం పార్టీకి పూర్వవైభవం వచ్చినట్లేనని కార్యకర్తలు ధీమా వ్యక్తం చేస్తున్నారు. ప్పటి వరకు సత్తెనపల్లిలోని శాతవాహన స్పిన్నింగ్ మిల్లు, నాగార్జున సాగర్ కుడి కాల్వ ఆధునీకరణ పనులు, పశ్చిమ డెల్టా కరకట్ట పనులు, పల్నాడులో సిమెంట్ ఫ్యాక్టరీలు విద్యుత్ ప్రాజెక్టుల పేరుతో భూముల స్వాధీనం వంటి అనేక అవినీతి అక్రమాలు, ప్రజా వ్యతిరేక విధానాలపై టీడీపీ దశలవారీ పోరాటం సాగిస్తోంది.

-(ఆన్‌లైన్, గుంటూరు)



ప్రత్తిపాటి పుల్లారావు | కోడెల శివ ప్రసాదరావు | ఎస్ఎం.లాల్‌జాన్ బాషా

ఉమ్మారెడ్డి వెంకటేశ్వర్లు | యడ్లపాటి వెంకటరావు | మోదుగుల వేణుగోపాల్‌రెడ్డి

ధూళిపాళ్ల నరేంద్రకుమార్ | యరపతినేని శ్రీనివాసరావు | నక్కా ఆనందబాబు

జీవీవీఎస్.ఆంజనేయులు | కొమ్మాలపాటి శ్రీధర్ | ఆలపాటి రాజేంద్రప్రసాద్

నన్నపనేని రాజకుమారి | జేఆర్.పుష్పరాజ్ | మాకినేని పెదరత్తయ్య













# జిల్లా విద్యారంగంలో విప్లవాత్మక మార్పులు

- రాష్ట్రంలోనే అత్యధిక ఇంజనీరింగ్ కాలేజీలు
- పాఠశాలలో సంస్కరణలకు శ్రీకారం
- జవహర్ విజ్ఞాన కేంద్రాలతో ఉపాధికి ఊతం

(ఆన్‌లైన్ ఎడ్యుకేషన్,గుంటూరు)

విద్యారంగంలో విప్లవాత్మక మార్పులకు గుంటూరు కేంద్ర బిందువు అవుతోంది. కార్పొరేట్ కళాశాలలు విస్తరిస్తున్నాయి. రాష్ట్రంలోనే అత్యధిక ఇంజనీరింగ్ కళాశాలలున్న జిల్లా గుంటూరే. దీనికి తోడు ఇంజనీరింగ్, డిగ్రీ కోర్సులు పూర్తికాగానే ఉపాధి అవకాశాలు కల్పించేందుకు ప్రభుత్వం ప్రత్యేక ఏర్పాట్లు చేసింది. ఇందు కోసం ప్రత్యేకంగా ఇంజనీరింగ్, ప్రభుత్వ డిగ్రీ కళాశాలల్లో జవహర్ విజ్ఞాన కేంద్రాలు ఏర్పాటు చేసింది. ఫలితంగా కార్పొరేట్ కంపెనీలు భారీ గా



ప్రభుత్వ డిగ్రీ కళాశాలలోని జవహర్ విజ్ఞాన కేంద్రం

క్యాంపస్ ఇంటర్వ్యూలు నిర్వహించి కోర్సులు పూర్తి చేసిన విద్యార్థులకు ఉపాధి అవకాశాలు కల్పిస్తున్నాయి.

### ఉపాధి బాటలు వేస్తున్న జవహర్ విజ్ఞాన కేంద్రాలు

జిల్లాలోని ప్రభుత్వ డిగ్రీ కళాశాలల్లో ఉన్నత విద్యాశాఖ ఏర్పాటు చేసిన జవహర్ విజ్ఞాన కేంద్రాలు యువత ఉపాధికి బాటలు వేస్తున్నాయి. విద్యార్థులకు డిగ్రీ ద్వితీయ సంవత్సరం ప్రారంభం నుంచే జవహర్ విజ్ఞాన కేంద్రాల్లో కార్పొరేట్ ఉద్యోగాలకు అవసరమైన శిక్షణ ఇస్తున్నారు. ఆంగ్లభాషానైపుణ్యం, వ్యక్తిత్వ వికాసం, భావ వ్యక్తీకరణ, ఇంటర్వ్యూ స్కిల్స్ ఇలా ప్రతి అంశంలో శిక్షణ ఇస్తున్నారు. ఈ శిక్షణకు డిగ్రీ, ఇంజనీరింగ్, ఎంసీఏ కోర్సులు పూర్తిచేసిన విద్యార్థులు సైతం హాజరౌతున్నారు. శిక్షణ పూర్తిచేసుకున్న వారికి తృతీయ సంవత్సర ప్రారంభంలో క్యాంపస్ ఇంటర్వ్యూలు నిర్వహిస్తున్నారు. హెచ్‌సిఎల్, విప్రో,జడ్‌ల్యాబ్, రెడ్డిల్యాబ్స్, ఐబిఎం వంటి కార్పొరేట్ సంస్థలు జిల్లా కేంద్రంలోని ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో క్యాంపస్ ఇంటర్వ్యూలు నిర్వహించి వందలాది మందికి ఉద్యోగాలు కల్పిస్తున్నాయి.

### సంస్కరణల బాటలో ఉన్నత పాఠశాలలు

జిల్లాలోని ఉన్నత పాఠశాలల్లో వచ్చే ఏడాది నుంచి విప్లవాత్మక సంస్కరణలు తీసుకువచ్చేందుకు జిల్లాకు చెందిన మాధ్యమిక విద్యాశాఖ మంత్రి డొక్కా మాణిక్యవరప్రసాద్ ప్రత్యేక చర్యలు తీసుకుంటున్నారు. జిల్లా నుంచి విద్యారంగ సంస్కరణలు ప్రారంభించి రాష్ట్ర వ్యాప్తంగా అమలు చేయాలనే ఆలోచనతో ఆయన ఉన్నారు. జిల్లాలో ఇప్పటికే 80 ఉన్నత పాఠశాలకు రూ. 80లక్షలకు పైగా నిధులు విడుదల అయ్యాయి. మరో 23 మండలాల్లో మోడల్ పాఠశాలలు ఏర్పాటు కానున్నాయి. ఒక్కో పాఠశాలకు రూ. 3కోట్లు వరకు వ్యయం చేసి అక్కడ సమస్త సౌకర్యాలు కల్పించేందుకు జిల్లా విద్యాశాఖ కృషి చేస్తోంది. జిల్లాలోని ఉన్నత పాఠశాలల్లో మౌలిక వసతులు కల్పించి పేద,బడుగు,బలహీన వర్గాల విద్యార్థులకు నాణ్యమైన విద్య అందించే లక్ష్యంతో ముందుకు సాగుతున్నారు. దీనికి తోడు రాజీవ్ విద్యామిషన్, రాష్ట్రీయ మాధ్యమి మిషన్ ఆధ్వర్యంలో అదనపు తరగతుల నిర్మాణం, కంప్యూటర్స్ ఏర్పాటు, మరుగుదొడ్లు, మంచినీటి సౌకర్యం, బాలికలకు ప్రత్యేక వెయిటింగ్ హాల్స్ నిర్మాణం కోసం కోట్లాది రూపాలు వెచ్చిస్తున్నారు. కార్పొరేట్ పాఠశాలలు ధీటుగా జడ్పీ, ప్రభుత్వ పాఠశాలల్లో విద్యార్థులు ఫలితాలు సాధిస్తున్నారు. ట్రిపుల్ ఐటీల్లో అత్యధిక సీట్లు సాధించి సత్తాచాటిన ఘనత జిల్లా విద్యార్థులకే దక్కుతుంది. పదో తరగతి ఉత్తీర్ణతలో గత ఏడాది జిల్లా రాష్ట్రస్థాయిలో మూడో స్థానంలో నిలిచి రికార్డు సృష్టించింది. ఈ ఏడాది ఫలితాలు నిరాశ పరిచినా అత్యధిక ఉత్తీర్ణతశాతం పెరిగింది. ఇదిలా ఉంటే సంక్షేమ హాస్టళ్లలో కూడా ఈసారి మెరుగైన ఫలితాలు వచ్చాయి. జిల్లా కలెక్టర్ రామాంజనేయులు హాస్టళ్లపై ప్రత్యేక దృష్టి సారించి అధికారుల ఆధ్వర్యంలో హాస్టళ్ల నిద్ర కార్యక్రమం ప్రారంభించారు. ఇదీ మంచి ఫలితాన్ని ఇచ్చింది. హాస్టల్స్‌లో మౌలిక వసతుల్ని కల్పించేందుకు చర్యలు తీసుకుంటున్నారు.

### ఇంజనీరింగ్ కళాశాలల ఖిల్లా

విద్యారంగానికి గుంటూరు జిల్లా పెట్టింది పేరు. ప్రస్తుతం అత్యధిక ఇంజనీరింగ్ కళాశాలలున్న జిల్లాగా ఖ్యాతికెక్కింది. రాష్ట్రంలో ఏ జిల్లాలో లేని విధంగా దాదాపు 35 ఇంజనీరింగ్ కళాశాలలు జిల్లాలో ఉన్నాయి. దీనికి తోడు విజ్ఞాన్, కెఎల్ వంటి ప్రైవేటు యూనివర్శిటీలు రంగ ప్రవేశం చేశాయి. ఆచార్య నాగార్జున యూనివర్సిటీలో కూడా గత ఏడాది నుంచి ఇంజనీరింగ్ కళాశాల ప్రారంభించారు. గుంటూరు నగరానికి చుట్టుపక్కల, నరసరావుపేట, చిలకలూరిపేట, తెనాలి, బాపట్ల, మంగళగిరి, పెదకాకాని, తాడికొండ తదితర ప్రాంతాల్లో ఇంజనీరింగ్ కళాశాలలు వెలిశాయి. ఇక్కడ మంచి వసతులతో నాణ్యమైన విద్య అందిస్తారనే ఉద్దేశంతో రాష్ట్ర వ్యాప్తంగా అనేక జిల్లాల నుంచి విద్యార్థులు ఇక్కడికి వచ్చి ఇంజనీరింగ్ కోర్సులు అభ్యసిస్తున్నారు. ఇక్కడ ఇంజనీరింగ్ విద్య పూర్తిచేస్తే ఉపాధి గ్యారంటీ అనే నమ్మకం తల్లిదండ్రుల్లో ప్రగాఢంగా ఉంది.

(తరువాయి 71వ పేజీలో)



ఉపాధ్యాయులను సన్మానిస్తున్న మంత్రి మాణిక్యవరప్రసాద్

# జిల్లా విద్యారంగంలో విప్లవాత్మక మార్పులు

(70వ పేజీ తరువాయి)

**ఫార్మశీ కళాశాలల హవా**

ఆర్థిక మాద్యం నేపథ్యంలో రెండేళ్ల క్రితం ఇంజనీరింగ్ కోర్సులకు కొద్దిగా డిమాండ్ తగ్గింది. ఈనేపథ్యంలో ఫార్మశీ కళాశాలలు జిల్లా వ్యాప్తంగా విస్తృతంగా ఏర్పాటయ్యాయి. ఆయా కళాశాలల్లో నూతన కోర్సులు అందుబాటులోకి రావడంతో విద్యార్థులు ఫార్మశీ కోర్సులపై మొగ్గుచూపుతున్నారు. ఫార్మ్‌డి వంటి కోర్సులు మొదటి సారిగా జిల్లాలోని ఫార్మశీ కళాశాలల్లో ప్రవేశపెట్టారు. నాగార్జున, బాపట్ల ఎడ్యుకేషనల్ సొసైటీలతో, చలపతి, హిందూ విద్యా సంస్థల ఆధ్వర్యంలో ఫార్మశీ కళాశాలలున్నాయి.

**ఫలితాల్లో ప్రభుత్వ కళాశాలలు ముందడుగు**



స్కాలర్‌షిప్‌లు సాధించిన విద్యార్థులను అభినందిస్తున్న ప్రభుత్వ జూనియర్ కళాశాల ప్రిన్సిపాల్ నగజాకుమారి

జిల్లాలో ఉన్న ప్రభుత్వ జూనియర్, వృత్తి విద్యా కళాశాలల్లో విద్యార్థులు తమ సత్తా చాటుతున్నారు. ఈ ఏడాది ప్రభుత్వ జూనియర్ కళాశాలల్లో విద్యార్థులు అత్యున్నత ఫలితాలు సాధించారు.ప్రభుత్వ బాలికల జూనియర్ కళాశాల విద్యార్థినులు కేంద్ర మానవ వనరుల అభివృద్ధి మంత్రిత్వశాఖ ఆధ్వర్యంలో ఇచ్చే మెరిట్ స్కాలర్‌షిప్‌లకు ఎంపికై తమ సత్తా చాటుకున్నారు.

**ఉధృతమైన కార్పొరేట్ విద్యా వ్యవస్థ**

రాష్ట్రంలో ఏ జిల్లాలో లేని విధం గా కార్పొరేట్ కళాశాలలు గుంటూరులో ఉన్నాయి. శ్రీచైతన్య, ఎన్నారై అకాడమి, గాయిత్రి అకాడమి, భాష్యం విద్యా సంస్థల ప్రధాన కార్యాలయాలు ఇక్కడే ఉన్నాయి. ఈ ఏడాది నారాయణ విద్యా సంస్థల ఆధ్వర్యంలో జిల్లాలో మూడు జూనియర్ కళాశాలలు ఏర్పాటు కాకున్నాయి. ఆయా కళాశాలల్లో విద్యార్థులు ఇంటర్‌తోపాటు, ఐఐటి, ఎఐఈఈఈ, ఎం సెట్, విట్ వంటి ప్రవేశ పరీక్షల్లో ర్యాంకుల పంట పడిస్తున్నారు. రాష్ట్రం లో ఏజిల్లాకు రానన్ని ర్యాంకులు ఒక్క గుంటూరు జిల్లాకే రావడం గమనార్హం. కార్పొరేట్ పాఠశాలలు కూడా క్రమంగా విస్తరిస్తున్నాయి. ఆయా పాఠశాలల్లో విద్యార్థులు కూడా ఏటా ఫలితాలల్లో తమ సత్తా చాటుతున్నారు.

# అమ్మితే అరువు.. ఉంచితే బరువు

(ఆన్‌లైన్-బాపట్ల)

**రైతాంగం పరిస్థితి దయనీయం**

రైతాంగం పరిస్థితి కడుదయనీయంగా మారింది. రెండేళ్ళుగా పండించిన ధాన్యం గిట్టుబాటుధరలేక ఇళ్ళవద్దనే పురుల్లో నిల్వచేసుకున్నారు. రేటు వస్తుంది విక్రయించుకుందామని అనుకున్న రైతుల ఆశలు నెరవేరలేదు. దీనికితోడు గత ఖరీఫ్, రబీసీజన్‌లలో పండించిన ధాన్యం రాశులు ఇళ్ళవద్దనే ఉండిపోయాయి. వ్యాపారులు అందినకాడికి రైతులనుంచి సొమ్ముచేసుకుంటున్నారు. ధాన్యం ధరను తగ్గించి అడుగుతున్నారు. వ్యవసాయ వ్యయం పెరిగి చేసిన అప్పులు తీరేదారిలేక వచ్చినధరకు కొందరు రైతులు ధాన్యం విక్రయిస్తున్నారు. దీనికి వ్యాపారులు అనేక షరతులు పెడుతున్నారు. ధాన్యం కొనుగోలుచేసిన వెంటనే డబ్బులివ్వడం లేదు. నెలనుంచి రెండు నెలల వరకు గడువు పెడుతున్నారు. గడువులో ధరపెరిగినా ఇవ్వమంటూ ముందుగానే చెబుతున్నారు. దీంతో చేసేది లేక కొందరు ధాన్యాన్ని అరువుకే విక్రయిస్తున్నారు. ధాన్యం నిల్వచేస్తే అప్పు లభారం పెరుగుతుందని, అమ్మితే సకాలంలో డబ్బులు రావడంలేదని, దీనివల్ల అన్నివిధాల నష్టపోతున్నామని రైతులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. రెండేళ్ళగా సంభవిస్తున్న ప్రకృతి వైపరీత్యాల వలన నష్టాలు చవిచూస్తున్న రైతులకు గోరుచుట్టూ పై రోకలి పోటులా సమస్య తీవ్రమవుతున్నది. సన్నచిన్నకారు రైతుల పరిస్థితి అయితే మరింత దయనీయంగా మారింది. గత ఏడాది కొనుగోలు కేంద్రాలు ఏర్పాటు చేసిన అధికారులు ఈ ఏడాది ఆ ఊసే ఎత్తలేదు. దీంతో రైతు సంఘ నాయకులు, తెలుగుదేశంపార్టీ నాయకులు ఉద్యమాలు చేపట్టారు. ఫలితంగా జిల్లా అధికారులు ఈ ప్రాంతానికి వచ్చి నిల్వవున్న ధాన్యాన్ని పరిశీలించి మద్దతు ధరకు కొనుగోలు చేస్తామని హామీనిచ్చి కొనుగోలు కేంద్రం ఏర్పాటు చేశారు. అయితే వారిచ్చే రేటు గిట్టుబాటు కావడం లేదని రైతులు ధాన్యం విక్రయించడం మానుకున్నారు. కొందరు రైస్ మిల్లర్లు కొంతమేర ధర ఇస్తుండటంతో వారిని



ఆరుబయట వుంచిన వరిధాన్యం

రైతులు ఆశ్రయించి ధాన్యం విక్రయిస్తున్నారు. బస్తా ధాన్యం కేవలం 680నుంచి 700రూపాయలకు నెలగడువు తరువాత డబ్బులిచ్చే విధంగా వ్యాపారులు, దళారులు కొనుగోలు చేస్తున్నారు. ఇళ్ళవద్ద వుంచిన రాశులకు ఎలుకల బెడద ఎక్కువగా వుందని రైతులు వచ్చినరేటుకు ధాన్యం విక్రయిస్తున్నారు.

**కౌలురైతుల పరిస్థితి మరీ..**

పొలాలకు ముందుగానే కౌలుచెల్లించి సేద్యం చేసిన రైతుల పరిస్థితి కడుదయనీయంగా వుంది. కనీసం కౌలుసొమ్ముకూడా రావడం లేదంటూ ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. పంట పండే సమయంలో సాగునీరు అందకపోవడం తీరా పంటపండిన తరువాత ధాన్యానికి గిట్టుబార ధరలేక పోవడం సర్వసాధారణమైంది. ఈ విధంగా కోట్లాది రూపాయల విలువచేసే ధాన్యం రైతుల లోగిళ్ళలో నిల్వవుండిపోయాయి.

**ఖరీఫ్‌లో కూడా కష్టాలే**

ఈ ఏడాది ఖరీప్ సీజన్ ప్రారంభం నుంచి అనేక కష్టనష్టాలు చవిచూస్తున్నారు. భారీ వర్షాలతో నారుమడులు, వరిపొలాలు ముంపునకు గురై రైతులు తీవ్రంగా నష్టపోయారు. అయినా అనేక వ్యయ ప్రయాసలతో సేద్యం చేస్తున్నారు. గతంలో పండించిన ధాన్యానికి గిట్టుబాటుధర లభించక పోయినా వ్యవసాయం మీదే ఆధారపడి జీవిస్తున్న రైతులు ఖరీఫ్ సేద్యం చేయక తప్పడం లేదు. ఈ విధంగా రైతులు పడుతున్న ఇబ్బందులపై పాలకులు, అధికారులు స్పందించాల్సిన అవసరం వుంది.

# చారిత్రక, పౌరాణిక ప్రాశస్త్యం పొందిన కపోతేశ్వరస్వామి ఆలయం

(ఆన్‌లైన్, నకరికల్లు)

నకరికల్లు మండలం చేజర్లలోని శ్రీ కపోతేశ్వర స్వామి ఆలయం దక్షిణ కాశీగా భాసిల్లుతున్నది. నరసరావుపేట పట్టణానికి 30 కిలో మీటర్ల దూరంలో చేజర్లలో శతాబ్దాల క్రితం కపోతేశ్వర స్వామి ఆలయం నిర్మితమైనది. భారతదేశంలోని అత్యంత ప్రఖ్యాతి పొందిన కాశీ, ద్రాక్షారామం, కాళహస్తి లాంటి పుణ్యక్షేత్రాల్లో ఒకటిగా గుర్తింపు పొంది దేశ, విదేశీ భక్త జనులను, చరిత్ర కారులను కపోతేశ్వర స్వామి ఆలయం విశేషంగా ఆకర్షిస్తుంది. చారిత్రక ప్రాధాన్యం మాత్రమే కాక, పౌరాణిక ప్రాశస్త్యం పొందిన ఈ శివ క్షేత్రంలో శివరాత్రి, సంక్రాంతి, దసరా లాంటి పండుగలను వైభవంగా జరుపుతారు. ప్రతి ఏడాది మహాశివరాత్రి మూడో రోజున స్వామి కల్యాణోత్సవం జరుగుతుంది.



కపోతేశ్వర స్వామి ఆలయ గాలి గోపురం

## కపోతేశ్వర స్వామి చరిత్ర

కాశ్మీర్‌ను పాలించే శిబి చక్రవర్తి సోదరులు మేఘాడంబితుడు, జీమూత వాహనుడు తీర్థ యాత్రలు చేస్తూ 'చేరుంజర్ల' పర్వత ప్రాంతాల్లో తపస్సు చేసుకొని లింగాకృతి పొంది దేహ త్యాగం చేశారు. శిబి చక్రవర్తి తల్లి అనుమతితో ఈ ప్రాంతం వచ్చి 'శత యజ్ఞ దీక్ష' ప్రారంభించారు. ఈ యజ్ఞ ఫలానికి శిబి ఎంత వరకు అర్హుడో పరీక్షించటానికి త్రిమూర్తులు నిర్ణయించు కున్నారు. స్వర్గలోకం నుంచి దిగి వచ్చిన త్రిమూర్తులు 'రూపెనగుంట్ల' గ్రామం వద్ద రూపు మార్చుకున్నారు. శివుడు కిరాతకునిగా, విష్ణువు కపోతంగా, బ్రహ్మ బాణంగాను రూపుమార్చుకున్నారు. శివుడు వదిలిన శరం కపోతాన్ని తాకగా, అది కుంటుతూ కుంకల గుంట ప్రాంతంలో పడింది. అలా కపోతం శిబి యజ్ఞం చేస్తున్న ప్రాంతానికి చేరింది. ఆ కపోతం శిబి చక్రవర్తిని శరణు వేడింది. కిరాతకుడు రూపంలో శివుడు వచ్చి కపోతాన్ని ఇవ్వమని అడుగగా, అందుకు శిబి అంగీకరించక పోవటంతో నీవు కోరిదవేని దాని ఎత్తు మాంసం నా దేహం నుంచి తీసి ఇస్తాను కాని, పక్షినీయనని అన్నాడు. అందుకు ఆ కిరాతకుడు సమ్మతించాడు. అంతట శిబి త్రాసు నందు తన దేహం నందలి మాంసం తీసి తూచటం ప్రారంభించగా, ఎంత వేసినను సరి పోలేదు. శిబి చింతించి ప్రాణాలు పోవటానికైనా తెగించి తలలో మెదడు తీసి తాసులో పెట్టినా చాలక పోవటం చే రెండో వైపు కూడా తీయబోవుచుండగా, త్రిమూర్తులు మెచ్చి కరుణించి ప్రత్యక్షమై వరం కోరుకోమనగా, ఆ శిబి చక్రవర్తి తనకు శివైఖ్య సంధానాన్ని తన పరివారానికి లింగాకృతులను దయచేయమని కోరాడు. అంత అతడు శివైఖ్యమై పాతాళం వరకు నాటుకొని వెలిశాడు. అతని కోటి పరివారాలు కోటి లింగాలై వెలిశాయి. ఈ విధంగా కపోతాన్ని రక్షించిన శిబి లింగాకృతి దాల్చి ధన్యుడగుటచే ఆ లింగమునకు 'కపోతేశ్వర లింగమని' పేరు వచ్చింది. ఈ స్వామి మహత్యం వల్ల ఆ స్థలం కపోతేశ్వర క్షేత్రంగా ప్రసిద్ధి చెందింది.



కపోతేశ్వర స్వామి గర్భగుడి గోపురం

## ఆలయ చరిత్ర

క్రీస్తు పూర్వ 3, 4 శతాబ్దాల కిందట కపోటేశ్వర స్వామి ఆలయం నిర్మాణం జరిగినట్లుగా దాఖలాలు వున్నాయి. సంస్కృత, పాళి భాషలో ఆలయంలో శాసనాలు వున్నాయి. ఆలయం గుడిసె ఆకృతి కలిగి ఇటుక, సున్నంతో నిర్మితమైంది. గర్భాలయం ఆకృతి విశిష్టమైనదిగా చెపుతుంటారు. దేశంలో హస్తి పృష్ఠ విమానం శాస్త్ర ప్రకారం నిర్మితమైన ఆలయం ఇదొక్కటే. ఈ ఆలయం తొలుత బౌద్ధ చైతన్య గృహమని అనేక సాక్షాదారాలు కన్పిస్తాయి. ఆచార్య నాగార్జునుడు కాలంలో ఈ ఆలయం రూపుదిద్దుకుందని, ఇది ఒక విజ్ఞాన కేంద్రంగా భాసిల్లిందని చరిత్ర చెపుతుంది. ఆలయం ఆకృతి విశేషంగా వుండటం, వాటి మీద పలు బౌద్ధ క్షేత్రాల్లా కన్పించే చిత్రాలు, శిల్పాలు కూడా వుండటం బౌద్ధ చైతన్య గృహం అనటానికి సాక్షాదారాలుగా నిలిచాయి. ఆలయ ఆవరణలో పురాస్తు శాఖ ఆధ్వర్యంలో జరిపిన తవ్వకాల్లో బయలు పడిన అవశేషాలు బౌద్ధారామ జాడలు తెలియజేస్తున్నాయి. దీంతో ఈ ఆలయాన్ని సందర్శించటానికి బౌద్ధ బిక్షువులు కూడా వస్తుంటారు. దేవాదాయ శాఖ ఆధ్వర్యంలో ఆలయాన్ని నిర్వహిస్తున్నారు. ఆలయంలోని పురాతన కట్టడాలను కాపాడేందుకు కేంద్ర పురావస్తు శాఖ దేవస్థానాన్ని తన పరిధిలోకి తీసుకుంది. ఎంతో ప్రాముఖ్యత సంతరించు[illegible]ని ప్రాచీన కళా సంపత్తికి అద్దం పట్టే కపోతేశ్వర ఆలయాన్ని అభివృద్ధి చేయాలని భక్తులు కోరుకుంటున్నారు.



ఆలయ ప్రాంగణంలో వున్న వివిధ ఆలయాలు, శివలింగం

# శృంగేరి భారతీతీర్థుని పుట్టిల్లు నరసరావుపేట

(ఆన్‌లైన్, నరసరావుపేట)

ప్రపంచలోనే శృంగేరికి చాలా ప్రసిద్ధి వుంది. భారతీ తీర్థస్వామి శ్రీ శృంగేరి జగద్గురు పరంపరలో 36వ వారు. విద్యారణ్య స్వామి వారి తరువాత శృంగేరి జగద్గురు పీఠాన్ని అధిష్ఠించిన తెలుగువారు భారతీ తీర్థ స్వామి. ఇంతకూ శృంగేరి జగద్గురు పీఠానికీ నరసరావుపేటకు ఏమిటీ సంబంధం?, నేటి శృంగేరి జగద్గురువులు తమ శైశవాన్ని బాల్యాన్ని, కౌమార్యాన్ని గడిపింది నరసరావుపేటలోనే. ఈ అపురూపమైన అదృష్టం నరసరావుపేటకు దక్కింది. ఇక్కడి పురపాలకోన్నత పాఠశాలలో 10వ తరగతి వరకు స్వామివారు విద్యాభ్యాసం చేశారు. రామిరెడ్డిపేటలో భారతీ తీర్థస్వామివారి కుటుంబం కూడా ఉండేది. సంస్కృతమే ఆయన మాతృభాష. తెలుగు వ్యవహార భాష.



పదేళ్ళ లోపు వయసులోనే ఆయన విజయవాడ ఆకాశవాణి కేంద్ర సంస్కృత కార్యక్రమాలలో పాల్గొని మెప్పు పొందారు. తండ్రి గారి వద్ద వేదం, పౌరోహిత్యం అభ్యసించారు. కొన్ని శుభ కార్యాలు జరిపించారు. ఇదంతలా వారి పదేళ్ల వయస్సులోపే జరగడం విశేషం.

అభినవ విద్యా తీర్థస్వామి శిప్రానదిలో స్నానం చేసి మఠస్థ కార్యకలాపాలు నిర్విహించడానికి తిరిగి వస్తున్న సమయంలో నరసరావుపేట నుంచి వచ్చిన బ్రహ్మచారి ఆయనకు సాష్టాంగ నమస్కారం చేసి వారి వద్ద విద్యాభ్యాసం చేయడానికి అనుగ్రహించవలసిందిగా ప్రార్థించారు. ఆ బ్రహ్మచారి విద్యా పిపాస, దివ్యవతేజం చూసి శ్రీ చరణులవారు అభయ ప్రదానం చేశారు. మరునాటి నుంచే వారికి శాస్త్ర పాఠాలు ప్రారంభించారు. కొద్ది రోజులలోనే శృంగేరి జగద్గురువులకు శ్రీ సీతా రామాంజనేయుల వారు అత్యంత ప్రియ శిష్యులైనారు. సకల శాస్త్రాలు వారి సన్నిధానంలో సముపార్జించారు. ఈ విధంగా వారి సన్నిధానమై వుంటూ సుమారు ఏడెనిమిదేళ్ళు గడవగా శ్రీ శృంగేరి జగద్గురువులు శ్రీ అభినవ విద్యాతీర్థస్వామి వారు శ్రీ సీతారామాంజనేయులు వారికి సన్యాస దీక్ష సమగ్రహించి శ్రీ భారతీ తీర్థస్వామి అనే యోగపట్టం ప్రసాదించారు. భారతీ తీర్థస్వామి దక్షిణాది భాష లన్నింటిలో అనర్గళంగా ఉపన్యసిస్తారు. ఇంగ్లీషు కూడా వారు చక్కగా సంభాషిస్తారు. హిందీ ప్రాంతీయులు అశ్చర్యపడేటట్లు వారు హిందీలో ప్రసంగిస్తారు. ఆయన తపస్విత, వాగ్మిత భారతదేశ మంతటా ఎంతో ప్రసిద్ధి పొందాయి. నరసరావుపేట సహచర్యం పదిహేను సంవత్సరాలే. అయినా ఈ ఊరికి వారు ఎంతో అనుగ్రహించి ఇక్కడ శృంగేరి శారదాలయాన్ని, శంకర మఠాన్ని వీరు నిర్మింపజేశారు.











## నాటకప్రయోక్తగా, భావకవిగా

# లబ్ధ ప్రతిష్ఠుడు 'అబ్బూరి'

నాటక ప్రయోగం, రంగాలంకరణ, ఆహార్యం, సంగీతం వంటి విషయాలలో వినూత్న ప్రయోగాలకు శ్రీకర్తగా నిలిచిన నటుడు, దర్శకుడు, భావకవి అబ్బూరి రామకృష్ణారావు. మహాకవి శ్రీశ్రీని భావకవితా మార్గం నుంచి అభ్యుదయ కవిత్వంవైపునకు మలుపుతిప్పిన ఖ్యాతి కూడా అబ్బూరికే దక్కుతుంది. తెనాలి తాలూకాలోని అనంతవరం గ్రామంలో 1896 మే 20న జన్మించిన అబ్బూరి ఆంధ్ర విశ్వ విద్యాలయ స్థాపన అనంతరం వైస్ ఛాన్సలర్ సీఆర్ రెడ్డి కోరికపై గ్రంథాలయ అధికారిగా చేరారు. అబ్బూరి నాటకరంగానికి చేసిన కృషికి ఆంధ్ర విశ్వవిద్యాలయం ఒక వేదికగా నిలిచింది. విశ్వవిద్యాలయ డ్రమటిక్ అసోసియేషన్‌ను స్థాపించారు. ముఖ్యమంత్రి, వార్షికోత్సవం, ప్రజాశత్రువు, బొమ్మరిల్లు, ధాన్యలక్ష్మి వంటి నాటకాలను రచించి స్వీయ దర్శకత్వంలో ప్రదర్శించారు. కేంద్ర సంగీత నాటక అకాడమీ ప్రచురణల కమిటీ సభ్యులుగా వ్యవహరించారు. అఖిలభారత అభ్యుదయ రచయితల సంఘ పత్రిక ఇండియన్ లిటరేచర్‌కు సంపాదకవర్గ సభ్యులుగా పనిచేశారు. ఆంధ్రరత్న దుగ్గిరాలకు అత్యంత సన్నిహితుడైన అబ్బూరి రామదండు ఉద్యమంలో పాల్గొన్నారు. దుగ్గిరాల కోరికపై అబ్బూరి రచించిన జలియన్‌వాలా బాగ్ జంగం కథకు విశేష ప్రచారం లభించింది. బ్రిటిష్ ప్రభుత్వం దీనిని నిషేధించింది. కేంద్ర సంగీత నాటక అకాడమీ, కేంద్ర ప్రభుత్వం సంయుక్త ఆధ్వర్యంలో రూపొందించిన రంగస్థల నిఘంటు నిర్మాణ కమిటీ సభ్యులుగా వ్యవహరించారు. హైదరాబాదులో నాట్య విద్యాలయాన్ని స్థాపించి సంవత్సరకాలం శిక్షణను ఇచ్చే సర్టిఫికెట్ కోర్సును నిర్వహించారు. మృచ్ఛకటికం నాటకాన్ని వ్యవహారిక భాషలోకి అనువదించి రాష్ట్రపతి భవన్‌లో సర్వేపల్లి సమక్షంలో ప్రదర్శించారు. దూరదర్శన్ నుంచి ప్రసారమైన తొలి నాటకంగా మృచ్ఛకటికం చరిత్ర సృష్టించింది. నటాలి అనే సంస్థను స్థాపించి కళాకారులకు నెలవారీ జీతాలను ఇస్తూ అనేక నాటకాలను ప్రదర్శించారు. సుప్రసిద్ధ నృత్య దర్శకుడు పసుమర్తి కృష్ణమూర్తిని వెలుగులోకి తెచ్చిన ఘనత కూడా అబ్బూరివారిదే.

రాష్ట్రంలోని నాటక సంస్థలన్నీ కలిసి రూపొందించిన ఏపీ థియేటర్స్ అసోసియేషన్ అధ్యక్షుడిగా అబ్బూరి ఎన్నికయ్యారు. యునెస్కో ఆధ్వర్యంలో జరిగిన అంతర్జాతీయ నాటక సదస్సులో భారత ప్రతినిధిగా పాల్గొన్నారు. నాటకరంగంపై రచించిన దీ తెలుగు స్టేజీ, నాటక ప్రయోగం వంటి వ్యాసాలు ప్రామాణికంగా నిలిచాయి. నాటక ప్రయోగం ప్రజా జీవనానికి సన్నిహితంగా ఉండి సామాజిక వ్యవస్థలో అంతర్భాగం కావాలని అబ్బూరి భావన. నాటకం, భావకవిత్వ రంగాలలో విశేషమైన కృషిచేసిన అబ్బూరికి 1974లో ఆంధ్ర విశ్వవిద్యాలయం కళాప్రపూర్ణ పురస్కారాన్ని ప్రదానం చేసింది. నాటకాన్ని కాలక్షేపం కాకుండా ఆలోచనలను రేకెత్తించేదిగా, నిద్దుర వదిలించేదిగా ఉండాలని తపనపడి ఆరు దశాబ్దాల కాలం నాటకరంగానికి తన జీవితాన్ని అంకితం చేసిన అబ్బూరి 1979 ఏప్రిల్ 30న అస్తమించారు.

**డాక్టర్ కందిమళ్ల సాంబశివరావు**

## టిక్కెట్ రాక నామినేషన్ ఉపసంహరించుకున్న చేబ్రోలు హనుమయ్య

గుంటూరు: జిల్లా కాంగ్రెస్ రాజకీయాలను రెండు దశాబ్దాల పాటు శాశించిన దివంగత చేబ్రోలు హనుమయ్య పార్టీ టిక్కెట్ లభించకపోవటంతో నామినేషన్‌ను ఉపసంహరించుకోవాల్సి వచ్చింది. ఇది నమ్మలేని నిజం. డాక్టర్ వైఎస్ రాజశేఖర్‌రెడ్డి పీసీసీ అధ్యక్షుడుగా ఉన్న సమయంలో 1985లో శాసన సభకు ఉప ఎన్నికలు జరిగాయి. నాదెండ్ల భాస్కరరావు వెన్నుపోటు తరువాత ఎన్టీ ఆర్ శాసన సభను రద్దు చేశారు. 1983లో సత్తెనపల్లిలో ఓడిపోవటంతో 1985 అసెంబ్లీ ఎన్నికల్లో టిక్కెట్ తనకే వస్తుందనే ధీమాతో చేబ్రోలు హనుమయ్య అట్టహాసంగా గుంటూరు–2 శాసన సభకు కాంగ్రెస్ అభ్యర్థిగా నామినేషన్ దాఖలు చేశారు. ఢిల్లీ నుంచి విడుదలైన అభ్యర్థుల జాబితాలో హనుమయ్య పేరు లేదు. ఆ ఎన్నికల్లో గుంటూరు–2 నుంచి కాంగ్రెస్ బీసీ అభ్యర్థి చదలవాడ జయరాంబా గెలుపొందారు.

## గుంటూరు తిరుపతిగా వాసికెక్కిన

# గార్డెన్స్ వెంకటేశ్వరస్వామి దేవాలయం

(గుంటూరు ఆన్‌లైన్, కల్చరల్)

ఆధ్యాత్మిక, సాంస్కృతిక, సామాజిక, విద్య, వైద్య రంగాల్లో ఖ్యాతి గడించిన గుంటూరు జిల్లాలో తన కంటూ విశిష్టతను సంతరించుకున్న బృందావన్ గార్డెన్స్ శ్రీ వేంకటేశ్వర స్వామి ఆలయం గుంటూరు తిరుపతిగా వాసికెక్కింది. అడుగుపెట్టగానే ఆధ్యాత్మిక భావన కలిగే విధం ఆలలయ ప్రాంగణం నిర్మాణం, చల్ల గాలితో మనసుకు ఆహ్లాదపరిచే చెట్టుతో ఆధ్యాత్మిక, సాంస్కృతిక కార్యక్రమాల నిర్వహణకై ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన అన్నమయ్య కళా వేదిక, శ్రీ పద్మావతి కల్యాణ మండపం, యజ్ఞశాల గ్రంథాలలయంతో ఆ ప్రాంగణం ఆధ్యాత్మిక కేంద్రంగా విరాజిల్లుతుంది. యలమంచిలి జోగయ్య మనస్సులో కలిగి ఆలోచనే దేవాలయ నిర్మాణానికి నాంది పలికింది. బృందావన్ గార్డెన్స్ లోని దుర్గంధ భూయిష్టమైన క్వారీ ప్రాంతం నేడు అత్యంత సుందరమైన దేవాలయంగా రూపాతరం చెందింది. దేవాలయ నిర్మాణానికి క్వారీ ప్రాంతాన్ని ఎంచుకున్న నీరుకొండ రంగారావు, గుమ్మడి రాధాకృష్ణమూర్తి, ఉప్పాల గోపాలరావు, లంకా సూర్యనారాయణ, గోగినేని లక్ష్మీనరసయ్య, కొర్రపాటి శ్రీ హరిరావు తదితరులు సామాజిక సేవా తత్పరులు ఒక కమిటిగా ఏర్పడి, భక్తుల విరాళాలతో క్వారీని శుభ్రపరిచి పవిత్ర దేవాలయంగా తీర్చిదిద్దారు. 1993 వ సంవత్సరంలో కంచి పీఠాధిపతులు శ్రీ జయేంద్ర సరస్వతి స్వామి స్వహస్తాలతో దేవాలయ నిర్మాణానికి శంకుస్థాపన చేశారు. వేంకటేశ్వర స్వామి మూలవిరాట్‌ను స్వామి ఉభయ దేవేరిల మూలవిరాట్ విగ్రహాలను శ్రీకాళహస్తి పీఠాధిపతులు శ్రీ విద్యాస్వరూపానందగిరి స్వామీజీ ప్రతిష్టించారు. దేవాలయం కంచి కామకోటి పీఠానికి అనుబంధంగా స్వామీజీ ఆదేశానుసారం పూజా కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. నిత్యధూపనైవేద్యాలు, ప్రతి నెలా శ్రవణానక్షత్రంలో స్వామివారికి ప్రత్యేక అభిషేకాలు, ఉత్తరీఫల్గుని నక్షత్రంలో పద్మావతి, అండాళ్ సమేత స్వామి కల్యాణం, ప్రతి నెల మొదటి మంగళవారం స్వామికి అష్టదళ సువర్ణపుష్పాలతో అర్చనలు వార్షిక బ్రహ్మోత్సవాలు, ఉగాది, శ్రీ రామనవమి, వినాయకచవితి, దసరా ఉత్సవాలను నిర్వహిస్తున్నారు.



వెంకటేశ్వర స్వామి దేవాలయం



ఉభయదేవేరులతో స్వామి మూలవిరాట్.

### కళలకు కాణాచి అన్నమయ్య కళావేదిక

నిత్యం ఆధ్యాత్మిక, సాంస్కృతిక, సాహిత్య కార్యక్రమాలతో అన్నమయ్య కళావేదిక విరాజిల్లుతుంది. హరికథలు, బుర్రకథలు, నాటకాలు, శాస్త్రీయ, జానపద నృత్యాలు, శాస్త్రీయ సంగీత కచేరీలు, అష్టావధానాలు, సంగీత అవధానాలు, స్వామీజీలు ఆధ్యాత్మిక ప్రవచనాలు, పండితుల ప్రసంగాలు తదితర కార్యక్రమాలు అన్నమయ్య కళావేదికపై నిర్వహిస్తున్నామన్నారు. ఎందరో కళాకారుల కళాప్రదర్శనకు దోహదపడుతుంది. దేశదేశాల నుండి అనేక మంది పీఠాధిపతులు, స్వామీజీలు, మఠాధిపతులు స్వామిని దర్శించి క్షేత్ర పవిత్రతకు వన్నె తెచ్చారు. అన్నమయ్య కళాసేవా సమితి ఆధ్వర్యంలో మున్సిపల్ ధార్మిక ప్రాంగణంలో పలు సేవాకార్యక్రమాలు నిర్వహిస్తుంది. అన్నమయ్య గ్రంథాలయం, అన్నమయ్య పార్కు, తెలుగుతల్లివిగ్రహం, నిత్యాన్నదానం, వృద్ధులకు విశ్రాంతి స్థలం ఏర్పాటుచేశారు. గుడి వెనకగల చెరువులో వాకింగ్ ట్రాక్, బోట్‌షికారు కార్యక్రమాలకు రూ పుదిద్దుకుంటోంది. నగరంలోని మూ డు శ్మశానవాటికలను మహాప్రస్థానం ఆ ధ్వర్యంలో సుందరవనాలుగా తీర్చిదిద్దారు. సిహెచ్ మస్తానయ్య, గద్దె రామతులసమ్మ ఆధ్వర్యంలో పలు సేవా, ఆధ్యాత్మిక కార్యక్రమాలు జరుగుతున్నాయి.

### కాంగ్రెస్ బిఫారం రాక నామినేషన్

## ఉపసంహరించుకున్న రాయపాటి



(ఆన్‌లైన్ - గుంటూరు)

రాయపాటి సాంబశివ రావుకు ఒకప్పుడు గుంటూరు లోక్‌సభ సీటు రాలేదు. పార్టీ సింబల్ వస్తుందనే ధీమాతో నామినేషన్ వేసి బిఫారం రాక ఉపసంహరించుకోవాల్సి వచ్చింది. కాంగ్రెస్‌లో రాజీవ్‌గాంధీ హవా సాగుతున్న రోజుల్లో 1991లో లోక్‌సభకు ఉప ఎన్నికలు జరిగాయి. ఆ ఎన్నికల్లో తనకు టిక్కెట్ వస్తుంద నే ధీమాతో భారీ ప్రదర్శనగా రాయపాటి గుంటూరు లోక్‌సభకు నా మినేషన్ దాఖలు చేశారు. సిట్టింగ్ ఎంపిగా ఉన్నది వంగత ఆచార్య ఎన్‌జి

#### 1991లో టిక్కెట్ నిల్

రంగా లోక్‌సభ ఉప నాయకుడుగా కొనసాగుతున్నారు. అప్పట్లో రాజీవ్‌గాంధీకే సలహాలు ఇచ్చే దశలో రంగా ఉన్నారు. రంగా వయోవృద్ధుడైనందున టిక్కెట్ తనకే వస్తుందనే ధీమాతో రాయపాటి నామినేషన్ వేశారు. ఈ వ్యవహారాన్ని ఆచార్య రం గా ప్రతిష్టాత్మంగా తీసుకోవటంతో స్వయంగా రాజీవ్‌గాంధీ జోక్యం చేసుకొని ఎన్‌జి రంగా టిక్కెట్‌ను ఖరారు చేశారు. దీంతో చేసేదేమి లేక రాయపాటి సాంబశివరావు గుంటూరు లోక్‌సభకు కాంగ్రె స్ అభ్యర్థిగా వేసిన నామినేషన్‌ను ఉపసంహరించుకోవాల్సి వచ్చింది. ఎన్‌జి రంగా 1994లో మృతి చెందారు. దీంతో 1996 నుంచి రాయపాటి సాంబశివరావు గుం టూరు లోక్‌సభకు కాంగ్రెస్ అభ్యర్థిగా కొనసాగుతూ ఉన్నారు.
















































# భక్తుల పాలిట మణిహారం
# మాచర్ల చెన్నకేశవుడు

(డీవీఆర్కే, భువనేశ్వరరావు, మాచర్ల)

పౌరుషం ఎగసిపడే పల్నాటి ప్రాంతంలో ప్రజలకు ఆధ్యాత్మిక చింతనను పంచుతున్న చారిత్రక దేవాలయం శ్రీ లక్ష్మీ చెన్నకేశవాలయం. పూర్వకాలంలో కార్తవీర్యార్జుని వంశీకులు నిర్మించిన చెన్నకేశవ ఆలయాన్ని పల్నాటి బ్రహ్మనాయుడు 13వ శతాబ్దంలో పునర్నిర్మించినట్లు చారిత్రక గ్రంథాలు చెబుతున్నాయి. క్రీస్తుశకం 1397 వరకు మాచర్లను మహాదేవిచర్లగా పిలిచేవారని, నాటి ఆ పేరే మాచర్లగా మారిందని ప్రతీతి. రెండవ ప్రతాపరుద్ర మహాదేవ రాజు సామాంతరాజైన మాచాయనాయుడు పేరు మాచాయ శబ్దం కాలక్రమేణా మాచర్లగా మారి వుండవచ్చునని కొన్ని శాస్త్రాలు చెబుతున్నాయి. ఈ శాసనం తరువాత లభించిన అనేక ఆధారాల్లో మాచర్ల అని రాయబడి వుంది. అంతే కాక బ్రహ్మనాయుడు మజిలీ చేసిన తావు మాచర్ల అయిందని, తన స్వస్థలమైన మాచపురానికి బదులుగా బ్రహ్మనాయుడు మాచర్లను నిర్మించాడని పద్మనాయ చరిత్ర చెబుతోంది. మాచర్లకు విష్ణుపురి అనే మరొక పేరు వుంది. చంద్రవంక నది తీరంలో ప్రవహం తూర్పు-పశ్చిమ దిశల నుండి ఉత్తరం వైపునకు ప్రవహిస్తుంది. ఉత్తర వాహిణి స్థలం పరమ పవిత్రమైనదని భావిస్తూ వుంటారు. అలాంటి పవిత్రమైన ప్రదేశంలో శ్రీ చెన్నకేశవస్వామి వెలిశాడు. సర్వ మానవ సమానత్వాన్ని సౌభ్రాతృత్వాన్ని 13వ శతాబ్దంలోని చాటి చాపకూటి సిద్ధాంతంతో మానవులంతా ఒక్కటేనని నిరూపించిన బ్రహ్మనాయుడి పేరు వింటే ప్రతి ఒక్కరికి స్ఫూరించేది ఆయన పునర్నిర్మించిన మాచర్లలోని శ్రీ లక్ష్మి చెన్నకేశవస్వామి వారి దేవాలయమే. ఈ ఆలయంలోని శిల్ప కళా వైభవం నాటి కళాకారుల నైపుణ్యతను తెలియజేస్తాయి. అందానికి ప్రతిరూపమైన విష్ణువు చెన్నుని రూపంలో ఈ ఆలయంలో వెలిశాడని ప్రతీతి. స్వామి వారి విగ్రహం గర్భగుడిలో మూడు అడుగుల ఎత్తులో వుంది. అందులో భూదేవి, శ్రీదేవి సమేత చెన్నకేశవుడు యాగభేరాలు, తీర్థ, బకిబేరాలు, అళ్వారులు, రామానుజులు, వడయరాజులు, వెన్నముద్దల కృష్ణయ్య, ఉత్సవ వ ృహార్త్తిలు వున్నాయి. గర్భగుడికి ముందు రంగ మండపం వుంది. దీనిని పరిశీలిస్తే నాటి శిల్పకళా చాతుర్యం ఏ విధంగా వుందో విశిధమవుతోంది. ఈ మండపంలోని నాలుగు స్థంభాల పై ఈశాన్య దిశ వైపు వున్న స్తంభం పై భారత ఘట్టాలైన కర్ణార్జునుల యుద్ధం, పాచికలాట, అశ్వమేథయాగం, గథాయుద్ధం చెక్కబడినవి. ఆగ్నేయ స్తంభం పై రామాయణంలోని మాయలేడిని వేటాడడం, వాలి సుగ్రివ యుద్ధం, కైలాస గిరిని ఎత్తడం, నైరుతి స్తంభం పై భాగవతంలోని వినాయక, గజాసురుని యుద్ధం, త్రిపుర సంహారం, సాగర మధనం, దేవతాకూటమి, ఏనుగుల అభిషేకం, అమృతం పంచటం వంటివి శిల్పాలలో మలచబడ్డాయి. కాలగమనంలో చెన్నకేశావాలయం ఎన్నోసార్లు పునరుద్ధరించినట్లు తెలుస్తోంది. ఈ ప్రాంతాన్ని శైవులు, కాకతీయులు ఏలినట్లు చరిత్ర చెబుతోంది. సూరపురాజు వంశీయుల సంతానమైన లక్ష్మీదేవమ్మ చెన్నునిలో ఐక్యమైనందున ఇదే ఆలయంలో లక్ష్మీదేవికి మరో ఆలయాన్ని నిర్మించారు. ప్రతి సంవత్సరం చైత్ర శుద్ధ పంచమి నాడు స్వామివారి కళ్యాణంతో ప్రారంభమై 16 రోజుల పాటు జరిగే ఉత్సవాలు రథోత్సవంతో ముగుస్తాయి. దుర్గి వాస్తవ్యులు కుంచనపల్లి నారాయణ దంపతులు 1980, ఏప్రిల్ 29న (మిగతా 76లో)


శ్రీ చెన్నకేశవస్వామి


లక్ష్మీదేవి అమ్మవారు

# భక్తుల పాలిట మణిహారం.. మాచర్ల చెన్నకేశవుడు

(75వ పేజీ తరువాయి)

స్వామివారి రథాన్ని తయారు చేయించారు. ఆనాడే మొదటి రథోత్సవం జరుపుకుంది. కులమతాలకు అతీతంగా భక్తులు చెన్నకేశవుని దర్శించి కటాక్షం పొందుతుంటారు. జై చెన్నకేశవా.. జైజై చెన్నకేశవా... అంటూ భక్తులు చేసే నినాదాలతో ఈ ప్రాంతం భక్తి పారవశ్యంతో మారుమోగుతోంది.

### చెన్నునికి ఎన్ని కష్టాలో..

ఎంతో ఆదాయం కలిగిన శ్రీ లక్ష్మీ చెన్నకేశవ ఆలయ ఆస్తులు అన్యాక్రాంతమై నేడు పోషణే ప్రశ్నార్థకమైంది. ఒకప్పుడు రెండు వేల ఎకరాలకు పైగా వున్న దేవుని మాన్యం హారతి కర్పూరంలా కరిగిపోయింది. ఉన్న కొద్దిపాటి భూముల నుండి కూడా నామమాత్రపు ఆదాయమే వస్తోంది. ఆలయ కమిటి ఏర్పాటుచేసిన నిత్య కళ్యాణ వేడుకల ద్వారా ఈ స్వామికి కాసింత ప్రసాదం, తీర్థం లభ్యమవుతున్నాయి. భక్తులు ఇచ్చే కానుకల పైనే ఆలయ వేడుకలు ఆధారపడడం శోచనీయం. ఎన్నో విశిష్టతలున్న చెన్నుని దర్శనార్థం వచ్చే దూర ప్రాంతీయులకు బస చేసేందుకు ఏమాత్రం సౌకర్యాలు లేవు. యగ్న యాగాదులు నిర్వహించేందుకు ఏర్పాట్లు లేవు. ఉత్సవ వేళల్లో స్వామి వారిని ఊరేగించే ప్రత్యేక వాహనాలను భద్రపరచే వాహనశాల కూలిపోయింది. గర్భగుడిలోనే ఆ వాహనాలను వుంచడం వల్ల ఆ ప్రాంగణం ఇరుకైంది. ఆలయ ప్రాంగణంలో తిరుమల తిరుపతి దేవస్థానం కళ్యాణ మండపాన్ని చేపట్టడం ఒకటే కొంత ఊరటగా చెప్పుకోవచ్చు.

బాపట్ల సూర్యలంకతీరంలో స్నానాలు చేస్తున్న పర్యాటకులు



## అత్యంత ఆహ్లాదకరం
# సూర్యలంక సముద్రతీరం

(ఆన్‌లైన్- బాపట్ల)

స్వచ్ఛమైన సముద్రపు కెరటాలు... ఇసుక తిమ్మెరలు..కాలుష్యం లేని తెరచాప పడవలు..కన్యాకమారిని తలపిస్తూ సూర్యదర్శనం.. కన్నుల పండువగా బాపట్ల సూర్యలంక తీరం పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తూ ఆంధ్రా గోవాగా ఖ్యాతి గాంచింది. బాపట్ల సూర్యలంక తీర ప్రాంతం అర్ధచంద్రాకారంలో ఉండటంతో ఎటువంటి ప్రమాదాలు ఈ ప్రాంతంలో సంభవించవని నిపుణులు తెలియజేస్తున్నారు. ఈ ప్రాంతం నుంచే కాకుండా గుంటూరు, కృష్ణా,ప్రకాశం, నల్గొండ జిల్లాల నుంచి భక్తులు అధిక సంఖ్యలో తరలి వచ్చి కార్తీక పౌర్ణమి పుణ్యస్నానాలు ఆచరిస్తారు.



తీరంలో ఏర్పాటు చేసిన మహిళలు బట్టలు మార్చుకునే వసతి గృహం

### ప్రయాణం ఇలా...

గుంటూరు జిల్లా బాపట్ల మండలంలో వున్న సూర్యలంక తీరానికి చేరుకోవడానికి పట్టణంలో నుంచి ప్రత్యేకంగా ఆర్టీసి బస్సులు,ఆటోలు అన్ని వేళలా తిరుగుతాయి.బాపట్ల నుంచి ఎనిమిది కిలో మీటర్లు వున్న సూర్యలంక తీరానికి పట్టణంలోని రైల్వేస్టేషన్, బస్‌స్టేషన్ నుంచి ఆటోల సౌకర్యం ఉంది. ఇతర జిల్లాలకు చెందిన ప్రజలు బాపట్లకు రావడానికి రైలు,బస్సుల సౌకర్యం కలదు. హైదరాబాదు,విజయవాడ,గుంటూరు, ఒంగోలు నుండి ప్రతి గంటకు బాపట్లకు రావడానికి రైలు సౌకర్యం వుంది.

### వసతుల వివరాలు

ఆంధ్ర టూరిజం డెవలఫ్‌మెంట్ కార్పొరేషన్ ఆధ్వర్యంలో సూర్యలంక తీరంలోని హరిత బీచ్ రిస్టార్ట్స్ ఏర్పాటు చేశారు. ఈ రిసార్ట్స్‌లో ఏడు పడకలు కలిగిన డార్మెటరి రోజుకు 840 రూపాయలు, మూడు పడకలు కలిగిన డార్మెటరీకి రోజుకు 450రూపాయలు, ఎసి కాటేజి రోజుకు శని,ఆదివారాలలో 1575 రూపాయలు, మిగిలిన వారాలలో 1260 రూపాయలు చొప్పున అద్దె వసూలు చేస్తున్నారు. కాటేజిలు అవసరమైన వారు ఆన్‌లైన్‌లో కూడా బుకింగ్ చేసుకునే అవకాశం కల్పించారు.పర్యాటకుల రద్దీని దృష్టిలో వుంచుకుని మరో పది ఏసి కాటేజిలు నిర్మిస్తున్నారు. ప్రత్యేకంగా ప్యామిలీ రెస్టారెంట్ సౌకర్యం వుంది. ఇక్కడ అన్ని రకాల వెజ్,నాన్‌వెజ్, డ్రింక్స్ సరఫరా చేస్తారు. అవసరమైన పర్యాటకులు 9948391759 సెల్ నెంబరు, 08643- 224616కు ఫోన్ చేసి రిజర్వు చేసుకోవచ్చు. జిల్లా పంచాయతీరాజ్‌శాఖకు చెందిన అతిథి గృహం సూర్యలంకలో వుంది. ఈ అతిథి గృహంలో షూట్లు రిజర్వేషన్ చేసుకోదలచిన వారు జిల్లా పంచాయతీ రాజ్ కార్యాలయంలో తెనాలి, పొన్నూరు పంచాయతీరాజ్ కార్యాలయాలలో రిజర్వు చేసుకోవచ్చు. బాపట్ల పట్టణంలో వ్యవసాయ కళాశాల అతిథి గృహం, ఆర్ అండ్ బి అతిథి గృహాలతో పాటు భావన రెసిడెన్సీ, బాలాజిలాడ్జి, శ్రీనివాస లాడ్జి, శ్రీరామలాడ్జిలలో వసతులను ఏర్పాటు చేసుకోవచ్చు. సూర్యలంకతీరంలో ఎలాంటి సంఘటనలు జరగకుండా మెరైన్ (మిగతా 77లో)





తీరంలోని హరిత బీచ్ రిసార్ట్స్



తీరంలోని పంచాయతీరాజ్ అతిథి గృహం

# అత్యంత ఆహ్లాదకరం.. సూర్యలంక సముద్రతీరం

(76వ పేజీ తరువాయి)

పోలీసు స్టేషన్‌ను ఏర్పాటు చేశారు.

## తీరం ప్రత్యేకతలు

బాపట్ల–సూర్యలంక సముద్రతీర ప్రాంతాలకు ఒక ప్రత్యేకత వుంది. బాపట్ల ప్రాంతంలో సూర్యలంక తీరం అర్ధచంద్రాకారంలో వంపు తిరిగి ఉండటం వలన ఈ ప్రాంతంలో ప్రమాదాలు జరిగే అవకాశాలు తక్కువగా ఉన్నాయని నిపుణులు అంచనా వేశారు. తెల్లవారుఝామున సూర్యోదయం దర్శనం చేసుకోవడం ఈ ప్రాంతం ప్రత్యేకత.తీరం ఎటువంటి దుర్వాసనలు వెదజల్లకుండా ప్రకృతి రమణీయతకు ప్రతీకగా ఉంటుంది. బాపట్ల నుండి సముద్ర తీరానికి వెళ్ళే మధ్య ప్రాంతంలోని అటవీశాఖ ఆవరణలో జీడి,సరివి,జామాయిల్ తోటలు విస్తారంగా ఉండటంతో కార్తీక సమారాధనలు చేసుకోవడానికి అనుకూలంగా ఉండటంతో పాటు పర్యాటకులను విశేషంగా ఆకర్షించే వాతావరణాన్ని ఈ తోటలు కలిగిస్తాయి.

## చూడదగిన ప్రదేశాలు

బాపట్ల ప్రాంతంలో 1400 సంవత్సరాల క్రితం నిర్మించినటువంటి చారిత్రాత్మక శ్రీ భావన్నారాయణస్వామి దేవాలయం, ఈ ప్రాంత ప్రజలు ఉప్పెనల భారిన పడకుండ తీరంలో ఏర్పాటు చేసిన భజన హనుమంతుని దేవాలయం, పట్టణంలోని సోమేశ్వరస్వామి దేవాలయం, జిల్లెళ్ళమూడి అమ్మ దేవాలయ ప్రాంగణం, చందోలులోని లింగోద్భవ క్షేత్రం, బండ్లమ్మ దేవాలయం, అల్లూరు నరసింహాస్వామి దేవాలయం, పట్టణంలోని వివిధ కళాశాలలు ప్రసిద్ధిగాంచిన ప్రదేశాలుగా యాత్రీకులను ఆకట్టుకుంటున్నాయి.



తీరంలోని శ్రీభజన ఆంజనేయస్వామి

# నాగులేటి తీరం... ఆధ్యాత్మిక నిలయం

( ఆన్‌లైన్, కారంపూడి)

'వీరులు దివ్యలింగములు, విష్ణువు
చెన్నాడు, కల్లిపోతరా
జారయ కాలభైరవుడు, సంకము
శక్తి యొయన్న పూర్ణయున్ గెరిడు
గంగాధరముడుగే మణికర్ణికరగా
జెలంగునీ
కారంపూడి పట్టణం కాశిగదా పల
నాటి వారికిన్ '

కారంపూడి పట్టణం పల్నాటివారికి కాశీతో సమానం. అందుకే దీనిని దక్షిణ కాశీగా అభివర్ణించారు. ఉత్తర వాహినిగా ప్రవహించే జీవనది నాగులేరు వుండడం ఈ క్షేత్ర ప్రాశస్థ్యాన్ని మరింత కీర్తివంతం చేసింది. పట్టణ కేంద్ర స్థానంలో మహిషాసురమర్ధిని అంకాళమ్మ దేవాలయం, పక్కనే గణములకు అధిపతి వినాయక దేవాలయం, సూరేశ్వర దేవాలయం, ఇటు పక్క చెన్నకేశవ దేవాలయం, ఆముంగిట వీరాంజనేయ స్వామి దేవాలయం నిర్మితమై వుంది. ఈ ఆలయాల సముదాయంలో కాకారంపూడి గ్రామం ఓ దివ్యక్షేత్రంగా భాసిల్లుతున్నది. ఈ ప్రదేశంలోనే గ్రామపెద్ద ఏచూరి హరినాథ్ షిరిడి సాయి దేవాలయాన్ని నిర్మించాడు. వీరాంజనేయస్వామి ఆలయానికి ఉత్తరం వైపునగల స్థలంలో ఒక వేదిక వుండేది. ఆ వేదికను ఆధ్యాత్మిక కేంద్రంగా తీర్చిదిద్దేవారని ఆయన భావించాడు. గ్రామ పెద్దలను సంప్రదించి మనసులోని ఆలోచనలను వారి ముందుంచారు. పలనాటి గ్రంథ రచయిత అయ్యప్పస్వామి దీక్షాపరుడు, గురుస్వామి, కీర్తిశేషుడు డాక్టర్ పివి ఆచారిని ఆనాడు కలిసి సాయి మందిర నిర్మాణ సంకల్పాన్ని తెలిపారు. దుఃఖ నివారణార్థం, సాధన , తపస్సు, అందరిని ప్రేమించే గుణం, కారుణ్యం అదే సాయితత్వమని ఆ ప్రదేశంలో షిరిడి సాయి మందిరం నిర్మించటం శుభప్రదమని చెప్పి రూపకల్పన చేశారు. ఇక్కడ సాయినాథుడు పిలిస్తే పలికే దేవుడుగా, భక్తుల పాలిట ఆపద్బాంధవుడుగా ప్రసిద్ధికెక్కాడు.



ఉత్తర వాహిని నాగులేరు

## మహిమాన్విత అంకాళమ్మ

కారంపూడిలో వెలసిన అంకాళమ్మ అమ్మవారు గొప్ప మహిమ గల దేవత. పల్నాటి వీరాచారవంతులు అమ్మవారిని ఇష్టదైవంగా పిలిస్తే పలికే దైవం. భక్తుల పాలిట కొంగు బంగారం. పల్నాటి వీరులు ఆరాధించే దేవత కనుక వీర్ల అంకాళమ్మగా పిలుస్తారు. జనసామాన్యంలో అనేక మంది అంకయ్య, అంకమ్మ, వీర్ల అంకయ్య, అంకారావు అనే పేర్లు పెట్టుకుంటారు. కారంపూడి నడిబొడ్డున వెలసిన ఈ దేవాలయంలో అమ్మవారి విగ్రహం తలవంచి ఎడమవైపునకు ఒరిగినట్లు వుంటుంది. యుద్ధరంగంలో ఒక్కొక్కరు పల్నాటి వీరులు నేలకొరుగుతుంటే, రాలిపోయిన ఆ వీరుల కోసం అమ్మవారు దుఃఖిస్తుంది. అమ్మవారి కంటి కింద ఓ గిన్నెపెట్టి వుంటుంది. కొమ్మరాజు తదితర భక్తులు రణరంగంలో చనిపోవటం వలన అంకమ్మ తల్లి దుఃఖిస్తున్నదని, అందుకే ఆమె ఎడమకన్ను నుంచి నీరు కారుతోందని చెప్పుకొంటారు. ఆమె కన్నీరు గిన్నెలో కారుతుంటుంది. ఆ కన్నీరు కిందపడితే అరిష్టమని అందుకే గిన్నె పెట్టబడిందని చరిత్ర తెలుపుతోంది. ఈ అమ్మవారి విగ్రహానికి ఎదురుగా గల ప్రహరీకి చిన్న కిటికీ వుంది. నాగులేరు రణరంగ స్థలం అక్కడ నుంచి కనిపిస్తుంది. అన్ని కులాలవారు అమ్మవారిని పూజిస్తారు. వ్యాధులు ప్రబలినప్పుడు, ఆపదలు వాటిల్లినప్పుడు అమ్మవారిని మొక్కుకుంటారు. భక్తుల పాలిట కొంగు బంగారంలా నిలిచిన అంకాళమ్మకు తలనీలాలిచ్చి తమ మొక్కు తీర్చుకుంటారు. అమ్మవారి మహిమలు తెలిపే అనేక ఉదంతాలు ప్రాచుర్యంలో వున్నాయి.



అంకాళమ్మ అమ్మవారి మూలవిరాట్

అంకాళమ్మ తల్లి పిడుగువారి ఇలవేల్పని, ఆడపడుచులా ప్రేమానురాగాలు కురిపిస్తుందని కథలుగా చెప్పుకుంటారు. అలాగే గ్రామంలో వ్యాధులు ప్రబలినప్పుడు కొలుపులు జరిపితే అమ్మవారే స్వయంగా వేపమండలు పట్టి గ్రామాన్నాంతా చుట్టి తిరిగి రక్షించేందని , కొందరు పెద్దలు అది స్వయంగా దర్శించారని కథలుగా చెబుతున్నారు. మహిమాన్విత అయిన అంకాళమ్మ ఇక్కడ వెలసి ఆపన్నులను సర్వావస్తల్లో ఆదుకుంటుదనేది నగ్నసత్యంగా అమ్మవారి మహిమలు బహిర్గతమయ్యాయి.

అప్పటి వీరాచార పీఠాధిపతి అయిన కీ.శే. పిడుగు భద్రయ్య జీవించివుండగా, వారు ఎప్పుడు పిలిస్తే అప్పుడు అమ్మవారు వచ్చినట్లు ఈ ప్రాంతంలో ఒక కథ చెప్పుకుంటారు. ఒకప్పుడు వీరాచారాలకు సంబంధించిన వివాదంతో కొందరు మరణించగా, అందుకు బాధ్యులు భద్రయ్యేనని నేరం ఆరోపించగా,

మిగతా 79వ పేజీలో

# నాగులేటి తీరం....

(78వ పేజీ తరువాయి)

విచారణకు కొండవీడులోని కోర్టుకు వెళ్లవలసి వచ్చింది. కొంతదూరం వెళ్ల గానే ఒక గాజులశెట్టి ఎదురై భద్ర య్యను ఆపి ఎవరో ఒక ముత్తైదువ తెల్ల చీర కట్టి, పెద్ద బొట్టు పెట్టి గుత్తి కొండ బిలం వద్ద రెండు చేతుల నిండా గాజులు వేయించుకొని డబ్బు అడిగితే వెనుక మా అన్నయ్య గుర్రం మీద వస్తున్నాడని చెప్పింది, మీ చెల్లెలు గాజులు వేయించుకుందని చెబితే డబ్బులు ఇస్తాడని తెలిపింది. ఈ వి షయం విన్న భద్రయ్య ఆశ్చర్యపో యాడు. ఇది అంకాళమ్మ పనే అనుకు న్నాడు. తనకు న్యాయం చేయటానికి తనకంటే ముందు నడుస్తోందని, ఇక తనకే భయం లేదని చెప్పి శిష్యులను వెనక్కి పంపి, బయలుదేరాడు. కోర్టులో న్యాయాధిపతి వాదప్రతివాద నలు పరిశీలించిన తర్వాత తీర్పు రాసిన ప్రతిని చదివి వినిపించాలని సిద్ధమయ్యారు. విచిత్రం ఆయనకు కళ్లు సరిగా కనిపించలేదు. కళ్లముందు ఎవరో ముత్తైదవు కదలాడసాగింది. తీర్పు చదవాలని మరలా ప్రయత్నిం చగా, పెద్ద కుంకుమ బొట్టుతో కనిపించ సాగింది అమ్మవారు. ఇదేదో దైవ మహి మని మనసులోనే నమస్కారం చేసు కొని తాను సరైన తీర్పు ఇచ్చేలా అను గ్రహించాలని వేడు కున్నాడట. తీరా అమ్మవారిని మన సులో తలచుకోగా న్యాయాధిపతి కళ్లు కనిపించాయి. తీర్పు ప్రతిలో భద్రయ్య నిర్దోషిత్వాన్ని నిరూపిస్తూ రాసిన విషయం బహిరంగంగా చదివి, ఆయన్ని సగౌరవంగా సత్కరించి పంపారట. భద్రయ్య కారంపూడి రాగానే విషయం తెలుసుకున్న శిష్య, ప్రశిష్యులు, ప్రజలందరూ గానంగా అంకాళమ్మ అమ్మవారికి నివేదనలు సలిపి సంబరాలు చేసుకున్నారు.



పల్నాటి వీరుల దేవాలయం

## పల్నాటి వీర్ల దేవాలయం

12వ శతాబ్దంలో నాగులేటి తీరాన జరిగిన పల్నాటి యుద్ధానికి ప్రతీకగా నేటికి మిగిలిన చిహ్నాలు చారి త్రక ఆధారాలుగా వున్నాయి. యుద్ధంలో మృతిచెందిన 66గురు వీర నాయకులకు ప్రతి ఏడాది పిండ ప్రదానం చేసే కార్యక్రమానికి బ్రహ్మా నాయుడు ఆనాడే శ్రీకారం చుట్టారు. వీరా చార పీఠం ఏర్పాటు చేసి, దానికి పిడుగు వంశం వారిని పీఠాధిప తులుగా నియమించి నాగులేటిలోని గంగాధ రమడుగు నుంచి గుత్తి కొండ బిలానికి తప స్సుకు వెళ్లినట్లు చరిత్ర తెలుపుతోంది. ఔరంగ జేబు కాలంలో జాఫర్, ఫరీద్ అనే సైనికులు యుద్ధంలో మృతి చెందిన వీరులకు నాగులేటి ఒడ్డున ఆలయం నిర్మించి, వారు సైతం అక్కడే జీవ సమాధి అయ్యారు. అప్పటినుంచి ప్రతి కార్తీక అమావాస్య నుంచి 5రో జులపాటు వీరారాధన ఉత్సవాలు నిర్వహిస్తుంటారు. ఆ వీరాచారం నేటికి కొనసాగుతోంది. ఇలా వీరులకు ఆరాధనోత్సవాలు జరపటం ప్రపం చంలో గ్రీకు దేశం తర్వాత భారతదేశం లోని కారంపూడిలో మాత్రమే జర గటం విశేషం.



షిరిడిసాయి, వీరాంజనేయ ఆలయం

## చెన్నకేశవాలయం

బ్రహ్మనాయుడు నిర్మించిన చెన్నకే శవ దేవాలయం కారంపూడిలో నేటికీ నిత్యపూజలు అందు కుంటోంది. నాగులేటిలోని గంగధార మడుగులో స్నాన మాచరించిన బ్రహ్మనా యుడు నేరుగా చెన్నకేశవ ఆలయానికి చేరుకొని పూజలు చేస్తారనే ప్రతీతి వుంది. బ్రహ్మనాయుడు నామాలు పెట్టుకోవటానికి నిర్మించిన మేడ ఇప్పటికి ప్రత్యక్ష సాక్షంగా నిలిచింది. బ్రహ్మనాయుడు ఆయుధ మైన నృసింహకుంతం నేటికీ ఈ ఆలయంలోనే పూజలందు కుంటోంది. 12వ శతాబ్దం తర్వాత 2004లో చెన్నకేశవ దేవాలయాన్ని దేవాలయ శాఖ జీర్ణోద్ధరణ గావిం చారు. రాష్ట్రంలోని 15 జిల్లాల వీరాచార వంతులు వచ్చి ఇక్కడ మొక్కుబడులు చెల్లించుకుంటారు. ఇదిగాక గ్రామానికి 5 కిలోమీటర్ల దూరంలో నాయకురాలు నాగ మ్మ నిర్మించిన మంత్రాలమ్మ కనుమ దేవా లయం వుంది. కృష్ణా కుడి కాలువ పక్కనే వింట్ల మీద ఆంజనేయ స్వామి దేవా లయం చారి త్రక ప్రసిద్ధిగాం చింది. రెండు కోట్లతో నిర్మిం చిన వాసవి కన్యకాపరమే శ్వరి దేవా లయం, ఆర్యవైశ్య వీధిలో ఇటీవల కాలంలో నిర్మించిన షిరిడి సాయి దేవా లయం ఆధ్యాత్మిక చింతకు దోహదపడుతు న్నాయి.



చెన్నకేశవస్వామి ఆలయం



అంకాళమ్మ అమ్మవారి దేవాలయం

# శిల్ప కళకు వేదిక దుర్గి



శంకుచక్రదారి శ్రీ వెంకటేశ్వరస్వామి

(కర్పూరపు శ్రీనివాసరావు, దుర్గి)

జిల్లాలో దుర్గి పేరు వినగానే మదిలో శిల్ప కళ తళుక్కున మెరుస్తుంది. ఇక్కడ ఈ కళ నిత్యనూతనంగా వికసించి పరిమళిస్తూ విశేషంగా ఆకర్షిస్తోంది. దుర్గిలో ప్రభవిస్తున్న శిల్ప కళాఖండాలు ఖండాంతర ఖ్యాతిని ఆర్జిస్తున్నాయి. ప్రతి ఏటా ఎందరో దేశ విదేశీయ పర్యాటకులు ఇక్కడి శిల్ప సోయగాలను తిలకించి పులకరించిపోతుంటారు. దుర్గిలో ప్రభుత్వ ఆధ్వర్యంలో నడుస్తున్న నాగార్జునశిల్పకళ శిక్షణ కేంద్రంతో పాటు శ్రీ వెంకటేశ్వర శిల్ప కళాశాల, శ్రీ వేణుగోపాలస్వామి శిల్పకళాశాల, దుర్గాదేవి శిల్ప కళాశాలలు వున్నాయి. ఈ శిల్పశాలల నుండి నిరంతరం శిల్ప వృష్టి కురుస్తూ విశ్వవ్యాప్తంగా ఎగుమతై స్వదేశ శిల్పకళకు గొప్ప ప్రాచుర్యాన్ని సంపాదించిపెడుతున్నాయి. అంగులం నుండి ఆరు అడుగులు ఎత్తు కలిగిన సైజుతో పలు భంగిమలలో శిల్పాలను చెక్కటం నందు దుర్గి శిల్పులు సిద్ధహస్తులు. దుర్గి శిల్ప కళాశాలల్లో ప్రాణం పోసుకుంటున్న రాతి విగ్రహాలలో దేవతామూర్తులే కాక పల్లె పడుచు, శిశువుకు పాలు ఇస్తున్న మాతృమూర్తి, దర్పణ సుందరి, వయ్యారాలు ఒలికించే సుందరాంగుల విగ్రహాలు ప్రధానంగా వుంటాయి. వన్నె తగ్గని శిల్ప కళలో కొత్త క్రాంతిని ప్రవహింపజేయటానికి ఇక్కడ శిల్పులు కృషి సల్పుతూ రాళ్ళలో అపురూప కళాఖండాల అన్వేషణకే కారు చీకట్లో కాంతిపుంజాల్లా దూసుకుపోతున్నారు.

## దుర్గి శిల్ప కళా చరిత్ర బహు ప్రాచీనం

క్రీస్తుశకం 12వ శతాబ్దంలోనే దుర్గిలో శిల్పకళకు బీజం పడింది. తొలుత కొంతమంది శిల్పులు పెందోట



మృదుమధురం ఈ బుద్ధుని రూపం

నుండి ద్వారకాపురి పట్టణానికి వలస వచ్చి ఇక్కడే స్థిరపడి జీవనం సాగిస్తుండేవారు. మహాయాన బౌద్ధమతాన్ని రూపొందించిన ఆచార్య నాగార్జునుడు పెందోట నివాసి అని కొందరి భావన. 12వ శతాబ్దంలోనే ప్రకృతి వైపరీత్యమో లేక శత్రురాజుల దాడుల ఫలితమో ద్వారకాపురి పట్టణం పూర్తిగా విధ్వంసం అయింది. ఆ సంఘటనలో ప్రాణాలతో మిగిలిన ద్వారకాపురి ప్రజలు కొందరు దారివేముల అనే ప్రాంతానికి తరలివచ్చి ఆ గ్రామాన్ని నిర్మించుకున్నారు. ద్వారకాపురికి చెందిన మరికొందరు బ్రతికి బయటపడ్డ కొద్దిమంది శిల్పులతో నేటి దుర్గి ప్రాంతానికి వచ్చి స్థిర పడ్డారు. వారు ఈ ప్రాంతానికి వచ్చిన వెంటనే శత్రు క్షయం కోరుతూ దుర్గాదేవి విగ్రహాన్ని ప్రతిష్టాపన చేసి తాము నివశిస్తున్న ప్రదేశానికి దుర్గాదేవి పేరిట 'దుర్గి' అను నామకరణం చేయటం జరిగింది. ఇదంతా యదార్థం అని చెప్పటానికి నిదర్శనంగా దుర్గిలో నేటికీ ప్రాచీన దుర్గాదేవి ఆలయం వుండడం గమనార్హం. దుర్గిలో 15వ శతాబ్దం నాటికి శిల్ప కుటుంబాల సంఖ్య 300 చేరినట్లు కొందరి అభిప్రాయం. ఇక్కడ కాకతీయుల కాలం నందు క్రీ.శ. 1127లో నాగేశ్వర, ఓంకారేశ్వర ఆలయాలు, క్రీ.శ.1160లో వేణుగోపాల స్వామి ఆలయం, క్రీ.శ.1140లో వీరభద్ర ఆలయం, స్థానిక శిల్పులచే నిర్మించినట్లు ఆయా శిలాశాసనాలు స్పష్టం చేస్తున్నాయి. మాచర్లలోని ప్రాచీన చెన్నకేశవ, వీరభద్రాలయాలు, అమరావతి, నాగార్జునకొండలో నిర్మించిన బౌద్ధ స్థూపాల నిర్మాణం వెనుక దుర్గి శిల్పుల పాత్ర వున్నట్లు కూడా పలువురు విశ్వసిస్తున్నారు. కాలక్రమంలో శిల్ప కళాపోషకులు కరువై అన్నిచోట్ల క్షీణదశకు చేరింది. రాజులు, రాజ్యాలు అంతరించడంతో శిల్ప కళకు ఈ దుస్థితి దాపురించింది. దీంతో కమనీయ శిల్పాలను మలిచే శిల్పుల బతుకుల్లో చిమ్మ చీకట్లు కమ్ముకున్నాయి. అహర్నిశలు బండల మాటున గుండెలు మోగించి మనోజ్ఞ శిల్ప కళాఖండాలను సృజించినా పూట గడవడం కష్టంగా మారింది. ఈ నేపథ్యంలో ఎందరో శిల్ప కళాకారులు శిల్ప వృత్తికి స్వస్తి చెప్పి ఇతర వృత్తులను ఆశ్రయించారు. మిగిలిన కొద్ది మంది శిల్పులు మాత్రం వంశపారంపర్యంగా పుణికిపుచ్చుకున్న శిల్ప కళను త్యజించలేక శిలలకు ప్రాణం పోసి జీవనయాత్ర సాగిస్తున్నారు. దుర్గి శిల్పులు కూడా ఇదే బాటలో ప్రయాణిస్తూ శిల్ప కళాసేవకే తమ జీవితాలను అంకితం చేస్తున్నారు.

## శిల్ప కళాభివృద్ధికి ప్రభుత్వ తోడ్పాటు

గాలిలో దీపంలో కొట్టుమిట్టాడుతూ ఆరిపోయే దశకు చేరుతున్న శిల్ప కళను రక్షించి శిల్పులలో దాగి వున్న సృజనాత్మక శక్తిని వెలికితీసే సంకల్పంతో రాష్ట్ర ప్రభుత్వం 1962లో దుర్గిలో శిల్ప కళా శిక్షణా కేంద్రాన్ని నెలకొల్పింది. పరిశ్రమల శాఖ ఆధ్వర్యంలో ఏర్పాటైన ఈ శిక్షణా కేంద్రంలో మొదటి రెండేళ్ళలో ఆరుగురు మాత్రమే శిల్పకళల శిక్షణ పొందారు. ఆ తరువాత వందల సంఖ్యలో ఈ శిక్షణా కేంద్రం నందు శిక్షణ పొంది నైపుణ్యం సాధించారు. వీరిలో ఎంతో మంది ఇతర జిల్లాల్లో శిల్ప కళా క్షేత్రా



నల్లనయ్య రూపు ఎర్రని శిల పై...

లను నెలకొల్పి శిల్ప కళాభివృద్ధికి తోడ్పడుతున్నారు. శిల్పుల మేధస్సుకు మరింత పదును పెట్టి, శిల్ప తయారీలో అవసరమైన సూచనలు, సలహాలు ఇవ్వడానికి నాగార్జున స్టోన్ క్వారింగ్ వర్కర్స్ కో-ఆపరేటివ్ ఇండస్ట్రియల్ సొసైటీ ఆవిర్భవించి కృషి సల్పుతోంది. 1963లో రాష్ట్ర హస్తకళల అభివృద్ధి సంస్థ ఇక్కడ శిల్ప కళాకా

(మిగతా 81వ పేజీలో)

# శిల్ప కళకు వేదిక దుర్గి

(80వ పేజీ తరువాయి)

రుల సాముదాయక సదుపాయ కేంద్రాన్ని నిర్మించి శిల్పులకు బాసటగా నిలిచింది. శిల్ప కళాశిక్షణా కేంద్రంలో శిక్షణ పొందుతున్న విద్యార్థులకు ఇచ్చే 30 రూపాయల స్టైఫండ్‌ను 100 రూపాయలకు పెంచి శిల్ప కళ అభ్యాసకులను ప్రోత్సహించింది. గత జూలై 27 నుండి ఆగస్ట్ 15 వరకు ఇక్కడి శిల్పులకు వృత్తి నైపుణ్యత సాధించడానికి రీజనల్ డిజైన్ అండ్ టెక్నికల్ డెవలప్‌మెంట్ సెంటర్(బెంగుళూరు) ఆధ్వర్యాన వర్క్‌షాప్ నిర్వహించారు. ప్రస్తుతం సాంప్రదాయ పద్ధతిలో తయారుచేసే శిల్ప వస్తువులకు గిరాకి లేదని, అందువల్ల శిల్పులకు నూతన డిజైన్‌లు నేర్పించడానికి ప్రభుత్వం ఈ వర్క్‌షాప్‌ను ఏర్పాటుచేసి 15 మంది శిల్పులకు శిక్షణా కార్యక్రమం నిర్వహించింది.

**దుర్గి శిల్పులకు సముచిత సత్కారం**

1984లో హైదరాబాద్‌లో వినాయక చవితి ఉత్సవాల సందర్భంగా నిర్వహించిన 'విఘ్నేశ్వర విగ్రహప్రదర్శన'లో దుర్గి విగ్రహాల అందచందాలను తిలకించిన ఆనాటి రాష్ట్ర ముఖ్యమంత్రి ఎన్‌టి రామారావు మంత్రముగ్ధులై దుర్గి శిల్పుల శిల్ప కళా నైపుణ్యాన్ని ప్రశంసిస్తూ ఘనంగా సన్మానించారు. అంతటితో ఆగక ఆ తరువాత కొద్దికాలానికే ఆయన తన సతీమణి లక్ష్మీపార్వతితో వచ్చి దుర్గి శిల్ప కళా కేంద్రాలను స్వయంగా సందర్శించి ఆనందించారు.

మాజీ ముఖ్యమంత్రి టి.అంజయ్య కూడా దుర్గి శిల్పుల శిల్ప కళా సేవకు గుర్తుగా శిల్ప కళాకేంద్రం ప్రధానాచార్యులు ఈశ్వర భిక్షమాచారిని సముచిత రీతిన సన్మానించి సత్కరించారు. 1996లో 'స్టోనా 96' పేరిట బెంగుళూరులో నిర్వహించిన ప్రపంచ శిల్ప విగ్రహ ప్రదర్శనలో పాల్గొనేనిమిత్తం కేంద్ర ప్రభుత్వం దుర్గి శిల్ప కళా కేంద్రానికి ఆహ్వానం పంప డం ఈ శిల్ప కళా కేంద్రం గొప్పతనానికి నిదర్శనం.

## స్వర్ణదేవాలయంగా మారనున్న
# చిన్నికృష్ణుని దేవాలయం

(ఆన్‌లైన్, యడ్లపాడు)

భారతదేశంలో ఎక్కడా లేని విగ్రహం ఇది. శ్రీకృష్ణదేవరాయల హయాంలో చిన్ని కృష్ణుని విగ్రహం ప్రతిష్టించి ఆ తరువాత గోల్కొండ నవాబుల పాలనలో సంబంధిత విగ్రహం ధ్వంసం కాకుండా బావిలో భూస్థాపితం చేశారు. ఆ తరు వాత చిలకలూరిపేట జమిందార్ విగ్రహాన్ని వెలికితీసి ఆలయ నిర్మాణం చేసి చిన్ని కృష్ణుని విగ్రహాన్ని పునః ప్రతిష్టించారు. ఈ దేవాలయానికి నిత్యం పూజలు జరి పించుకోవడానికి వందలఎకరాల భూములను ఆజమిందారు విరాళంగా ఇచ్చారు.

మండల పరిధిలోని చెంఘీజ్‌ఖాన్‌పేట గ్రామంలో ఉన్న వెన్నముద్దల వేణుగోపాలస్వామి దేవాలయం శ్రీకృష్ణ దేవరాయుల పరిపాలనలో కోట గ్రామంలో ఉండేది. కొండవీడు సామ్రాజ్యాన్ని జయించిన పిదప శ్రీకృష్ణ దేవరా యలు తన విజయానికి చిహ్నంగా విజయ స్థూపాన్ని, గోపీనాథస్వామి దేవాల యాన్ని నిర్మాణం చేశారు. విజయనగరుల శిల్ప నైపుణ్యంతో బాలమురళి కృష్ణ స్వామిని దేవాలయంలో ప్రతిష్టించారు. విజయనగర సామ్రాజ్యం బలహీనప డినప్పుడు కొండవీటి రెడ్డి రాజులు స్వతంత్రులై ఈ ఆలయంలో పెద్ద ఎత్తున పూజలు నిర్వహించారు. తరువాత కాలంలో కొండవీటి దుర్గమ్మను గోల్కొండ నవాబులు ముట్టడించినప్పుడు రెడ్డి రాజులు పరాజయం చెందుతున్నారని గ్రహించిన కొంతమంది కృష్ణుడి విగ్రహం కాకుండా బావిలో భూస్థాపితం చేశారు. తరువాత కాలంలో బ్రిటిష్ పాలనలో కొండవీడు ప్రాంతం మొత్తం చిల కలూరిపేట జమిందార్ అధీనంలోకి వచ్చింది. తరువాత గోపినాథ దేవాలయ ప్రాంతంలో గృహ నిర్మాణాలకు కొందరు భూమిని తవ్వుచుండగా ఈ విగ్రహా లు బయటపడ్డాయి. విషయం తెలుసుకున్న చిలకలూరిపేట జమిందార్ విగ్రహాలను చిలకలూరిపేటలోని తన కోటవద్ద ప్రతిష్టింపచేయడానికి బండిమీద తీసుకువస్తుండగా చెంఘిజ్‌ఖాన్‌పేట గ్రామం వద్దకు వచ్చేసరికి బండి ఇరుసు విరగడంతో బండిని బాగుచేస్తూ అక్కడే ఉన్నారు. చిన్ని కృష్ణుడు జమిందార్ కలలోకి వచ్చి ఇక్కడే ఈ విగ్రహాన్ని ప్రతిష్టించాలని చెప్పడంతో జమిందార్ రాజా మానూరు వెంకటకృష్ణారాయణం చెంఘిజ్‌ఖాన్‌పేటలో దేవాలయం నిర్మించి చిన్ని కృష్ణుడి విగ్రహాన్ని ప్రతిష్టించారు.జమిందార్‌లు మాధ్య సంప్రదాయానికి చెందినవారు అయినందున ఈ దేవాలయంలో ఆంజనేయస్వామి విగ్రహాన్ని కూడా ప్రతిష్టించారు. ఈ దేవాలయం నేడు పూర్తిగా శిథిలావస్థలో ఉన్నది. భారత దేశంలోనే వెన్నముద్దల వేణుగో పాలస్వామి విగ్రహం ఎక్కడా లేదు. ఒకనాడు ఎంతో వైభవంగా పూజలు అందుకున్న ఈ దేవాలయం నేడు నా టి వైభవాలు లేక దీనావస్థలో ఉన్నది. ఇటువంటి దేవాలయాన్ని అభివృద్ధి చేయడానికి ఇస్కాన్ సంస్థ ముందకు వచ్చింది. 150 కోట్ల రూపాయల వ్యయంతో ఈ దేవాలయం స్థానంలో స్వర్ణ దేవాలయాన్ని నిర్మించనున్నది. అందుకు ప్రభుత్వం కూడా 55 ఎక రాల దేవాదాయశాఖ భూములు ఇస్కాన్ సంస్థకు కేటాయించింది.



చిన్ని కృష్ణుని బ్రహ్మదర్శనం



అలంకరణలో చిన్ని కృష్ణుడు




# ఆధ్యాత్మిక కేంద్రం శ్రీ శారదా పీఠం

(ఆన్‌లైన్‌-గుంటూరు) సువిశాల ప్రాంగణం, ఎటు చూసినా దేవాలయాలు, యజ్ఞశాలలు, ప్రవచన మందిరం, వేద స్మార్త పాఠశాల, గోశాల, తులసీవనం, వివిధ రకాలైన పుష్పాల గుబాళింపులు, మారేడు, మామిడి, కొబ్బరి వృక్షాలతో అడుగు పెట్టగానే ఆధ్యాత్మిక భావం కలిగిస్తున్న ప్రాంతం గుంటూరు సంపత్‌నగర్‌లోని శ్రీ జగద్గురు శంకరాచార్య మహాసంస్థానం దక్షిణామ్నాయ శ్రీ శారదా పీఠం, శృంగేరి గుంటూరుశాఖ.

తెల్లవారు జామునుంచే అభిషేకాలు, అరన్చనలు, వేద విద్యార్థుల వేద ఘోష, మంగళవాద్యాల ధ్వనులు, అధ్యాత్మిక ప్రవచనాలు, పురాణ పఠనంతో ఆ ప్రాంతమంతా ఆధ్యాత్మిక కేంద్రంగా భాసిల్లుతూ ప్రజలలో ఆధ్యాత్మిక చైతన్యాన్ని పరిఢిల్ల చేస్తుంది. ఎందరో పీఠాధిపతులు, మఠాధిపతులు, స్వామీజీలు, మాతాజీల పాదస్పర్శచే ఆ ప్రాంగణం పవిత్ర ప్రదేశంగా విరాజిల్లుతోంది. స్వామీజీల ఆధ్యాత్మిక ప్రసంగాలు, పండితులచే ప్రవచనాలు, పురాణ పఠనంతో పవిత్రతను సంతరించుకుంది. ఆధ్యాత్మిక కార్యక్రమాలే కాకుండా సంస్కృతీసంప్రదాయాలను పరిరక్షించే విధంగా పర్వదినాల సందర్భంగా కచేరీలు, నృత్య ప్రదర్శనలు, కోలాటాలు, భజనలు, అవధానాలు నిర్వహిస్తుంటారు.

ఐదు దశాబ్దాలుగా గుంటూరు నగరంలో ఆధ్యాత్మిక సుగంధాలను వెదజల్లుతూ ఎందరో భక్తులను ఆకర్షిస్తూ పుణ్యక్షేత్రంగా శారదా పీఠం విరాజిల్లుతోంది. ఆలయ ధర్మాధికారి పోలిశెట్టి శ్రీహరి ప్రసాదరావు సారధ్యంలో జగద్గురు శంకరాచార్య దక్షిమ్నాయ శ్రీ శారదా పీఠాధీశ్వరులు శ్రీ భారతీ తీర్ధ మహాస్వాముల పరిపూర్ణ అనుగ్రహ ఆశీస్సులతో ఆధ్యాత్మిక, సాంస్కృతిక కార్యక్రమాలేగాక సామాజిక, సేవా కార్యక్రమాలు నిరంతరం నిర్వహిస్తున్నారు.

## ప్రాంగణంలోని ఆలయాలు

★ శ్రీ గంగాపార్వతి సమేత రామలింగేశ్వరస్వామి ఆలయంలోని ఉభయ దేవేరి సమేతుడైన స్వామి విగ్రహాలను గాయత్రీ పీఠాధిపతి శ్రీ విద్యాశంకర భారతీ తీర్థస్వామి 1960లో వారి పవిత్ర హస్తములతో ఆవిష్కరించారు.

★ ఆదిశంకర దేవాలయంలో 1961లో శ్రీ అభినవీ విద్యాతీర్ధ మహాస్వామీజీ తమ సువర్ణ హస్తాలతో స్వామి విగ్రహ ప్రతిష్ఠ గావించారు.

★ 1966లో శ్రీ శారదా పరమేశ్వరీ దేవాలయంలో అమ్మవారి విగ్రహాన్ని శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామి ఆవిష్కరించారు.

★ 1969లో శ్రీ ప్రసన్నాంజనేయ స్వామి దేవాయలంలో కంచి పరమాచార్య శ్రీ జయేద్ర సరస్వతి స్వామి, నవగ్రహ దేవాలయంలో నవగ్రహాలను ఆచార్య శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వామి విగ్రహాలను ఆవిష్కరించారు.

★ 1974లో శ్రీ అభయ కోదండ రామస్వామి దేవాలయంలో పుష్పగిరి పీఠాధిపతులు అభినోద్దవ విద్యానృసింహభారతిస్వామి కరకమలములతో స్వామి విగ్రహాన్ని ప్రతిష్ఠింపజేశారు.

★ గణపతి, సుబ్రహ్మణ్యేశ్వర దేవాలయం, నాగేంద్రస్వామి పుట్ట, ప్రవచన మందిరం, యజ్ఞశాల, రామకోటి స్థూపం ప్రాంగణంలో ఉన్నాయి.

వార్షిక బ్రహ్మోత్సవాలతో పాటు శరన్నవరాత్రి ఉత్సవాలు, వినాయక చవితి, శ్రీరామనవమి, హనుమజ్జయంతి, మహాశివరాత్రి, నాగుల చవితి, సుబ్రహ్మణ్య షష్టి పర్వ దినాలలో ప్రత్యేక కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. ప్రతి శుక్రవారం సుహాసినులచే లలితా సహస్ర నామకుంకుమార్చనలు జరుగుతున్నాయి.

## సామాజిక కార్యక్రమాలు

శ్రీ శారదా పీఠం కేవలం ఆధ్యాత్మిక కార్యక్రమాలకే పరిమితం కాకుండా సమాజ సంక్షేమానికి కూడా గణనీయమైన సేవలందిస్తోంది. విద్య, వైద్య రంగాలలో సేవలు చేస్తోంది. విద్యార్థులకు ఉచిత వసతి, భోజన సదుపాయాలతో వేద విద్యను అభ్యసించడానికి శ్రీ భారతీతీర్థ స్మార్త పాఠశాలను స్థాపించింది. మురికివాడల్లో ఉన్న అట్టడుగు వర్గాలకు ఉచిత వైద్యాన్ని అందించే శ్రీ శారదా సంజీవిని సుశృత సంచార వైద్యశాల సదుపాయం కల్పిస్తోంది. వివిధ ప్రాంతాలలో అత్యవసర వైద్యసేవలు అందించడానికి ప్రత్యేకంగా శ్రీ విద్యాభారతి ధన్వంతరి వైద్యశాల (అంబులెన్స్), దళిత వాడల్లో పేద ప్రజలకు దాహార్తిని తీర్చడానికి శ్రీ శారదా పరమేశ్వరి జలధార పథకం (వాటర్ ట్యాంకు) ద్వారా మంచినీటి అందిస్తోంది. ప్రతిభగల పేద విద్యార్థులకు శ్రీ శారదా విద్యాధన పథకం ద్వారా ఉపకార వేతనాలను అందజేస్తున్నారు. దానాల్లో అన్నదానం మిన్న అని శ్రీ శారదా నిత్యాన్నదాన

వేదాలు నేర్చుకుంటున్న విద్యార్థులు



# పెదకూరపాడు ప్రజల ఆదరణ

(ఆన్‌లైన్, పెదకూరపాడు)

పెదకూరపాడు నియోజకవర్గానికి ఒకే అభ్యర్థిని నాలుగుసార్లు శాసనసభ్యునిగా ఎన్నుకున్న చరిత్ర నియోజకవర్గ ప్రజలకు ఉంది. అమరావతి మండలంలోని మునగోడు గ్రామానికి చెందిన గణపా రామస్వామిరెడ్డి పార్టీ సిద్ధాంతాలతో సంబంధం లేకుండా ఏ పార్టీ నీడన ఉన్నా తనదైన పంథాలో నాలుగుసార్లు శాసనసభకు ఎన్నికై విశిష్ట స్థానం సంపాదించారు. మంగళగిరి నియోజకవర్గంలో నుంచి పెదకూరపాడు నియోజకవర్గాన్ని పునర్వ్యవస్థీ కరించినప్పటి నుంచి గణపా రామస్వామిరెడ్డి 1955లో ఆచార్య ఎన్‌జి రంగా స్థాపించిన కృషికార్ లోక్ పార్టీ అభ్యర్థిగా పెదకూరపాడుకు చెందిన దర్శి లక్ష్మయ్యపై గెలుపొంది, నియోజకవర్గంలో మొదటి శాసనసభ్యునిగా నిలిచారు. 1962, 1967లో సీపీఐ అభ్యర్థి క్రోసూరు మండలం, ఊటుకూరుకు చెందిన పుతుంబాక వెంకటపతిపై కాంగ్రెస్‌పార్టీ అభ్యర్థిగా పోటీచేసిన గణపా రామస్వామిరెడ్డి రెండవసారి, మూడవసారి విజయం సాధించారు. 1978లో జనతాపార్టీ అభ్యర్థిగా పోటీచేసిన రామస్వామిరెడ్డి కాంగ్రెస్‌పార్టీ అభ్యర్థిగా పోటీచేసిన పెదకూరపాడుకు చెందిన సయ్యద్ మహబూబ్‌పై గెలుపొంది నాలవసారి విజయం సాధించారు. 1972లో

## గనఫా, కన్నాలను నాలుగుసార్లు శాసనసభ్యులుగా...

కాంగ్రెస్‌పార్టీ అభ్యర్థిగా పోటీచేసిన గుంటూరుకు చెందిన షేక్ ఫాతిమున్నిసా బేగంపై, రాజుపాలెం



కన్నా లక్ష్మీనారాయణ

మండలం, ఉప్పలపాడుకు చెందిన అల్లంశెట్టి విశ్వేశ్వరరావులపై కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీచేసి ఓడిపోయారు. గణపా రామస్వామిరెడ్డిని పార్టీలకు అతీతంగా వ్యక్తిత్వానికి విలువ ఇచ్చి ఆయనను నియోజకవర్గ ప్రజలు గెలిపించారు.

రామస్వామిరెడ్డి శాసనసభ్యునిగా గెలుపొందినా నివాసం గుంటూరులో ఉండేవారు. పెదకూరపాడు నియోజకవర్గ సమస్యల మీద దృష్టి సారించి నియోజకవర్గ అభివృద్ధికి తనవంతు కృషి చేశారు.

గుంటూరుకు చెందిన కన్నా లక్ష్మీనారాయణ 1989లో పెదకూరపాడు నుంచి పోటీచేసి గుంటూరుకు చెందిన తెలుగుదేశం అభ్యర్థి డాక్టర్ కాసరనేని సదాశివరావుపై విజయం సాధించి మారిన ముగ్గురు ముఖ్యమంత్రుల వద్ద క్రీడలు, సహకార, కార్మిక, ఉపాధిశాఖ మంత్రిగా పదువులు నిర్వహించారు.

1994, 1999లలో జరిగిన ఎన్నికలలో కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీచేసిన లక్ష్మీనారాయణ బెల్లంకొండ మండలం, నాగిరెడ్డిపాలెం గ్రామానికి చెందిన వెన్నా సాంబశివారెడ్డిపై విజయం సాధించారు.

2004లో జరిగిన ఎన్నికలలో తెలుగుదేశం పార్టీ అభ్యర్థి దొప్పలపూడి రేవతిపై కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీచేసిన కన్నా లక్ష్మీనారాయణ విజయం సాధించారు. పోటీచేసిన నాలుగుసార్లు కన్నాను నియోజకవర్గ ఓటర్లు ఆదరించారు.

రాష్ట్ర జిల్లా రాజకీయాలలో కన్నా తనకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని ఏర్పరచుకొని రాష్ట్రంలోనే అతి పెద్ద నియోజకవర్గంగా ఉన్న పెదకూరపాడును కాంగ్రెస్‌కు కంచుకోటగా మార్చారు. నివాసం గుంటూరులో ఉన్నప్పటికి నియోజకవర్గ అభివృద్ధికి కన్నా చేసిన సేవలు మరువలేనివి.

పెదకూరపాడు నుంచి శాసనసభ్యునిగా ఆరుసార్లు పోటీచేసిన గణపా రామస్వామిరెడ్డి, నాలుగుసార్లు పోటీచేసిన కన్నా లక్ష్మీనారాయణలను నాలుగుసార్లు ఆదరించిన ఘనత పెదకూరపాడు ప్రజలకు ఉంది.

## రాష్ట్ర ఆర్థికాభివృద్ధికి తోడ్పడుతున్న మినీ హైడల్ విద్యుత్ ప్రాజెక్టులు

(ఆన్‌లైన్, ముప్పాళ్ళ)

విద్యుత్ కొరతతో అవస్థలు ఎదుర్కొంటున్న సమయంలో నాగార్జున సాగర్ కుడికాల్వపై మినీహైడల్ విద్యుత్ ప్రాజెక్టులకు ప్రభుత్వం గ్రీన్ సిగ్నల్ ఇచ్చింది. దీంతో 216 కిలోమీటర్ల మేర విస్తరించిన కాల్వపై 24 మినీ హైడల్ విద్యుత్ ప్రాజెక్టుల నిర్మాణం జరిగింది. రోజుకి 150మెగావాట్ల విద్యుత్ ఉత్పత్తి చేస్తూ సుమారు 500మంధికి ఉపాధిని కల్పిస్తున్నారు. నాగార్జునసాగర్ నుంచి పంటలకు వినియోగించే నీటిని కాల్వలకు 5 అడుగుల నుంచి 10 అడుగుల ఎత్తులో డ్రాప్స్ ఏర్పాటుచేసి, వచ్చే నీటి ఉధృతికి టర్బైన్లు ఏర్పాటుచేసి విద్యుత్‌ను ఉత్పత్తి చేస్తారు. ఈ నీటిని తిరిగి ప్రధాన కాల్వలో చేర్చేందుకు ఒక కాల్వను కూడా నిర్మించారు.

గుంటూరు బ్రాంచి కెనాల్‌పై ఐదు కంపెనీలకు చెందిన 11 ప్రాజెక్టులు ఉండగా, పెదనందిపాడు బ్రాంచి కాల్వపై టీఎంసీ పవర్ ప్రాజెక్టు లిమిటెడ్ ఉంది. వీటితో పాటు బెల్లంకొండ బ్రాంచి కాల్వపై ఎస్ఆర్ లిమిటెడ్ 2, జూలకల్లు బ్రాంచి కెనాల్‌పై శివాని పవర్‌స్పిన్నర్, చిలకలూరిపేట మేజర్‌పై అక్షయ్ ప్రొఫైల్స్ ప్రైవేట్ లిమిటెడ్ రెండు మినీ హైడల్ ప్రాజెక్టులను ఏర్పాటు చేశాయి. వీటితోపాటు అద్దంకి కాల్వపై శ్రీ ధనలక్ష్మి కాటన్ 3, ట్రైడెంట్ పవర్ సిస్టమ్ లిమిటెడ్ 2, శ్రీ జయలక్ష్మి పవర్ కార్పొరేషన్ లిమిటెడ్ 2 ప్రాజెక్టులను ఏర్పాటు చేసి విద్యుత్‌ను ఉత్పత్తి చేస్తున్నాయి. కాల్వలకు నీరు విడుదలయ్యే నాలుగు మాసాలలోనే ఈ ప్రాజెక్టుల నుంచి తక్కువ పెట్టుబడితో విద్యుత్ ఉత్పత్తి చేస్తూ రాష్ట్ర ఆర్థికాభివృద్ధికి తోడ్పాటునందిస్తున్నాయి. వీటిద్వారా వచ్చే విద్యుత్‌ను రాష్ట్ర పవర్‌గ్రిడ్‌కు సరఫరా చేస్తూ కోత సమస్యను తొలగించటంలో తమవంతు పాత్ర పోషిస్తూ రాష్ట్ర ఆర్థికాభివృద్ధికి వెన్నుదన్నుగా ఈ పవర్ ప్రాజెక్టులు నిలుస్తున్నాయి.

# వేద మంత్రోచ్ఛారణలతో మార్మోగుతున్న మాదిపాడు

(ఆన్‌లైన్, అచ్చంపేట) మండలంలోని మాదిపాడు వద్ద ఉన్న వేద వేదాంత గురుకుల మహా విద్యాలయంలో నాలుగువేదాలు అభ్యసిస్తూ నిత్యం వేద మంత్రోచ్చారణల మధ్య అటవీప్రాంతం మార్మోగుతోంది.

కర్ణాటకలోని శృంగేరి పీఠానికి అనుబంధ సంస్థగా ఈ వేద పాఠశాల పనిచేస్తోంది. ఈ ప్రాంతం నుంచి ఉత్తరంగా రెండున్నర కిలో మీటర్లు ప్రవహించే కృష్ణానదిని ఉత్తర వాహినిగా పిలుస్తారు. ఈ పుణ్యస్థలంలోని ఓ సువిశాలమైన ప్రదేశంలో వేద విశ్వవిద్యాలయం వెలిసింది. ఇక్కడ విద్యార్థులకు రుగ్వేదం, యజుర్వేదం, సామ, అదర్వణ వేదాలు బోధిస్తారు. ఈ పాఠశాలలో 13మంది వేదాచార్యులు, 73మంది విద్యార్థులు, ప్రిన్సిపాల్, వైస్ ప్రిన్సిపాల్, వ్యాకరణాచార్యుల కనుసన్నలలో విద్యార్థులు విద్యాబుద్ధులు నేర్చుకుంటారు. ఈ పాఠశాలకు మధ్యప్రదేశ్, ఒరిస్సా, మహారాష్ట్ర, ఢిల్లీ, కర్ణాటక తదితర ప్రాంతాల నుంచి విద్యార్థులు వస్తున్నారు.

ఎనిమిది నుంచి 12 సంవత్సరాలలోపు విద్యార్థులను మాత్రమే చేర్చుకుంటారు. మన రాష్ట్రానికి చెందిన రాజమండ్రి, తణుకుకు చెందిన ఇద్దరు విద్యార్థులు మాత్రమే వేదాలు నేర్చుకుంటున్నారు. ప్రతి వేదం పూర్తిగా నేర్చుకోవాలంటే 8 నుంచి 10 సంవత్సరాలు పడుతుందని వేదాచార్యులు తెలిపారు. ఉదయం 4 నుంచి రాత్రి 9.30 నిమిషాల వరకు వీరి అభ్యాసం సాగుతోంది.

**అగ్నికార్యం:** ఉదయం 6 గంటల నుంచి 6-45 వరకు సంధ్యా వందనం, మధ్యాహ్నం 12 గంటల నుంచి మధ్యాహ్న వందనం, సాయంత్రం 6 గంటల నుంచి సంధ్యావందనం చేస్తుంటారు.

**దేవతల ఆలయాలు:** దక్షిణామూర్తి, విద్యాగణపతి, శివలింగం, దత్తాత్రేయస్వామిలతో పాటు నలుగురు దేవతల కుటీరాలు వెలిశాయి. ప్రతినిత్యం పూజలు జరుగుతుంటాయి. శారదాంబ ఆలయం ఎదుట విద్యాబుద్ధులు నేర్పుతూ, సంప్రదాయాలను తెలియజేస్తుంటారు.

**కోనేరు:** విశాలమైన వేద పాఠశాల ప్రాంగణంలో చిన్న కోనేరును ఏర్పాటుచేశారు. వీటిలో బాతులు, పక్షుల కిలకిలా రావాలు, నెమళ్ళ అందాలు చూపరులను కట్టి పడవేస్తాయి.

**కుటీరాలు:** వాచా, రుషి కుటీరం, శంకరాచార్య కుటీరం, శుధర్మ మండపం కలవు.

**విద్యార్థుల దినచర్య:** వేద ఆవృత్తి, అగ్నికార్యం, రుద్రాభిషేకం, జలపానం, వేద అధ్యయనం, వ్యాకరణం, హోమం, విష్ణుశాస్త్ర పారాయణం, అష్టావదానం తదితర కార్యాలతో ప్రతిరోజు గడుస్తుంది.

## బ్రాహ్మణ విద్యార్థులకే స్థానం

పి హరిమోహన్ శర్మ
(ఇన్‌చార్జ్ ప్రిన్సిపాల్)

ఈ పాఠశాలలో బ్రాహ్మణ విద్యార్థులకే స్థానం ఉంది. వారికి ఉచితంగా భోజనం, వేదాధ్యయనం, వసతి ఉంది. ప్రతి విద్యార్థికి క్రమశిక్షణ ముఖ్యమని చెబుతుంటాం. ప్రతి నిత్యం బ్రాహ్మణ సంప్రదాయ, సంస్కారాలను గురించి వివరిస్తుంటాము.

ప్రతి బ్రాహ్మణుడు త్రికాల సంధ్య చేయాలి. ఇక్కడ చదివిన విద్యార్థులు కర్ణాటకలోని శృంగేరిలో పరీక్షలు రాయాల్సి ఉంది. శృంగేరి పీఠంవారు సర్టిఫికెట్లను అందిస్తారు. హెడ్ ఆఫీస్ తెనాలిలో ఉంది.

# పాడిపరిశ్రమతో నిరుద్యోగులకు ఉపాధి



ముప్పాళ్ళ మండలం మాదలలో మహేశ్వర పాలకేంద్రం

(ఆన్‌లైన్, ముప్పాళ్ళ)

గ్రామాలలో పాడిపరిశ్రమ ప్రధాన జీవనాధారంగా మారింది. అన్నదాతలు సైతం వ్యవసాయం కన్నా పాడిపరిశ్రమపై ఎక్కువశాతం దృష్టిసారిస్తున్నారు. రాష్ట్ర ప్రభుత్వం పశుక్రాంతి పథకం ద్వారా పాడిపరిశ్రమను ప్రోత్సహిస్తుండటంతో ఉన్నత వర్గాలకు చెందిన వారు కూడా పాడిపరిశ్రమపై మక్కువ చూపుతున్నారు. దీంతో పల్లెల్లో ఏర్పాటుచేసిన ప్రైవేట్ పాల డెయిరీలు అన్నదాతలకు వెన్నుదన్నుగా నిలుస్తున్నాయి. ప్రైవేట్ డెయిరీల పోటీతో పాల ఉత్పత్తులు గణనీయంగా పెరగడమేగాక, తలసరి ఆదాయం కూడా పెరిగింది.

గతంలో సంఘం డెయిరీ మాత్రమే పాలు సేకరించేది. దీనివల్ల ఒక వర్గం వారికి మాత్రమే లాభం చేకూరేది. కాలానుగుణంగా గ్రామంలో ప్రైవేట్ డెయిరీలు ఏర్పాటుకు ప్రభుత్వం ప్రోత్సాహకం అందివ్వటంతో గ్రామసీమలు పాడిపరిశ్రమపై శ్రద్ధ చూపిస్తున్నాయి. దీంతో అన్నివర్గాల వారికి వెసులుబాటు కలిగింది. మండల పరిధిలో ఉన్న మహేశ్వర, సుగుణ డెయిరీలు రోజుకు 10వేల లీటర్లకు పైగా పాలను వివిధ గ్రామాల నుంచి సేకరిస్తున్నాయి. ప్రైవేట్ డెయిరీల నిర్వాహకులు పాలసేకరణ పెంచుకునేందుకు గేదెల కొనుగోలుకు భారీగా రుణాలివ్వడమేగాక, బ్యాంక్‌లద్వారా కూడా అందిస్తూ అన్నదాతలను ప్రోత్సహిస్తున్నారు. వారానికి ఒకసారి పాలబిల్లులు నిర్వాహకులు చెల్లించడంవల్ల కుటుంబ ఖర్చులకు వెసులుబాటు కలుగుతుండటంతో పాడిగేదెల పెంపకాన్ని మహిళలే చేపడుతున్నారు. ఈ డెయిరీల ఏర్పాటుతో కొంతమేర నిరుద్యోగ సమస్య పరిష్కారమవుతోంది.

# ఎబర్డ్ కోర్సులతో యువతకు స్వయం ఉపాధి

(ఆన్‌లైన్ ఎడ్యుకేషన్, గుంటూరు)

గ్రామీణ ప్రాంత యువతీ, యువకులకు స్వయం ఉపాధి కోర్సుల్లో శిక్షణ ఇచ్చి వారి ఆర్థికాభివృద్ధికి ఆంధ్రాబ్యాంక్ గ్రామీణాభివృద్ధి సంస్థ (ఎబర్డ్) పాటుపడుతోంది. అయిదు సంవత్సరాల క్రితం గుంటూరులోని కొత్తపేటలో ఏర్పాటు చేసిన ఈ సంస్థలో ఇప్పటి వరకు దాదాపు పది వేల మంది వరకు శిక్షణ పొంది పలుచోట్ల స్వయం ఉపాధి ఏర్పాటు చేసుకున్నారు. చదివిన చదువుకు సరైన ఉద్యోగం దొరక్క నిరాశ, నిస్పృహలతో ఉన్న నిరుద్యోగ యువతకు స్వయం ఉపాధి అందించి, వారు జీవితాల్లో స్థిరపడేందుకు ఆంధ్రాబ్యాంక్ గ్రామీణాభివృద్ధి ట్రస్ట్, ఎబర్డ్ సంస్థను ఏర్పాటు చేసింది. దీనికి నాబార్డు సంస్థ, డీఆర్‌డీఏ, ఎంఎస్‌ఎంఈ, జిల్లా పరిశ్రమల కేంద్రం వంటి ప్రభుత్వ సంస్థ సహకారంతో వివిధ శిక్షణా కోర్సులు నిర్వహిస్తున్నారు.

## సౌకర్యాలు, కోర్సులివే...

సంస్థలో చేరిన నిరుద్యోగ యువతీ,యువకులకు, మహిళలకు వారు ఎంచుకున్న కోర్సుల్లో ఉచిత శిక్షణ ఇవ్వడంతోపాటు భోజన, హాస్టల్ సౌకర్యం కల్పిస్తారు. స్థానికంగా ఉండే వారికి అయితే మధ్యాహ్న భోజనం ఏర్పాటు చేస్తారు. టైలరింగ్, అకౌంటింగ్‌ప్యాకేజీలు, ఫ్యాషన్‌డిజైనింగ్, సెల్‌ఫోన్ మెకానిజం, టీవీ, ఏసీ, రిఫ్రిజిరేటర్, మగ్గం వర్క్, మిషన్ ఎంబ్రాయిడరీ, వీడియో, ఫొటో మిక్సింగ్ ఇలా స్త్రీలకు, పురుషుల కోసం 27 రకాల స్వయం ఉపాధి కోర్సులు అందుబాటులో ఉన్నాయి. ఆయా కోర్సులలో శిక్షణకు అవసరమయ్యే మెటీరియల్ మొత్తం ఉచితంగా అందజేస్తామని సంస్థ డైరెక్టర్ పి శివకుమార్ 'ఆన్‌లైన్'కు వివరించారు. నిష్ణాతులైన అధ్యాపకులతో శిక్షణ ఇవ్వడం మాత్రమే కాకుండా కోర్సులు పూర్తి అయిన తరువాత సర్టిఫికెట్లు ఇస్తారు. బ్యాంకు రుణం కోసం సిఫార్సు చేసి స్వయం ఉపాధికి బాటలు వేస్తారు. ప్రధానంగా ప్రాక్టికల్స్ ఇక్కడ ప్రాధాన్యం ఇస్తారు.

రెండు మూడుగంటల కోర్సు చెప్పడమే కాకుండా ఉదయం 10 గంటల నుంచి సాయంత్రం 5గంటల వరకు శిక్షణ ఉంటుంది. కోర్సు నేర్చుకునేవారిలో ఆత్మస్థయిర్యం పెంచేందుకు యోగా శిక్షణ కూడా ఇస్తారు. కనీస విద్యార్హతలు ఉన్న 18 నుంచి 35 సంవత్సరాలలోపు స్త్రీపురుషులకు ఆయా కోర్సుల్లో శిక్షణ ఇస్తారు. ప్రధానంగా గ్రామీణ యువతీ, యువకులకు ఇక్కడ ప్రాధాన్యత ఇస్తామని డైరెక్టర్ తెలిపారు.

## రైతుల సేవలో...

జిల్లాలో వివిధ పంటలు పండించే రైతులకు సలహాలు, సూచనలు ఇచ్చేందుకు ప్రత్యేకంగా సంస్థ క్యాంపులు నిర్వహిస్తోంది. మేలైన యాజమాన్య పద్ధతులు, శాస్త్ర, సాంకేతిక అంశాల్లో రైతుల్ని చైతన్యవంతం చేసేందుకు వ్యవసాయాధికారులతో ప్రత్యేక అవగాహన కార్యక్రమాలు నిర్వహిస్తారు.

వ్యవసాయాధారిత పరిశ్రమలైన పాడి, కోళ్ళపెంపకం, సేంద్రియ, కొబ్బరిపొట్టుతో, జీవన ఎరువుల తయారీ వంటి అంశాల్లో శిక్షణ ఇస్తారు. గుంటూరు కొత్తపేటలోని ఆంధ్రా బ్యాంకు గ్రామీణాభివృద్ధి సంస్థ (0863-2336912)లో ప్రతి మూడు నెలలకు ఒకసారి శిక్షణ తరగతులు నిర్వహిస్తారని తెలిపారు.



కొత్తపేటలోని ఎబర్డ్ సంస్థ



సంస్థలో శిక్షణ పొందుతున్న మహిళలు



సర్టిఫికెట్లు అందజేస్తున్న ఆంధ్రాబ్యాంకు ఏజీఎం శివాజీ

## లక్ష్యం విద్యారంగంలో అత్యున్నత విశిష్టత...

# బాపట్ల మహిళా ఇంజనీరింగ్ కాలేజ్

(AICTE న్యూఢిల్లీ చే ఆమోదించబడి ANU కి అనుబంధం చేయబడింది)

## బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ కీర్తి కిరీటంలో
## మహిళా ఇంజనీరింగ్ కాలేజ్ ఒక అమూల్యమైన ఆభరణం




విద్యా రంగంలో 48 సంవత్సరాలు మరియు సాంకేతిక విద్యా రంగంలో 29 సంవత్సరాల సుదీర్ఘానుబవం, మరియు ఇతరులకు ఈర్ష్యాకారకమైన పేరుప్రతిష్టలతో, బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీచే మహిళలకు మంచి నాణ్యమైన సాంకేతిక విద్యను అందిస్తూ, ఆదర్శ్మలలో అందరికీ, స్ఫూర్తిదాయకంగా ఉండాలనే మహోన్నత ఆశయంతో నెలకొల్పబడిన విద్యా సంస్థ.



శ్రీ ముప్పలనేని శేషగిరిరావు గారు
అధ్యక్షులు, బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ

- డాక్టరేట్స్ మరియు పోస్ట్‌గ్రాడ్యుయేషన్స్‌లో అర్హత కలిగిన మహిళా బోధనా సిబ్బంది.
- పూర్తిగా ఎయిర్ కండీషన్ చేయబడిన తరగతి గదులు, ప్రయోగశాలలు, గ్రంధాలయాలు మరియు పఠనా మందిరాలు.
- మంచి ఆహ్లాదకరమైన , రక్షణ, భద్రత కలిగిన వాతావరణంలో అటాచ్ చేయబడిన విశ్రాంతి గది సౌకర్యాలతో కేంపస్‌లోనే అధునాతనమైన హాస్టల్ వసతి.
- ఇంటర్నెట్‌కు ఫ్రీ ఏక్సెస్‌తో అధునాతన కంప్యూటర్ కేంద్రం.

71% పాస్‌తో ANU రీజియన్‌లో అత్యున్నత విద్యాసంస్థ. 81% డిస్టింక్షన్‌లో అన్ని ప్రధమశ్రేణులే.



డాక్టర్ డి.వి. లక్ష్మి
ప్రిన్సిపల్

అడ్మిషన్స్ కొరకు సంప్రదించండి
ది ప్రిన్సిపాల్

# బాపట్ల మహిళా ఇంజనీరింగ్ కళాశాల

బాపట్ల - 522101, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, ఇండియ ఫోన్ : 0091-8643-220977
Fax : 08643-220922, Cell : 97050 94699; website : www.bwec.ac.in

# ప్రగతి పథంలో తాడికొండ నియోజకవర్గం



తెనాలి మున్సిపాలిటి శతవార్షిక ఫోటో ఎగ్జిబిషన్‌ను సి.ఎం. రోశయ్యతో తిలకిస్తున్న మంత్రి వరప్రసాద్




తాడికొండలో జరిగిన బడిబాట సభలో ప్రసంగిస్తున్న మాణిక్యవరప్రసాద్



శ్రీక్రిష్ణదేవరాయుల పట్టాభిషేకం 5వ శతాబ్ధి సందర్భంగా సావనీర్‌ను ఆవిష్కరిస్తున్న మంత్రులు వరప్రసాద్, పనబాక, కన్నా, గాదె, కలెక్టర్, ఎంపి. రాయపాటి తదితరులు



ఎసి. కాలేజీలో జరిగిన వ్యాయామ, ప్రధానోపాధ్యాయులు సమావేశాన్ని జ్యోతి వెలిగించి ప్రారంభిస్తున్న మంత్రి మాణిక్యవరప్రసాద్



అమెరికాలోని న్యూజెర్సీలో మంత్రి మాణిక్యవరప్రసాద్‌ను సన్మానిస్తున్న ప్రవాసాంధ్రులు



శ్రీమతి సోనియాగాంధీ
ఎఐసిసి అధ్యక్షురాలు



డా॥ మన్మోహన్ సింగ్
ప్రధానమంత్రి



డా॥ కె. రోశయ్య
ముఖ్యమంత్రి



డా॥ వై.ఎస్.రాజశేఖరరెడ్డి
దివంగత సి.ఎం.



శ్రీ డి. శ్రీనివాస్
పి.సి.సి. అధ్యక్షులు



శ్రీ రాయపాటి సాంబశివరావు
పార్లమెంటుసభ్యులు, గుంటూరు



డా॥ రాయపాటి శ్రీనివాసరావు
ఎమ్మెల్సీ

మంచికి ఆకారం
మమతకు ప్రాకారం
సమతకు శ్రీకారం
మానవతకు నిర్వచనం
సమతకు నిదర్శనం
పట్టుదలకు ప్రతీక
అభివద్ధికి పతాక
ఆయన వీక్షణం ప్రగతి
ఆయన లోచనం సుగతి
అందుకే ఆయన అణువణువు
ప్రజలకే అంకితం.
తాడికొండ నియోజకవర్గ
సర్వతోముఖ అభివృద్ధే
ఆయన ఆశయం... ఆచరణం.
మాన్యశ్రీ **డి మాణిక్య వరప్రసాద్** గారూ
మీరు మా నియోజకవర్గానికే వరప్రసాదం.
ప్రజా సేవలో మీరు పునీతం.
ప్రజా ప్రతినిధిగా... మంత్రి వర్యులుగా,

**డా.. మర్రి చెన్నారెడ్డి**
మానవ వనరుల
అభివృద్ధి సంస్థ, హైదరాబాద్ ఛైర్మన్,
న్యాయవాదిగా
మీ ఖ్యాతి సువర్ణాక్షర
లిఖితం.



## తాడికొండ నియోజకవర్గ ప్రజలు
## ఆత్మీయ హితులు.. సన్నిహితులు

KLVA101M210





## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| పుస్తకం సంఖ్య | KLVA101M210 |
|---|---|
| పుస్తకం పేరు | ఆంధ్రజ్యోతి |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 89 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | No |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Bhanu |
| పేజీలు విడదీసినది | Bhanu |
| స్కాన్ చేసినది | Naveena |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |